# గోదావరి సాహిత్యశాల దృశ్యాలు



కందుకూరికి నివాళి



చిత్ర ప్రదర్శనప్రారంభిస్తున్న శ్రీమతి భారతలక్ష్మి



అద్దేపల్లికి సప్తతి సత్కారం అందిస్తున్న వల్లభాపురం జనార్ధన్,



పుస్తక ప్రదర్శనను ప్రారంభిస్తున్న సన్నిధానం నరసింహశర్మ






'జనకవనం' వేదికపై సత్యాజీ, వల్లభాపురం, యాసలపు సూర్యారావు, దాట్ల దేవదానంరాజు, జి. సుబ్బారావు





గోదారి కవితా సంకలనం ఆవిష్కరించిన ఎ. సత్యప్రసాద్




సాహిత్యం - మీడియా సదస
మాట్లాడుతున్న డి. సుజాతాదే
వేదికపై సభాధ్యక్షులు ఎస్. వెంకట్రావు



జ్వాలాముఖి ప్రారంభోపన్యాసం

'కథ' చర్చకు అధ్యక్షత వహించినజాతశ్రీ వేదికపై జి.ఎస్. చలం, యాళ్ళ అచ్యుతరామయ్య, కె. వరలక్ష్మి

తెలుగు సాహిత్య కేదారంలో పసిడి పంటలు పండించిన రాజమహేంద్రి సుక్షేత్రంలో 'సాహితీ స్రవంతి' నూతన అధ్యాయానికి నాం పలికింది. రెండు రోజుల పాటు నిర్వహించిన సాహిత్యశాల సాహితీ ప్రియులకు కర్తవ్యాన్ని బోధించింది. నేటి ఆధునిక తెలుగు కవిత్వ పోకడలన ప్రపంచీకరణ నేపథ్యంలో సమాజంలో వస్తున్న మార్పులను వివరిసూ కవులు, సాహితీ విమర్శకులు, వర్తమాన రచయితలు సందేశాలను అందించారు

సాహిత్య
ప్రస్థానం
జూలై - సెప్టెంబర్ 2006
సంపుటి : 4 సంచిక : 16

# మరింత ముందుకు...

రాజమండ్రిలో సాహిత్యశాల విజయవంతంగా ముగిసింది. నల్గొండలో వీర తెలంగాణా సాయుధ పోరాట 60వ వార్షికోత్సవ సందర్భంగా జనకవనం జయప్రదంగా జరిగింది. తిరుపతి, విజయనగరం, కరీంనగర్‌లలో సాహిత్యశాలలు జరగబోతున్నాయి. వీటి గురించి ఇప్పటికే సాహితీ మిత్రులు ఎంతో ఉత్సాహంగా వాకబు చేస్తున్నారు. తోడ్పాటుపై భరోసా ఇస్తున్నారు.

ఈ కాలంలో సాహితీ స్రవంతి అనేక ప్రచురణలు తీసుకొచ్చింది. త్వరలో మరో అయిదు పుస్తకాల వరకూ రానున్నాయి. జిల్లాల్లో ఆవిష్కరణలూ, సాహిత్య సభలూ విరివిగా జరుగుతున్నాయి.

వివిధ ప్రగతిశీల సంస్థలూ, వేదికలూ, పత్రికలూ తమవంతు కృషి చేస్తున్నాయి. ఈ విధంగా తెలుగు సాహిత్య రంగంలో ఆరోగ్యకరమైన, ఆలోచనాత్మకమైన కదలికలు పెరుగుతుండటం ఆనందం కలిగించే విషయం. ప్రజాసంఘాలు కూడా సాహిత్య కృషికి దోహదపడుతుండటం మంచి పరిణామం.

★ ★ ★

అన్నిటికన్నా ముఖ్యం – త్రైమాస పత్రిక సాహిత్య ప్రస్థానం మాస పత్రికగా మారుతున్నది. ఇది ఎంతోకాలంగా మిత్రులు, శ్రేయోభిలాషులు వ్యక్తం చేస్తున్న ఆకాంక్ష. అది ఆచరణ రూపం ధరిస్తున్న తరుణంలో పత్రికను మరింతగా పాఠకులలోకి, రచయితలలోకి తీసుకువెళ్లవలసిన బాధ్యత కూడా వారిపైనే వుంటుంది. ఇందుకు సంబంధించిన పూర్తి వివరాలు త్వరలో ప్రకటించగలము.

ముఖచిత్రం : యం. గణేశ్
లోపలి చిత్రాలు : శేఖర్, పాండు, రవినాగ్

## ఈ సంచికలో...



సంపాదకుడు
తెలకపల్లి రవి
ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య
మేనేజర్
కె. లక్ష్మయ్య

ఎడిటోరియల్ బోర్డ్ అడ్రస్ :
సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోను : 27660013, 27635136

## 2006 ఏప్రిల్, జూన్ సంచికల కవితలపై విశ్లేషణ

'సాహిత్య ప్రస్థానం' చేస్తున్న సాహితీ సేవకు అభినందనలు. గత సంచికలో 17 కవితలు వున్నాయి.

'అక్షరాన్ని చెక్కడం' (సైదులు ఐనాల) కవిత అత్యుత్తమంగా ఉంది.

ఇంకా 'నాలో సగం', 'శూన్య ఆకాశం' అనే రెండు కవితలు కూడా ప్రశస్తంగా వున్నాయి. 'పుష్పకం' కూడా మెచ్చుకోదగినదే.

నాల్గు గోడల ఇరుకు సందుల్లో అమాంతం పుస్తకాల్లో దిగబడటం కంటే మట్టిని ముద్ద చేసి కుండగా మలచడంలో గల ప్రయోజకత్వమే 'ప్రతిభ' అని చెప్పడంలో 'సైదులు' అభినందనీయుడు.

తల్లిలాంటి భార్య దొరకడం 'స్వామి' అదృష్టం. 'నాలో సగం' ఆమె అని సంబరపడటం హర్షణీయమే.

ఈ సంచికలో అన్ని కవితలు ప్రశంసనీయంగానే వుండటం విశేషం.

ప్రారంభం బావున్నా ముగింపు సరిగా శ్రద్ధ చూపని కవితలు 'బతుకమ్మ' మరియు 'నాది కాని ఉదయం నాకొద్దు', 'భరోసా' కూడా ఇంతే.

'విల్సన్ కవిత', 'మనిషి జాడ' కవిత్వంలో 'ధ్వని'పై శ్రద్ధ లోపించింది. రెండో కవితలో వివిధ భావాల మధ్య సమన్వయ లోపం ఉంది.

'స్నేహం', 'చక్రభ్రమణం', 'ఎడ్లు' కవితల్లో శైలి పై శ్రద్ధ వహించాలి.

'నవాబు' కవిత్వం బావున్నా 'అయోమయం' నుండి కవి బైటపడాలి.

**- తంగెళ్ళపల్లి కనకాచారి**
**ఉస్మానియా యూనివర్శిటీ క్యాంపస్.**

## ప్రకాశంజిల్లా విస్మృత కథ

సందర్భానికి గతంలో ఎన్నో రకాల జీవితాలను చిత్రించే రచించిన మంచి కథలను, విస్మృతిలోకి జారిపోయిన రచయితలను నేటి తరానికి పరిచయం చెయ్యాలనేది మా ఆలోచన. దీనిలో భాగంగానే విస్మృత కథా సంకలనం తేవాలనేది మా భావన.

ప్రకాశం జిల్లా కథా సాహిత్యానికి సంబంధించి ఏ వివరాలు తెలిసినా దయచేసి మాకు తెలియజేసి మా కథా కృషికి తోడ్పాటు నందించవలసిందిగా మనవి చేస్తున్నాము.

వివరాలు తెలియజేయవలసిన చిరునామా

**- మంచికంటి**
**బీచ్ రోడ్**
**కొత్తపట్నం - 523 286**
**సెల్ : 9949535695**

పత్రిక ఉత్తమ శీర్షికలతో సాహిత్య విలువలతో నడుస్తున్నపుడు సాహిత్య సమాజమే దాన్ని నడిపించుకుంటుందని నా అభిప్రాయం. అట్టి ఉత్తమ విలువలు పత్రిక్కి ఉన్నాయి. పత్రిక తప్పక ఉన్నత శిఖరాలను అందుకుంటుంది. పత్రిక మీద పాఠకలోకం ఉత్తర ప్రస్థానం శీర్షిక ఉండాలి. ఎప్పటికప్పుడు ప్రస్థానానికి అది "ఆత్మావలోకనం". పత్రిక తప్పక విజయం సాధిస్తుంది.

**- వి. సూర్యారావు,**
**అనకాపల్లి**



## "ఊహల" మర్రి

**పోతగాని సత్యనారాయణ**

విత్తనం విస్ఫోటనం
నేలను చీల్చుకొని
మబ్బు కప్పు కింద -
విస్తరించిన హరిత ఛత్రం!
ఊసులు చెబుతూ
ఊయలలూపే ఊడల నేస్తం!!
కొమ్మ కొమ్మకో మిఠాయి పటాలం
సన్నాయి రాగం ఆలపిస్తుంటే
కాళ్ళ కింద ఎండుటాకుల వంతెన దాటి
విశ్రమించే దేహాలకు ఊహల
పానుపయ్యేది!
ఎన్ని తుఫానులు ఊపేసినా
చెదరని సంతకమై
కిలకిలల సంగీతాలకు
నిత్యాశ్రయ వేలుపయ్యేది!
తాతల నాటి సంగతుల్ని
నెరసిన తలలు నెమరేస్తుంటే
పునాదుల నాటి పురాణాలు వినిపించేది!
కొంటె కాకులు రెట్టల మొట్టికాయలేస్తుంటే
వెనక్కు తిరిగి కిసుక్కున నవ్వుకునేది
ఈ రోజెందుకో...
అప్పిచ్చినోడు నిలదీస్తుంటే
పరువు కోసం పరితపించిన
సన్నకారు రైతులా
బాధను మింగిన గుండెతో
భాష్పజలాలు రాల్చింది
నడవడం తెలుసుకోవాల్సిన మనిషి
నరకడం నేర్చుకున్నాక...
ఊరిచివర ఒంటరి దుఃఖమై వగచి
కారుణ్యం మరచిన జనాల మధ్య
సగం కాలిన శవమై నిలచి
లిప్తలో విలుప్తమైంది!

# ప్రయోజనం



ప్రముఖ దారుశిల్పి కళాకారుడు డాక్టర్ రమేష్‌నాగ్ సిటీలోని ఓ ప్రసిద్ధ ఎగ్జిబిషన్ హాల్లో తన 'ఒన్‌మాన్‌షో' ముగించుకుని, అది విజయవంతమైన ఉత్సాహంతో, బరువైన పర్సుతో తిరిగి ఢిల్లీకి వెళ్ళడానికి టికెట్ కోసం తన ట్రావెల్ ఏజెన్సీని సంప్రదించేసరికి అంతులేని నీరసానికి గురయ్యాడు.

## నాగభూషణాచార్యులు ఎన్.వి.ఎస్.

ప్రముఖ దారుశిల్పి కళాకారుడు డాక్టర్ రమేష్‌నాగ్ సిటీలోని ఓ ప్రసిద్ధ ఎగ్జిబిషన్ హాల్లో తన 'ఒన్‌మాన్‌షో' ముగించుకుని, అది విజయవంతమైన ఉత్సాహంతో, బరువైన పర్సుతో తిరిగి ఢిల్లీకి వెళ్ళడానికి టికెట్ కోసం తన ట్రావెల్ ఏజెన్సీని సంప్రదించేసరికి అంతులేని నీరసానికి గురయ్యాడు. వాతావరణం సరిగ్గా లేకపోవడం చేత ఆ సాయంకాలం బయలుదేరాల్సిన ప్లేన్ కాన్సిల్ అయిందట. తిరిగి నాలుగు రోజుల దాకా టికెట్ దొరికే అవకాశం లేదు. అతని ఉత్సాహం అంతా నీరుకారిపోయింది. పోనీ ఎ.సి. ఫస్ట్‌క్లాస్‌లో రైల్లో వెడతారా అన్న ఏజెన్సీవారి ప్రశ్నకు ఆలోచించకుండానే 'నో' చెప్పాడు డాక్టర్ నాగ్. ట్రెయిన్‌లో ప్రయాణించే రోజులు గతించిపోయాయి. పోనీ ఈ నాలుగు రోజులు ఎలా గడపడం అని చెమట్లు కారేట్లు అటూ ఇటూ తిరుగుతూ ఆలోచించాడు. అప్పుడతని బుర్రలో తన ఇంటర్ క్లాస్‌మేట్, రూమ్మేట్ అయిన కైలాష్‌ప్రసాద్ గుర్తుకొచ్చాడు. ఇప్పుడతను తెలుగులో ప్రముఖ కథా రచయిత. ఇద్దరూ ఆనాటి స్నేహాన్ని ఇప్పటిదాకా ఏదోవిధంగా కొనసాగిస్తూనే వచ్చారు. ఇంటర్ తర్వాత ఇద్దరూ విడిపోయి దూరతీరాల్లో తమ చదువూ, ఉద్యోగాలను కొనసాగించినప్పటికీ, ఈసారి కలుసుకుని చాలా నెలలయింది. హైదరాబాద్ వస్తే తన వూరు రమ్మని, కొండమీద అద్భుతంగా కట్టబడ్డ గుడినీ, అందమైన పరిసరాల్నీ చూడొచ్చని వాడీ మధ్య రాశాడు. 'సరే ఈ నాలుగు రోజులూ అలా ఉపయోగిస్తాను' అనుకున్నాడతను. మిత్రుణ్ణి సర్‌ప్రైజ్ చేద్దామని కనీసం ఓ టెలిగ్రాం కూడా చెయ్యకుండా, ఓ టాక్సీ మాట్లాడుకుని గట్టుకిందపల్లికి బయలుదేరాడు.

పల్లెలంటే తాటాకు పాకలు, మట్టిగోడలు, రోడ్ల మీద పారే మురికి కాలువలు, ఆవులు, గేదెలు రోడ్డంతా ఆక్రమించుకొని మందలు మందలుగా వెళ్ళడాన్ని ఊహించిన డాక్టర్ నాగ్, ఆ ఊరు చూసి ఆశ్చర్యానికి గురయ్యాడు. ప్లాన్డ్‌గా కట్టినట్లు తీర్చిదిద్దబడిన నాలుగు వీధులు, ప్రతి రెండు రోడ్లు కలిసిన చోట ఓ మండపం చొప్పున ప్రధాన వీధుల్లో నాలుగు మండపాలు, అక్కడ నుండి సాగిన చిన్న వీధులు – ప్రధాన వీధుల్లోని ఇళ్ళన్నీ ఏదో ఒక ప్రత్యేక నిర్మాణ శైలిలో ఉండటాన్ని గమనించి ముక్కు మీద వేలేసుకున్నాడతను. కేవలం డబ్బు విరివిగా ఖర్చుపెట్టడం వల్ల కనిపించే డాబుసరికాదది. పోనీ అవేమన్నా ప్రాచీన కట్టడాలా అంటే అదీ కాదు. ఇరవై, ముప్పై ఏళ్ళ కిందట కట్టబడ్డట్లుగా వున్నాయి. కొన్ని సరికొత్తవి కూడా ఉన్నాయి.

ప్రసాద్‌ని సర్‌ప్రైజ్ చేద్దామన్న ఉత్సాహం కాస్తా నీరుగారిపోయింది నాగ్‌కి. ఆదివారమైనా, ఏదో మీటింగ్ వుందని కాలేజీకి వెళ్ళాట్ట! దగ్గర్లోని టౌన్‌లోని ఓ కాలేజీలో పనిచేస్తున్నాడతను. ప్రసాద్ ఇంట్లో లేకపోయినా కాలక్షేపానికి లోటు లేకుండా పోయిందతనికి. ప్రసాద్ ఇంట్లోనే ఓ పెద్ద లైబ్రరీ వుంది. అంతమాత్రమే కాదు. ప్రసాద్ ఇల్లు కూడా ఆ ఊళ్లో అతను చూసిన ప్రత్యేక నిర్మాణ శైలిలోనే కనిపించింది. ఆ ఇంటి దర్వాజాలు, తలుపులూ, కిటికీలు అన్నీ నగిషీ పనులతో చెక్కబడి వున్నాయి. పుస్తకాలు తీసి కూడా, వాటిని చదవడం మాని ఆ నగిషీ పనుల్ని చూడ్డంతో గడిపాడు. ఆ సాయంకాలం మిత్రుడు ప్రసాద్ వచ్చేదాకా. ప్రసాద్ వచ్చాక ఎన్నో చెప్పుకోవలసిన సంగతులు, పంచుకోవలసిన అనుభూతులూ వున్నా, ఉదయానికే ప్రోగ్రాం ఫిక్స్ చేసుకోవడం వల్ల, వాయిదాలు వేసుకుంటూ చివరికి ఏ తెల్లవారుజాముకో నిద్రకు ఉపక్రమించారు మిత్రులిద్దరూ.

\- - -

ఉదయమే టిఫిన్ చేసి, కొండపైకి బయల్దేరారు మిత్రులిద్దరూ.

"ముందే చెప్పడం మంచిది. 500కు పైనే వుంటాయి. మెట్లు... ఎక్కగలవో లేదో!"

ప్రసాద్ సందేహాన్ని తన చిరునవ్వుతో తీసిపారేశాడు డా॥ నాగ్. "ఈ అపార్టుమెంట్ల సంస్కృతి పెరిగాక మెట్లెక్కడం, దిగడం జీవితంలో ఓ భాగమైపోయింది మిత్రమా. ఓ విషయం చెప్పనా? కేవలం ఇందుకోసమే రెగ్యులర్‌గా ఎక్సర్‌సైజులు చేస్తున్నానంటే నమ్ముతావా?"

"సరే అయితే మంచిదే. ప్రసాద్ గుమ్మం బయటకు కాలు పెట్టబోయిన వాడు కాస్తా ఏదో గుర్తొచ్చి, డాక్టర్ నాగ్‌ని కాసేపు కూర్చోమని, లోపలికెళ్ళి మధుర పూజామందిరంలోని రెండు విగ్రహాలు తెచ్చి చూపించాడు మిత్రుడికి.

డాక్టర్ నాగ్ ఆ రెండు బొమ్మల్ని పట్టుకొని పరిశీలించాడు. పూజ చేసినట్లు గుర్తులున్న ఆ రెండు కొయ్యబొమ్మలూ అందంగా కూడా ఉన్నాయి. అందులో ఒకటి పానవట్టంతో, సర్పం చుట్టుకోబడిన శివలింగం, రెండోది వినాయకుని విగ్రహం. రెంటి నుంచీ ఏదో పరిమళం వస్తుంది. పరిశీలిస్తే అవి మంచిగంధంతో చెయ్యబడ్డట్లుగా కనిపించాయి. శివలింగం మీది సర్పం ఎంతో ఠీవిగా పడగ విప్పుకొని ఉండగా, వినాయకుడి విశాల నేత్రాల నుంచి దయారసం జాలువారుతోంది. ఎవరో నిపుణుడైన శిల్పి చెక్కినట్లుగా ఉన్నాయవి.

"విగ్రహాలు బాగున్నాయి... ఎంతక్కొన్నారు?" నాగ్ ప్రశ్నించాడు.

"ఇవి కొన్నవికావు... చేయించినవి!" చెప్పాడు ప్రసాద్.

"చేశారా... ఎవరు... ఎక్కడ?"

"ఈ ఊళ్ళోనే. మేస్త్రిగారని ఒకాయనున్నాడు ఈ ఊళ్లోనే. అవడానికాయన వడ్రంగం మేస్త్రియేగానీ, నిజానికాయన గృహ నిర్మాణ రంగంలో ఆల్‌రౌండర్. అంతేకాదు... ఒక విధంగా నాకాయన గురుతుల్యుడు!" ప్రసాద్ మాటల్లోనే ఆయన మీద తన గౌరవాన్ని వ్యక్తపరిచాడు.

"మేస్త్రిగారా... అదేమిటి ఆయనకు పేరు లేదా?" నాగ్ బొమ్మలు తిరిగిచ్చేశాడు.

ప్రసాద్ జాగ్రత్తగా వాటినందుకుని పూజా మందిరంలో పెట్టేసి వచ్చాడు.

"పేరెందుకుండదు... ఉంది.. అయితే ఆ పేరు చెబితే ఎవరికీ తెలియదు. మేస్త్రిగారంటేనే ఈ చుట్టుపక్కల ఆబాలగోపాలానికీ తెలుస్తుంది. ఇంతకీ ఆయన పేరు... పేరు..." అంటూ గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించి, "వీరబ్రహ్మం... కాదు కాదు... వీరభద్రం.... అంతే. వీరభద్రం ఆయన పేరు!" పేరు గుర్తుకొచ్చిన ఉత్సాహంతో చిరునవ్వు నవ్వాడు ప్రసాద్.

"అలాగా" తలపంకించాడు నాగ్" నీకాయన గురువన్నావు కదా... ఏ విధంగా... కొంపదీసి నువ్వు కూడా సరదాకి వడ్రంగం నేర్చుకున్నావా ఏమిటి?"

"కొంపతియ్యకుండానే నేను వడ్రంగం నేర్చుకోలేదు" అన్నాడు ప్రసాద్. "నేను భౌతికవాదినన్న విషయాలు నీకు తెలుసు కదా! అంతకన్నా ముందు చిన్నప్పుడు నేను హేతువాదిని. మేస్త్రిగారి వల్లే అప్పుడు నేను హేతువాదినయ్యాను!"

"ఆయన హేతువాది అయితే ఈ విగ్రహాలు వగైరా..."

మధ్యలోనే అందుకున్నాడు ప్రసాద్... "ఈ విగ్రహాలే కాదు, ఇంకా చాలా విగ్రహాల్ని చెక్కాడాయన. ఆయన కట్టిన ప్రతి ఇంట్లోనూ వారి కోరిక మేరకు ఏదో ఒక దేవుడి బొమ్మను చెక్కిచ్చాడాయన. దానికీ, ఆయన హేతువాదానికీ సంబంధం ఏమిటి? వృత్తిపరంగా ప్రజలు ఏది చేసివ్వమంటే అది చెయ్యాలి కదా!"

"నిజమే - వృత్తికీ, ప్రవృత్తికీ సంబంధం లేకపోవచ్చు" అంగీకరించాడు నాగ్.

"మూఢ నమ్మకాలను తను పాటించకపోవడమే గాకుండా, ఇతరులను కూడా పాటించవద్దని కోరేవాడాయన. ఆ నమ్మకాలకు గల కారణాలను ఆయన విశదీకరించే విధానం అందరికీ నచ్చేది. కనుకనే పరమ భక్తులు కూడా ఆయన్ను ఎంతో గౌరవించేవారు. ఆ విధంగానే మొదట ఆయన శిష్యుణ్ణయ్యాను."

"చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది. మీ గురువుగారి విషయం" అప్పటిదాకా నిలబడ్డ వాడు కాస్తా కూర్చున్నాడు నాగ్.

కైలాష్ కూడా అతని పక్కనే కూర్చుని, "ఇంతకీ నీకీ విగ్రహాలు చూపించిందెందుకో తెలుసా?" ప్రశ్నించాడు.

"నువ్వే కాదు, మా వూళ్ళోనూ, ఓ దారుశిల్పి ఉన్నాడు. తెలుసా... అని చెప్పడానికేగా?" చిరునవ్వు నవ్వాడు నాగ్.

"అలా అని కాదు గానీ, ఇక్కడి సంస్కృతి గురించి నీకు పరిచయం చెయ్యడానికే. దేశంలోనే ప్రసిద్ధి వహించిన నీతో పోల్చి చెప్పను గానీ, నువ్వన్నట్లు ఆయన కూడా ఓ దారుశిల్పే నిజానికి. అయితే ఒక చిన్న సందేహం... నువ్వయితే ఆ విగ్రహాలు చెక్కడానికి ఎంత టైం పడుతుంది... అంటే నీ స్టైల్ కాదనుకో..." మిత్రుని భుజం మీద చెయ్యి వేశాడు.

"నా స్టైల్‌ని నువ్వు బాగానే పరిశీలించినట్లున్నావే!"

"క్రిటిక్‌ని గాక పోయినా, నేనూ ఓ ఆర్టిస్ట్‌నే కదా! నువ్వు చెక్కుతావు... నేను రాస్తాను... అయితే నువ్వు జాతీయ స్థాయి అయితే, నేను ప్రాంతీయ స్థాయి అనుకో!" భుజాలు ఎగరేశాడు ప్రసాద్.

"మరీ అంత సీరియస్ కాకు మిత్రమా!" తేలిగ్గా నవ్వి అన్నాడు డా॥నాగ్. "ఒక స్థాయి వచ్చాక దాన్ని మెయింటెయిన్ చేయాలి కదా! అందుచేత నేను కాస్త టైం ఎక్కువే తీసుకుంటాను. ఆ విగ్రహాల మాదిరిగా చెక్కాలంటే సుమారు నాలుగయిదు రోజులు పడుతుందనుకో!" తన అంచనాను తనే తగ్గించుకుని చెప్పాడు.

"బాగా చెప్పావు. మరి మేస్త్రిగారు మారుమూల పల్లెటూరి నాటు మేస్త్రి కదా... ఆయన రెండు రోజుల్లో చెక్కిచ్చాడు. వాటిని నీ ఎదురుగుండానే" అన్నాడు కైలాష్ ఓ పూట కాలాన్ని పెంచి మరీ. "మరో ప్రశ్న... నువ్వు చెక్కిన బొమ్మల ఖరీదు వేలల్లో వుంటుందనుకో. మేస్త్రిగారయితే ఎంత తీసుకుంటారో ఊహించగలవా?"

"అది కూడా నువ్వే చెప్పు..." అంటూనే, "బహుశా వందల్లో ఉంటుందా!" అన్నాడు మళ్ళీ.



'పప్పులో కాలేశావు... ఆయనసలు ఇటువంటి వాటికి డబ్బులే తీసుకోరు!" తనే గెలిచిన ఉత్సాహంతో అన్నాడు ప్రసాద్. తను చేసిన బొమ్మను స్వీకరించిన వారు దాన్ని ఎంతో గౌరవభావంతో చూస్తారని ఆయనకు తెలుసు. అదే ఆయన పారితోషికంగా భావిస్తాడేమో తెలియదు. ముందే చెబుతాడు ఉచితంగా అయితేనే చేసిస్తానని!

"బాగుంది" అన్నాడు డాక్టర్ నాగ్.

"ఆయన్ను గురించి నీకు మరికొన్ని విశేషాలు చెప్పాలి. మనం కొండెక్కుతూ చెప్పుకుందాం" లేచాడు ప్రసాద్.

"ఓ.కే." డాక్టర్ నాగ్ అతన్ని అనుసరించాడు.

పెద్ద కొండ. దాని పాద ప్రదేశంలో పెద్ద గుడి. దాని ముందు అంతకన్నా పెద్దగా గాలిగోపురం. ఎప్పుడో జమిందారులు కట్టించిన గుడి అది. ఆ గుడి వెనుక వాహనాలలో ఉత్సవ విగ్రహాలను ఊరేగించే రకరకాల వాహనాలు. లోపలి దేవుడి విగ్రహాల కంటే అందంగా జీవకళతో రంగులు వేయబడి ఉన్నాయి. గరుడుడు శేషపానుపు, గజవాహనం మొదలైనవి వాటిలో కొన్ని.

వృద్ధుడైన గుడి పూజారి నారాయణాచార్యులు కైలాష్‌ని పలకరించాడు. ప్రసాద్ నాస్తికత్వం ఆయనకు తెలుసు. అందువల్ల శఠగోపం అతనికి తప్ప, మిగతా అందరికీ పెట్టాడు. బయటకొస్తుంటే పులిహోర ఇంత ఓ కారీబాగ్‌లో పెట్టి 'కొండపైకి వెడుతున్నారేమో తీసుకెళ్ళండి' అంటూ ఇచ్చాడు. తన మిత్రుణ్ణి ఆయనకు పరిచయం చేశాడు ప్రసాద్. పూజారి డాక్టర్ నాగ్‌కి నమస్కారం చేశాడు.

తిరిగి నమస్కరించి, "మీరు పెద్దవారు. చిన్నవాళ్ళకి నమస్కరిస్తారేంటి?" అన్నాడు డా॥ నాగ్.

"నేను వయస్సుకే పెద్దవాణ్ణి. మీరు పాండిత్యంలో, కళలో పెద్దవారు" అంటూ ప్రసాద్‌తో "మీ మిత్రులకు వాహనాలు చూపించారా?" అన్నాడు.

"గుడికి తీసుకొచ్చి వాటిని చూపించకుండా వుంటానా?" అన్నాడు ప్రసాద్.

"మేస్త్రిగారు ఈ ఊరొచ్చిన కొత్తలో వాటిని చేశారు. నేను ఆ యేడే ఇక్కడ పూజారిగా చేరాను" జ్ఞాపకం చేసుకున్నాడు పూజారి.

ఇరువైపులా పిట్టగోడల మధ్య కొండపైకి పెద్ద మెట్ల దారి ఉంది. దారిపక్కనే అక్కడక్కడ నాలుగైదు గుళ్ళు చక్కని గోపురాలతో ఉన్నాయిగానీ, నిర్వహణ సరిగా లేక పశువుల పెంటలతో, గొడ్ల కాపరుల విశ్రాంతి స్థలాలుగా ఉపయోగపడుతున్నాయవి. కొండపైకి కొంచెం దిగువగా విష్ణ్వాలయం, కొండ చిట్టచివర కొండ మల్లయ్య గుడి.

ఎలాగైతేనేం కొండపైకి చేరుకున్నారు మిత్రులిద్దరూ. ప్రసాద్‌కి అప్పుడప్పుడూ ఎక్కే అలవాటుంది గనుక అంతగా అలుపు లేకుండా ఎక్కాడు గానీ, డా॥ నాగ్ మాత్రం తీవ్రంగా అలసిపోయాడు. అందులోనూ సగం నుంచి నిలువు మెట్లుండటం వల్ల మధ్య మధ్య ఆగుతూ అలుపు తీర్చుకుంటూ ఎలాగైతేనేం ఎక్కాడు. శివాలయం మూసి వుంది. పూజారి ఏ ఒంటిగంట, రెండుకో వచ్చి నైవేద్యం పెట్టి వెడతాడు. ఇద్దరూ గట్టుపైన పెంచబడ్డ ఓ తోకమల్లె చెట్టు కింద అలుపు తీర్చుకోవడానికి కూర్చున్నారు. పూజారి ఇచ్చిన పులిహోర తిని, పక్కనే ఓ పాకలో కుండలోని నీళ్ళు ముంచుకుని దాహం తీర్చుకున్నారు. ఓ శివదాసు రోజూ రాత్రిపూట అక్కడే వుండి, పగలు ఊళ్ళోకి పోయి కాశీ కావడి వేసి భిక్షాటనతో జీవిస్తుంటాడు. అతను తెచ్చిపెట్టిన నీళ్ళే కొండపైకి వచ్చే భక్తులకి దాహార్తిని తీరుస్తుంటాయి.

ఆ ఎత్తయిన కొండ చుట్టూ 10, 15 కి.మీ. ప్రాంతం స్పష్టంగా కనిపిస్తోంది. ఊరికి ఒక పక్కగా నిండా నీళ్ళతో ఉధృతంగా ప్రవహిస్తున్న పెద్దవాగు, దాని వెనుక సుదూర ప్రాంతం వరకూ విస్తరించిన వరిచేలు, ఆ చేల మధ్య నుంచి పట్టణానికి దారితీసే తారురోడ్డు మెలికలు తిరుగుతున్న కొండచిలువలా మెరుస్తోంది. కొండకు మరోవైపు కనుచూపు మేర వరకూ ఎత్తుగా అడవిలా పెరిగిన మామిడితోటలు, మరో పక్క మెట్ట పంట చేల మధ్య కొండల వరసలు దిగంతాల దాకా వ్యాపించి వున్నాయి. వీటన్నిటినీ చూస్తూ మోచేతుల మీద వెనక్కువాలి అన్నాడు డాక్టర్ నాగ్. "ఇక చెప్పవోయ్ ప్రసాద్... మీ మేస్త్రిగారి గురించి... చాలా విశేషాలున్నాయన్నావుగా?" అన్నాడు.

"ఆయన్ను గురించి చెప్పాలంటే మొదట ఆయన ఈ ఊరికి వచ్చిందగ్గర్నుంచీ చెప్పాలి?" కైలాష్ మొదలు పెట్టాడు.

"ఓసారి మా ఫాదర్‌తో ఆయనే తన గురించి చెబుతుండగా విన్నాను. ఓసారి ఈ ఊరు మొత్తం తగలబడిపోయిందట. ఈ ఊళ్ళో చాలామంది సంపన్నులున్నా, ఇళ్ళు కట్టుకోవడానికి ఎవరూ తగిన శ్రద్ధ చూపలేదు. అందువల్ల ఎక్కువ పూరిళ్ళుగానే కాలక్షేపం చేసేవారు. దాంతో ఒకిల్లు అంటుకునే సరికి దాదాపు ఊరంతా తగలబడిపోయింది. దీనికి గాలి దుమారం తోడయింది. తగలబడ్డ ఊరిని పునర్నిర్మించాలిగా. అప్పుడు ఒక్కొక్కరిలో పునరాలోచన వచ్చి గట్టి ఇల్లే కట్టుకోవాలనుకున్నారు. అప్పటికే ఊళ్ళో మేస్త్రిగారి బావ వుండేవాడు. ఆయన గుళ్ళో ఈనాందారు. ఈ ఈనాందారు పేరుకే గాని, పనికి కాదు. ఒళ్ళు ఒంగదు. పనీ అంతంత మాత్రమే. అప్పుడాయన వయసులో, తనలో సగం కూడా లేని బావమరిదిని సాయం రమ్మని

పిలిచాట్ట! అంటే అప్పటికి మేస్త్రిగారి వయస్సు పదహారో, పదిహేడో మాత్రమే!"

"అంటే బావ బావమరిదిని పని నేర్చుకోవడానికి రమ్మన్నాడా?" సందేహం వ్యక్తంచేశాడు నాగ్.

"కాదు పనిచెయ్యడానికే! చెప్పాడు ప్రసాదు". పాపం మూడో క్లాసు చదువుతుండగానే తండ్రి చనిపోవడంతో సంసారభారం నెత్తిన పడిందట ఆయనకు. చదువు మానిపించి, ఓ పేరొందిన మేస్త్రిగారి దగ్గరకు దూరమైనా పని నేర్చుకొమ్మని పంపింది తల్లి. ఆ గురువుగారు ఈ పిల్లవాణ్ణి ఆప్యాయతతో చేరదీసి, తనింట్లో పెట్టుకుని, అయిదారేళ్ళలోనే తనంతటి వాణ్ణి చేశాడట. నగిషీ పనిలోనూ తర్ఫీదు ఇచ్చాట్ట. ఈయనసలే సూక్ష్మగ్రాహి కదా! ఏ పనైనా ఇట్టే పట్టేసేవాడు. ఈయన నగిషీ పనితనం చూడాలంటే మా ఇంట్లో తలుపులూ, దర్వాజాలు చూస్తే చాలు. నెమళ్లు, బాతులు, లతలు, పిట్టలు, చెట్లు, కాయలు, పువ్వులు... ఏ ఇంటి డిజైన్ ఆ ఇంటిదే. మరో ఇంట్లో మరోటి. ఇదంతా ఉడ్ స్కల్ప్చర్ కాదంటావా? ఇప్పుడవన్నీ కట్ డిజైన్స్ వచ్చాయనుకో. కేవలం వాటిని తలుపులు దర్వాజాల మీద అంటిస్తే సరిపోతుంది. కానీ పూర్వం అలా కాదు గదా! ఎంతో శ్రమతో చెక్కవలసి వచ్చేది. కార్పెంటరీలోనే అదో ప్రత్యేక శాఖగా అభివృద్ధి చెందింది. ఇళ్ళ ప్లానులు, నిర్మాణ శైలిలోనే కాదు, ఇళ్ళకూ మేస్త్రిగారే నిపుణుడైన పనివాడుగా ప్రసిద్ధి చెందాడు. ఆయన కట్టిన ప్రతి ఇంట్లోనూ ఈ కళ మనకు కనిపిస్తుంది!"



ఈ నగిషీ పనితనమే దారుశిల్పకళగా పరిణమించిందేమోనన్న ఆలోచన వచ్చింది డా॥నాగ్‌కు. అతను స్పెషలైజ్ చేసింది చిత్రకళనే అయినా, అతను ఎక్కువ శ్రద్ధ చూపి, నైపుణ్యం సంపాదించింది వుడ్‌స్కల్ప్చర్‌లోనే. దాన్ని గురించి అతని సిలబస్‌లో ప్రాథమిక విషయాలే వున్నాయి. కానీ అతని లెక్చరర్ ఒకాయన ప్రసిద్ధి చెందిన దారుశిల్పి కావడంతో, ఆయన దగ్గర వ్యక్తిగత శిష్యునిగా ప్రత్యేక శ్రద్ధతో ఆ శిల్పాన్ని అభ్యసించాడు. అందులో ఎంతో శ్రద్ధతో ఏళ్ళ తరబడి కృషి చేసి ఎన్నో ఉన్నత శిఖరాలు అందుకున్నాడు. దేశంలోనే ప్రసిద్ధి చెందిన దారుశిల్పిగా పేరుపొందాడు. దాంతోపాటు డబ్బూ సంపాదించాడు. ఈ వూరొచ్చాక, మేస్త్రిగారి గురించి విన్నాక ఏదో అసంతృప్తి... గిల్టీ ఫీలింగ్! యూనివర్శిటీ డిగ్రీలకు కళ లొంగదా? లేక యూనివర్శిటీ డిగ్రీల పరిధిలోకి కళని కుదించలేమా? ఆలోచనలో పడ్డాడు.

"ఏమిటి మిత్రమా పరధ్యానంలో పడ్డట్లున్నావ్... ఇల్లు గుర్తొచ్చిందా, లేక ఇల్లాలా?" కైలాష్ చిలిపిగా నవ్వాడు.

"లేదులే చెప్పు..." అన్నాడు నాగ్ తన ఆలోచనల్ని దారి మళ్ళించుకుని.

"బావ రమ్మంటే ఈ ఊరొచ్చాడని చెప్పాను గదా! మొదట్లో మేస్త్రి బావే అయినా పనంతా చేసేది బావమరిదే! బావ కాసేపు ఆ పనీ ఈ పనీ చేసి, ఏదో వంకతో బయటికెళ్ళిపోయేవాడట. కానీ వచ్చే డబ్బులు మొత్తం తానే తీసుకుని, చిల్లర డబ్బులు మాత్రం బావమరిది చేతిలో పెట్టేవాడట! బావే కదా అని ఏమీ అనలేకపోయేవాడట ఈయన. ఈ ఊరొచ్చిన రెండేళ్ళకే తల్లి పెళ్ళి చేసిందీయనకు. తల్లిని, భర్తపోయిన పెద్దమ్మను, చెల్లెలు చనిపోతే ఆమె కూతుర్నీ, ఇంతమందిని పోషించాల్సి వచ్చింది ఈయన. సంసారిక ఇబ్బందులకు తోడు బావ చేసే ఆర్థిక దోపిడీని తట్టుకోలేక బాధపడుతుంటే, ఓ షావుకారు ఈయనకు హితబోధ చేశాట్ట. బావ నుంచి తప్పుకొమ్మనీ, స్వంతంగా పనిచేసుకొమ్మనీ, అంతేగాక తను కట్టించబోయే ఇంటి పని ఈయనకే అప్పగించాట్ట. మొదట్లో ఇంత చిన్న కుర్రాడు మేస్త్రిగా ఎలా నిభాయిస్తాడా అని చాలామంది సందేహించార్ట. దానికి తోడు మరీ కురచ, బక్కపలచగా వుండేవాట్ట. కానీ పని ఇచ్చిన షావుకారే ఆశ్చర్యపడేట్లుగా, పెద్ద వాస్తు సిద్ధాంతి చేసిన ఇంటి ప్లాన్‌ని తన తర్కంతో షావుకారుని ఒప్పించి, మార్పించి, ఇంటి పని పూర్తి చేసేసరికి చూసేవాళ్ళే ముక్కున వేలేసుకున్నార్ట. దానికితోడు సింహద్వారం మీద చెక్కిన డిజైన్లు, తలుపుల మీద జంట నెమళ్ళ బొమ్మలు అత్యద్భుతంగా చెక్కేసరికి కొన్ని వారాలపాటు వాటిని చూడ్డానికే చుట్టుపక్కల జనం వచ్చేవార్ట."

"మేస్త్రిగారు హేతువాది అన్నావు కదా... ఆయన వాస్తుశాస్త్రాన్ని నమ్ముతాడా?"

"వాస్తు అనేది ఓ ఇంజనీరింగ్ ప్రక్రియ అన్నది ఆయన అభిప్రాయం. నిజం కూడా అంతే. పాతకాలపు అవసరాలను బట్టి అది ఏర్పడిందని, ఆధునిక అవసరాలను బట్టి కొంత మార్పు చేసుకుంటే సరిపోతుందని ఆయన భావన. అయితే వాస్తు పేరుతో జనాన్ని దోపిడీ చేసేవారిని ఆయన దగ్గరకు రానీయడు. రీజనింగ్ లేనిదే ఆయన దేన్నీ నమ్మడని ఇంతకుముందే చెప్పాకదా! అన్నీ ప్రాచీన భారతీయ శాస్త్రాల్లాగానే వాస్తుశాస్త్రంలో కూడా కొన్ని అవాంఛనీయ విషయాలున్నాయంటాడు ఆయన. వాస్తు పేరుతో జనాన్ని దోపిడీ చేసే సిద్ధాంతుల్ని ఆయన దగ్గరకు రానీయడు. ఈయన ఆమోదం లేనిదే వాస్తు సిద్ధాంతులు గీసే ప్లాన్‌ని ఇళ్ళ యజమానులు స్వీకరించరు. ప్లాన్‌లో ఏది ఎక్కడుండాల్సిందీ సిద్ధాంతులు ఆయన్ను ఒప్పించాల్సి వుంది.

"అంత తార్కికంగా ఆలోచిస్తాడన్నమాట!" ఆశ్చర్యపోయాడు డా॥ నాగ్.

"అవును. నా రచనలు తార్కికంగా వుంటాయని మెచ్చుకుంటావు గదా! ఆ తర్కం మొదట ఆయన్నుంచి నేర్చుకున్నదే. మూడో తరగతితోనే చదువు ఆపేసినా, స్వయంకృషితో ప్రాచీన సాహిత్యాన్ని విమర్శనాత్మకంగా అధ్యయనం చేశాడాయన. అందుకే ఆయన తర్కంలో అంత బలం వుంటుంది. ఇప్పటికే ప్రాచీన సాహిత్యానికి సంబంధించి నాలాంటి వాళ్ళకి ఏ సందేహం వచ్చినా ఆయన్నే ఆశ్రయిస్తాం!"

ప్రసాద్ కళ్ళలో కనిపించిన మెరుపును చూసి మొట్టమొదటగా అసూయకు గురయ్యాడు డా॥ నాగ్. "రచయితలు గానీ, కవులు గానీ కొద్దిగా వుంటే పెద్దది చేసి చూపిస్తారని అంటారు. నువ్వు వాస్తవిక వాదివని నాకు తెలుసు. నీలాంటి వాడి చేత కూడా పొగడ్తలు పొందిన ఆయనింకా జీవించి ఉన్నాడా? వుంటే ఆయన్నోసారి చూపిస్తావా?"

"తప్పకుండా!" అన్నాడు ప్రసాద్. "నువ్వడగక ముందే నిన్నాయన దగ్గరకు తీసుకెళ్ళాలనుకున్నా. ఆయన దగ్గరకు వెళ్ళే ముందు మరికొన్ని విషయాలు చెప్పాలి. కురచగా, బక్కపల్చగా ఒంగిపోయిన నడుంతో వుంటాడాయన. డెబ్బయ్యేళ్ళు దాటినా ఇంకా ఒంచిన నడుం ఎత్తకుండా పనిచేస్తూనే వుంటాడు. ఇప్పటికీ గృహ నిర్మాణానికి సంబంధించి ఏ సమస్య వచ్చినా ఆయన పరిష్కరించాల్సిందే. ఓ ఇన్సిడెంట్ గురించి చెబుతాను..." అంటూ టైం చూశాడు.

"ఫర్వాలేదు చెప్పు!" అన్నాడు నాగ్.

"ఈ ఊరికి 20 కి.మీ.లలో ఓ టౌన్ వుంది. వచ్చేప్పుడు నువ్వు చూసే వుంటావు. అక్కడ ఓ బిజినెస్ మాగ్నెట్ ఉన్నాడు. పెద్ద క్లాత్ షోరూంతో పాటు, ఓ డజను వ్యాపారాలున్నాయి. ఆ టౌన్ పక్కనే ఉన్న ఓ పల్లెటూరు ఆయనది. అక్కడో ఇల్లుంది. అక్కణ్ణుంచే టౌన్‌కి రోజూ వెడుతుంటాడాయన. ఆ ఇంటి పునాదిలో ఏ లోపం వచ్చిందో గాని ఆ ఇల్లు ఓ పక్కకు ఒరిగింది. దాన్ని బాగు చేయడానికి నలుగురైదుగురు ఇంజనీర్లకు చూపించాడాయన. అందరూ ఆ ఇంటిని తీసేసి కొత్తది కట్టుకోమన్నారు గానీ, దాన్ని సరిచేసే ఉపాయం చెప్పలేకపోయారు. ఆ ఇల్లు ఆయనకో సెంటిమెంటు. దాంట్లో ఉండటం వల్లే తన వ్యాపారం అభివృద్ధయిందని ఆయన నమ్మకం. ఎవరో ఆయనకు మన మేస్త్రిగారి గురించి చెప్పారు. వెంటనే కారేసుకు వచ్చి తీసుకెళ్ళాడీయన్ని. ఈయన వెళ్ళి ఆ చుట్టుపక్కల పెద్దల్ని ఎంక్వైరీ చేసి, పూర్వం ఆ ప్రాంతంలో ఏం వుండేదని అడిగాడు. ఎప్పుడో తాతలనాడు ఓ చెరువు ఉండేదట. వెంటనే ఈయన ఆ షావుకారుతో ఆ ఇంటి వెనక ఓ పెద్దగోతినిగానీ, నూతినిగానీ తవ్వించమన్నాట్ట. ఇంటి వెనక పెద్ద పూలతోట పెంచుతున్నాట్ట షావుకారు. అందువల్ల నూతినే తీయించాట్ట చాలా ప్రయాసపడి. జల పడటానికి చాలా లోతు తీయించాల్సి వచ్చిందట. ఆ నూతిని తీయించిన కొద్దికాలంలోనే భవనం తిరిగి నెమ్మది నెమ్మదిగా సరిగ్గా కుదురుకుందట. దాంతో షావుకారు బ్రహ్మానందపడిపోయి మేస్త్రిగారిని పిలిచి ఏం కావాలో అడగమన్నారట. ఈయన తడుముకోకుండా ఆ నూతిని ప్రజల ఉపయోగార్థం ఊరబావిగా ఒదిలెయ్యమని కోరాడట. ఇప్పటికీ ఆ ఊరివాళ్ళు ఈ విషయాన్ని కథలు కథలుగా చెప్పుకుంటారు!" ఆపాడు ప్రసాద్.



"వీళ్ళు చెప్పుకోవడమేనా... నువ్వు చెప్పేదేమీ వుండదా?" ప్రశ్నించాడు నాగ్ నవ్వుతూ.

"అంటే...?"

"అంటే ఏముంది... ఎన్నో విషయాల గురించి కథలల్లుతావుగానీ, ఈయన గురించి అల్లలేవా అని..."

"మా బాగా గుర్తు చేశావు నేస్తం! మేస్త్రిగారి గురించి నేను రాయకపోతే మరెవరు రాస్తారు? కానీ, ఇప్పుడు కాదు... సమయం వచ్చినప్పుడు రాస్తాను!" లేచి నిలబడ్డాడు ప్రసాద్. వాచ్ చూసుకుంటే ఒంటిగంట దాటింది. "పద పద...బయలుదేరుదాం..." మెట్ల కేసి దారితీశాడు.

"అవును ఆకలి దంచేస్తోంది..." అతన్ననుసరించాడు డా॥ నాగ్.

- - -

ప్రసాద్ ఆ సాయంకాలం తన మిత్రుణ్ణి మేస్త్రిగారింటికి తీసుకెళదామనుకున్నాడు. రాత్రి ఏడు దాటితే గాని ఆయన ఇంటికి రాడు. ఇంటికొచ్చాక కూడా అర్జెంటు పిలుపులు వస్తుంటాయి. అందుచేత ఆయన ఇంట్లో ఉన్నదీ లేనిదీ చూసి రమ్మని మనిషిని పంపించాడు. ఊళ్ళోనే ఆయన లేడని కబురు మోసుకొచ్చాడు మనిషి. ఎక్కడికెళ్ళాడో, ఎప్పుడొస్తాడో వివరాలు సరిగ్గా తెలుసుకు రమ్మని తిరిగి మనిషిని పంపిస్తే తెలిసిన విషయం – ఆ ఇంటిల్లిపాదినీ విషాదంలో ముంచింది. మధురకైతే ఏడుపొక్కటే తక్కువ. విషయమేమంటే మేస్త్రిగారి చిన్నమ్మాయి పార్వతికి జబ్బు తీవ్రమైతే పెద్దాసుపత్రికి తీసుకెళ్ళారట. ఇంట్లో ఎవరూ లేరట. దానికి తాళం పెట్టి ఉంది.

"పాపం దాని బతుకెలా అయిందో!" అంటూ విషయం విన్న మధుర గద్గద స్వరంతో ఇంట్లోకెళ్ళిపోయింది దుఃఖాన్ని ఆపుకుంటూ. ఆమె పార్వతి క్లాస్‌మేట్ అని చెప్పాడు. ప్రసాద్ అంతగా ఆమె బాధపడటానికి కారణం చెబుతూ. అన్నాడే గానీ అతని పరిస్థితీ అలాగే వుంది.

"పాపం... వృద్ధాప్యంలో మేస్త్రిగారికెంత కష్టం వచ్చిందో!'' అన్నాడు తన బాధని కప్పిపుచ్చుకుంటూ.

"ఇంతకీ పార్వతి ఎవరు? ఆమెకేమయింది?" డా॥నాగ్ మొదటిసారిగా మిత్రుడి విషాదంలో పాలుపంచుకుంటూ సానుభూతితో ప్రశ్నించాడు.

"పార్వతి ఆయన రెండో కూతురు. అందానికి అందం, తెలివికి తెలివీ ఆమె సొంతం, ఆ పిల్లంటే ఆయనకు పంచప్రాణాలు. అలాంటి అమ్మాయిని అప్పు చేసి మరీ ఓ ఉద్యోగస్తుణ్ణి వెతికి మరీ కట్టబెట్టాడు. వాడో దౌర్భాగ్యుడు. తిండి కూడా సరిగ్గా పెట్టక ఏడిపించాడు వాడు. జబ్బు చేస్తే మందులు కూడా సరిగా ఇప్పించకుండా, నాటుమందులేవో తినిపించి, రోగం ముదరబెట్టించి, పుట్టింట్లో వదిలిచక్కాపోయాడు. చివరికి జబ్బు క్షయగా తేలింది."

"అయ్యోపాపం... విచారించాడు నాగ్..." అయితే ఇప్పుడు క్షయకు మంచి మందులొచ్చాయి. ఏం ఫర్వాలేదు తగ్గిపోతుంది!" ధైర్యం చెప్పాడు.

"అంత ఆశాజనక పరిస్థితే వుంటే అనుకోవలసిందేం ఉంది?" ప్రసాద్ గొంతులో అదే విషాదం. "చివరి స్టేజిలో గాని తెలుసుకోలేకపోయారు. అక్కడికే ఆయన అందిన దగ్గరల్లా అప్పు చేసి మందులు ఇప్పిస్తూనే వున్నాడు..." స్థిమితంగా కూర్చోలేక పచార్లు మొదలుపెట్టాడు.

ఏం మాట్లాడాలో తోచక డా॥నాగ్ మౌనంగా వుండిపోయాడు.

మేస్త్రిగారిని కలుసుకోవాలన్న అతని కోరిక తీరనే లేదు. తను వెళ్ళే లోపు ఆయన ఊరి నుండి వస్తాడేమోనన్న చిరు ఆశ

ఆ రాత్రికే ఆవిరయిపోయింది. ఇంటికి తాళం పెట్టి ఇంటిల్లిపాదీ హాస్పిటల్ దగ్గరే ఓ గది తీసుకుని ఉంటున్నారట! మేస్త్రిగారిని కలుసుకోలేకపోయినా ఆయన ఇంటికి వెళ్ళి, ఆయన గీసుకున్న డ్రాయింగ్స్ నయినా చూద్దామన్న అతని ఆశ కూడా నెరవేరేలా కనబడలేదు. మేస్త్రిగారి ప్రసిద్ధి చెందిన శిల్పక్షేత్రాలు రామప్ప గుడి, హాలేబీడు, హింపి మొదలైన వాటిని స్వయంగా దర్శించి గీసుకున్న డ్రాయింగ్స్ అవి. కనీసం ఆ ఊరిలో ఆయన కట్టిన ఇళ్ళకు వెళ్ళి ఆయన చెక్కిన నగిషీ పనిని, విగ్రహాలనయినా ఫొటోలు తీసుకుందా మనుకున్నాడుగానీ, ఆ రాత్రే అతనికి ట్రావెల్ ఏజెన్సీ నుంచి ఫోన్ వచ్చింది... ఓ టికెట్ సంపాదించారట, అర్జెంటుగా వస్తే మర్నాడు 10 గంటల ఫ్లైట్‌కు వెళ్ళొచ్చునట! నాలుగు రోజులుండాలని వచ్చిన అతను రెండు రోజులకే సూట్‌కేసు సర్దుకోవలసి వచ్చింది.

- - -

హైదరాబాద్ ట్రిప్ తర్వాత ఓ రెణ్ణెల్లకి ప్రసాద్ నుంచి పెద్ద కవరొచ్చింది. పెద్దది గదా అని దాన్ని విప్పకుండా మర్నాడు ఆదివారం తాపీగా చదవొచ్చని తిరిగి భార్యకే ఇచ్చాడు డా॥ నాగ్.



ఆదివారం స్టూడియోలో స్టూల్ మీద కూర్చుని, సన్నని ఒంపు శీర్ణం, చెక్క సుత్తి పట్టుకొని, 'డాలర్ చేసిన హత్య' అనే ఓ శిల్పానికి మెరుగులు దిద్దడంలో నిమగ్నుడయ్యాడు. ఓ మల్టీ నేషనల్ కంపెనీ బ్రాండ్ పత్తి విత్తనాలతో పంట వేసిన రైతును పత్తికాయల నుండి పత్తికి బదులుగా బయల్పడ్డ పురుగు చంపడం ఆ శిల్పంలోని దృశ్యం. రైతు భయాన్ని ముఖకవళికలలో ఒంపు శీర్ణంతో సవరిస్తున్న అతనికి హఠాత్తుగా మిత్రుని ఉత్తరం గుర్తొచ్చింది. వెంటనే భార్య కోసం ఒక్క కేకపెట్టాడు. జువాలజీలో పి.జి. చేసిన ఆమె పాకశాస్త్రంలో రీసెర్చి చేస్తూ, ఏం ముంచుకొచ్చిందోనని వంటింట్లోంచి పరుగెత్తుకొచ్చింది. భర్త కవరు తెచ్చివ్వమనగానే చిరాగ్గా ముఖం పెట్టి "అంత అర్జంటేం వచ్చింది ఉత్తరానికి? రాత్రికి చదువుకోవచ్చు గదా... స్టవ్ కూడా ఆర్పి మరీ వచ్చాను!" అంటూ తిరిగి వెళ్ళబోయింది.

"ఆ ఉత్తరం ఎవరి నుండో తెలుసా? నా ప్రాణమిత్రుడు ప్రసాద్ నుంచి" అన్నాడతను కోపంగా.

"ఆమె బెదరకుండా, "అయితే ఏంటంట? అంతగా కావాలనుకుంటే నువ్వే వెళ్ళి తెచ్చుకోవచ్చుగా" అంది నిర్లక్ష్యంగా.

తన కోపం తనకే బాగోలేదని భావించాడేమో, గొంతులోకి తెచ్చిపెట్టుకున్న మృదుత్వంతో "తెచ్చుకోవచ్చు. కానీ దాన్ని దాచిపెట్టింది నువ్వే కదా!" అన్నాడు.

"అలాగా.. అయితే అది డ్రాయర్ సొరుగులో వుంది" చేతిలోని వంటల పుస్తకాన్ని పదిలంగా పట్టుకొని వెళ్ళిందామె.

"బిజినెస్ మాగ్నెట్ కూతుర్ని చేసుకున్నందుకు మంచిగా బుద్ధి చెబుతుంది" అనుకుంటూ శీర్ణాన్ని పక్కకు పెట్టి, వెళ్ళి ఉత్తరం తెచ్చుకున్నాడు. కవరులో ప్రసాద్ రాసిన ఓ కథ, దాంతో పాటు ఓ ఉత్తరమూ ఉన్నాయి. కథను తర్వాత చదువుదాం లెమ్మని పక్కన పెట్టి, ముందు ఉత్తరం తీశాడు.

"మిత్రమా!

నువ్వెళ్ళిన చాలా కాలానికి గానీ ఈ ఉత్తరం రాయడం కుదిరింది కాదు. ఈ ఉత్తరంతో పాటు మేస్త్రిగారిపై అదే మా గురువుగారిపై నేను రాసిన కథను కూడా పంపిస్తున్నాను. అంటే ఏం జరిగి ఉంటుందో ఊహించే వుంటావనుకుంటున్నాను. అవును... ఆయన చనిపోయారు. నువ్వెళ్ళిన వారంలోపే ఆయన కూతురు హాస్పిటల్‌లోనే చనిపోయేసరికి తట్టుకోలేకపోయాడాయన. పాపం ఓ రోజు హఠాత్తుగా గుండెపోటుతో పడిపోయి, ఆసుపత్రికి తీసుకెళ్ళే లోపే చనిపోయాడు. శవాన్ని చూట్టానికి ఆ చుట్టుప్రక్కల గ్రామాల నుంచి ఎన్ని వందల మంది వచ్చారో చెప్పలేను. ఆయన వల్ల ప్రయోజనం పొందిన వారికన్నా, పొందని వారే వారిలో ఎక్కువమంది ఉన్నారు. ధనికుల కన్నా పేదలే ఎక్కువ. ఏ పేదవాడు 'ఇల్లు వేసుకుంటాను, పారు చూసి పెట్టండి' అన్నా, ఉన్నవాడు ఉన్నట్టు వెళ్ళి, ముగ్గువేసి వచ్చేవాడు. ఏ తృణమో, పణమో ఇవ్వబోతే 'నీకు తింటానికే లేదు, నాకేమిస్తావ్' అని తీసుకునేవాడు కాదు. కలపను సెలక్టు చేయడానికి అడితీకి వెళ్ళినా, కమిషన్లకు కక్కుర్తిపడేవాడు కాదు. నిక్కచ్చయిన కలపను సెలక్టు చేసేవాడు. ఇంతటి పనివాడయినా ఆయన సంపాదించింది ఓ పూరిల్లు. పండని రెండెకరాల పొలం. దాన్ని కూడా ఆయన కుటుంబానికి దక్కనిచ్చారు కాదు. ఆయన వల్ల లబ్ది పొందిన వాళ్ళే, ఆయన నుండి ఎప్పటికప్పుడు ప్రతి పనికీ ఉచిత సలహాలు పొందిన షావుకార్లు, భూస్వాములూ ఆయన చనిపోయాక ఆ అప్పుంది, ఈ అప్పుంది అంటూ భార్యాపిల్లల్ని అమాయకుల్ని చేసి లాక్కున్నారు. ఆఖరికి పాడి గేదెను కూడా అప్పు కింద కట్టుకున్నారు. ఇదీ మా గ్రామం ఆయనకిచ్చిన బహుమతి! చూశావా జనం స్వభావం? మేలు చేసిన వారికే కీడు చేసిన వారిని ఏ పేరుతో పిలవాలి... కృతఘ్నులనేనా... అంతకన్నా సరైన పదం ఏదీ లేదా? మరో విషయం చెప్పాలి. ఆయన చనిపోయినప్పుడు చూట్టానికి కులమతాలకు అతీతంగా జనం వచ్చారు గానీ, ఆయన స్వకులస్తులు మాత్రం ఎవరూ రాలేదు. ఎందువల్లనో తెలుసా? కుల కట్టుబాట్లని కాదని, కులాలకు, మతాలకు అతీతంగా శిష్యుల్ని చేర్చుకుని పని నేర్పినందుకట! దాన్ని బట్టి ఆయన వ్యక్తిత్వాన్ని అంచనా కట్టు!

ఓ సామాన్య వడ్రంగిని నీలాటి గొప్ప కళాకారుడితో పోల్చినందుకు నువ్వు బాధపడిన సంగతి నేను గమనించాను. ఆయన శిష్యుణ్ణి కాబట్టి అలా చేసి వుంటానని నీ అభిప్రాయం కావచ్చు. ఇప్పటికీ అలాగే భావిస్తున్నావా? అయితే అలా పోల్చినందుకు నన్ను మన్నించు! ఉంటాను.

ఎప్పటికీ నీ మిత్రుడు
ప్రసాద్

ఉత్తరం అసాంతం చదివాడు డా॥ నాగ్. ఒక్కసారి కాదు, వందసార్లు! అతని కళ్ళు వర్షించడం లేదు గానీ, మనసు వర్షిస్తోంది. చాలాసేపటిదాకా అలాగే కూర్చుండిపోయాడు. మేస్త్రిగారిని చూడలేక పోయినా, ప్రసాద్ వర్ణనలను బట్టి ఆయన రూపాన్ని ఊహించాడు డా॥ నాగ్. ఆ ఊహావ్యక్తిది బక్కపల్చని, కురచరూపం కాదు... ఓ మహోన్నత రూపం! ఆ రూపం ఉన్న కొలదీ మరింత ఔన్నత్యాన్ని పొందుతోంది! ఆ రూపంలో తన ఎదుటి వస్తువులు, కళారూపాలు, తన స్టూడియో, తన చుట్టూ ప్రపంచం - అంతా ఒదిగిపోయింది. వెంటనే అతను డ్రాయింగ్ రూంలోకి వెళ్ళి లెటర్ పాడ్ తెచ్చుకుని గబగబా ఓ ఉత్తరం రాసి, అప్పటికప్పుడు బయటకు నడిచి వీధి చివరనున్న పోస్టు డబ్బాలో పడేశాడు. అందులో ఇలా ఉంది.

"ప్రియమైన ప్రసాద్!

మీ ఊరికి రావడమే నాలో ఓ అంతర్మధనానికి కారణమైంది. పెదభావాలతో నున్న నా ఆలోచనలు సరైన దారిలో పడ్డాయి. అప్పటిదాకా నేనో గొప్ప కళాకారుణ్ణని విర్రవీగాను. సోకాల్డ్ క్రిటక్స్, రూపాయల కట్టలూ నన్ను గర్వాంధకారంలో ముంచివేశాయి. మేస్త్రిగారి వ్యక్తిత్వాన్ని మొదట నువ్వు పొగిడినప్పుడు నన్ను ఇన్‌సల్ట్ చేస్తున్నట్లు ఫీలయ్యాను. అంతర్జాతీయ ఖ్యాతి గడించిన నన్ను ఓ గ్రామ స్థాయి వడ్రంగితో పోల్చడానికి చూడటం - నక్కకూ, నాగలోకానికీ పోలిక చెప్పడంగా భావించాను. కానీ నిజానికి మేస్త్రిగారి వ్యక్తిత్వం ముందు నేనెంత? నిజమైన కళాకారుడు ఆయన. వృత్తిలో కళను దర్శించాడాయన. కళంటే ఎగ్జిబిషన్ హాల్స్‌కీ, పత్రికా సమీక్షలకీ, ధనికుల పర్సుకీ పరిమితం కాదని తెలుసుకున్నాను. కళాకారుడు ఎప్పటికీ వ్యాపారస్తుడు కాలేడు. నిజమైన కళాకారుడు మోసగించబడతాడు గానీ, మోసగించలేడు. దీనికి మేస్త్రిగారి జీవితమే సాక్షి! ఆయన చనిపోయాక కూడా అదే రుజువయింది. నాబోటి వాళ్ళు స్వార్థం కోసం ఏవేవో కళా సిద్ధాంతాల్ని వాగాడంబరంగా వినిపిస్తారు. కానీ ఆయన తన కళను నిస్వార్థంగా ప్రజల దగ్గరకు తీసుకెళ్ళారు. కళకు నిజమైన ప్రయోజనం అదేనని గ్రహించాను. అప్పటి నుంచి నా మార్గం మార్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. ఈ ప్రయాణంలో ఎంతవరకు సఫలం అవుతానో కాలమే నిర్ణయిస్తుంది.

మేస్త్రిగారి గురించి కథ కాదు, జీవిత చరిత్ర రాయి. ఆయన సేకరించిన డ్రాయింగ్‌లు, చెక్కిన డిజైన్లు ఫొటోలతో సహా ప్రచురిద్దాం. డబ్బు కోసం తడుముకోవలసిన పనిలేదు. అది నా దగ్గర కావలసినంత ఉంది. మరోసారి హైదరాబాద్ వస్తున్నాను ఓ రెండు నెలల్లో. కానీ ఇదివరకులా ఆర్ట్ పేరుతో డబ్బు సంపాదనకు కాదు. గ్లోబలైజేషన్ వల్ల ప్రజాసామాన్యానికి కలిగే ఇబ్బందుల్ని చర్చించే ఓ సెమినార్ సందర్భంగా జరిగే ఎగ్జిబిషన్‌లో పాల్గొనడానికి. అది ముగిశాక మీ ఊరొస్తాను. ఆనాటికి నేను కోరినవన్నీ సిద్ధం చేస్తావని ఆశిస్తున్నాను. మేస్త్రిగారి కుటుంబానికి నా సానుభూతి తెలియజెయ్యి.

నీకు మరింత చేరువ కావడానికి ప్రయత్నించే
నీ రమేష్

---

# ఏడుస్తున్న కాడి

## వల్లభాపురం జనార్దన



కాడి
ఆహార ప్రపంచ గరిమనాభి
ఏడుస్తున్నది
ఏడిపిస్తున్నది
నడిపించే మేడి నడుం విరిగిపడింది
జవసత్వాల రెక్కలు తెగిపడి జటాయువయింది
కొండ్ర వేసే ఉత్సాహాన్ని
కొండ్రిగాడు కొట్టేసిండు
కొండకేసి చూసీ చూసీ అర్రు వాసిపోయింది
మోడానికి ఎదురుకోలు పలుకుదామన్న
రైతు మొగం వాడిపోయింది
తొలాయిటి సినుకు తొంటి సెయ్యి సూపింది
దమ్ము చేసే పని లేకుండా
ఊరించిన ఒకటీ అరా
తొలకరి సినుకుల ఎండమావిలో సిక్కుకొని
ఉన్న ధాన్యాన్ని ఊడ్చిపోసిన తెగువకు
ఉగ్గుబువ్వ లేకుండ వొయింది
మేఘ మధనాల మెరుపులెక్కడికి వొయినయో
ఎత్తిపోతల ఏతాలెక్కడ దాక్కున్నయో
హామీల వర్షాల్లో తడిసి ముద్దయి
విత్తనాల కోసం
ఎరువుల కోసం
పురుగు మందుల కోసం చేసిన
అప్పుల ఊబిలో పడిన రైతుకు
హుద్రాజు తప్పెట దరువు పిడుగు పాటయింది
ఎద్దులా పొద్దస్తమానం ఎల్జెలకలో పొర్లాడినా
ఆశల గోచీని ఎలుక కొరికేసింది
ఎట్టి తప్ప మిగిలింది లేదు
మట్టి తప్ప తినడానికేమీ లేక
కాలే రైతు కడుపు శిలువెక్కింది
ప్రకృతి పరిహాసంతో సగం
పాలక శుక్రాచార్య కంటిచూపుతో సగం
మొత్తంగా బతుకు
నవరంధ్రాలు మూసుకువొయినయి
నవనాడులు కూలపడినయి
రైతే రాజని గుర్తు చేసే తలగుడ్డ
ఉరితాడై ఉసురు తీసింది
మేడిపామై కాటేసింది

# వేదిక మీద జెండానౌతా



డాక్టర్ కాసుల లింగారెడ్డి

"రోగాల్ని నయం చేయడం కాదు ఇప్పుడు కావాల్సింది
రోగాల్ని సృష్టిస్తున్న ఈ వ్యవస్థని మార్చడం"

– డా॥ నార్మన్ బెతూన్

తడిని కోల్పోయి శ్వాసించలేక
శైశవగీతికొకటి
భూమి పొరల్ని చీల్చుకొని మొలక తల ఎత్తినట్లు
కడుపు చించుకొని నా చేతుల్లో వాలుతుంది –
ఒక్కోసారి పూర్తిగా మొలకెత్తని నారులోనో
నిండని పొదుగు కాలంలో పెంకు చీల్చుకొచ్చిన షేగుడ్డులానో
ఒంటుపిరి ప్రాణంతోనో
ఒద్దికగా లేని నిర్మాణంతోనో
శైశవ గీతికొకటి వడలిన గులాబి రెమ్మవోలె
నా చేతుల్లో వాలుతుంది –
ఒకప్పుడు తుఫానుకు వణుకుతున్న చిటారుకొమ్మలానో
అపస్మారకంగా కాళ్ళు తన్నుకుంటున్న తలతెగిన మేకలానో
ఒంట్లో నీరులేక వడలిపోయిన కరివేపాకు కాడలానో
కాలుతున్న కుమ్మరివాము సెగలానో
స్వరం కోల్పోయిన చైత్రపు కోయిలలై
నా గదిలో వాలుతారు –
సలుపుతున్న గాయాలతోనో
తెగిపడిన అవయవాలతోనో
బాధల బరువును దేహాన మోస్తూ
గుండె వినిర్మాణంతోనో
కండరాల శక్తి క్షీణతతోనో
వ్యవస్థ మోపిన దారిద్ర్యపు శిలువను మోస్తూ
క్రుంగుతున్న ప్రొద్దులై
నా గదిలో వాలుతారు –
బాంబుల యుద్ధ విధ్వంసం నుంచి
బతుకుల్ని బంకర్లలో దాచుకున్నట్టు
నేను ఆసుపత్రి పడకల మీద
చావు గద్ద వేటు నుంచి పిల్లల్ని సంరక్షిస్తాను –

గడియారపు ముళ్ళ మీద
ఒంటరి చీకటి రాత్రుల నురితీసుకుంటూ
వస్తుగత సత్యాల వెలుగుదారుల్ని చూపుతూ
కార్యకారణ సంబంధాల చిక్కుముళ్ళు విప్పుతూ
గతి తర్కపు గమనాల్లో
వైరుధ్యాల వివరిస్తూ
కాలానికి నా కండ్లల్ల ఉదయించిన సూర్యుళ్ళని దానం చేసి
వాళ్ళకి రోజుల్ని కొంటుంటాను

– – –

వాళ్ళు రోగార్త దేశంలో
స్వస్థత సరుకు కొనలేనివాళ్ళు –
వ్యవస్థీకృత కారణాలు వెతుక్కోలేక
ఆకాశవీధిలో ఐదు నక్షత్రాల మెట్లెక్కలేక
"అమ్మలారా! తల్లికి బోనాలు పెట్టండి
సత్తయ్య సందుకు తాయెత్తు కట్టయ్యా
మదార్‌సాబ్ మొగుళ్ళకు మంత్రం వెయ్యండి
ఫాస్టర్‌గారూ పాతదో కొత్తదో నిబంధన తెరవండి"
మధ్యయుగపు మౌఢ్యపు చీకట్లలో
కర్మఫలాల ముందు మోకరిల్లి
శాస్త్రాన్ని సంజీవిని చేసి
మనిషిని దయ్యాన్ని చేసి
ప్రాగ్మాటిజమ్ పడగ నీడన
నా తోటలో రాలిన గులాబీ ముళ్ళను
గుండెల్లో గుచ్చుతారు –
నేను స్టెతస్కోపును కర్రగా నాటి
వేదిక మీద జెండానౌతా –

---




పెంటమ రాజునరసింగరావు

సున్న పక్కున
నవ్వింది
ఎదురు తిరుగని
వాడిని చూసి.

ఫుల్‌స్టాప్
చూస్తుంటే
ఆశ చచ్చేవరకు
పరుగెడతానంది

చిత్తం గాలితో
పోటీ పడింది

విత్తం ప్రాణంతో అంది
"నీ కన్న తీపి నేనే"

లైంగిక వేధింపుల
భరించే గుండె

బండ కంటే
చైతన్య హీనం

గోడమీద బొమ్మ
సెక్సీగా వుంది
అందని ద్రాక్ష కోసం
కళ్ళకి ఆశ

నిన్నటి దాకా
అన్ని పార్టీలను ఊరించిన ఓటు
నోటును చూశాక
ఓడింది

# సమీక్షా పర్వం



మొహీబుల్లాఖాన్

## బ్రతుకు బాటకు వెలుగు "పడవలో చిన్నదీపం"



కవిత్వం ఒక అన్వేషణ. ఆత్మ పరిశోధన. అంతర్ముఖుడైన మనిషి తన గురించి, తన చుట్టూరా ఉన్న జీవితాన్ని గురించి చేసే వ్యాఖ్యే కవిత్వం. శ్రీమతి రేణుక అయోల ప్రకటించిన మొదటి కవితా సంకలనం "పడవలో చిన్ని దీపం". ఇందులో 53 కవితలున్నాయి. ఈమెది కాల్పనిక సౌందర్యం చూపే కవిత్వం. అనుభూతి వ్యక్తీకరణమే ప్రధానం ఈమెకు. ఈ కవితలు సరళమైన భాషలో సూటిగా ఉన్నాయి. అక్షరాన్ని ఆలోచనగా ప్రసరించి అంతరంగంలోకి ప్రవహిస్తారీమె.

జ్ఞాపకాలు మనకు రకరకాల అనుభూతుల్ని కలిగిస్తాయి. కొన్ని ప్రమాదాన్ని, కొన్ని ప్రమోదాన్ని.. ప్రమాదకారకాల్ని కాలమే మెల్లిగా మరిపిస్తుంది. ప్రమోద కారకాల్ని ఏకాంతంలో మనమే మననం చేసుకుంటాం. దీన్నే రేణుక 'చిందర వందర అయిన కాగితాల్లో / ఒకటో రెండో నన్ను / శీతల పవనంలా పలకరించాయి / ఆ పలకరింపు గుర్తులు / ఎండిన భూమ్మీద చినుకులు' - అంటూ మన నైరాశ్యపు ఏకాంతాల్ని ఆనందమయ జ్ఞాపకాలు ఎలా దూరం చేస్తాయో చెబుతారు.

ఆకలి నిజం. మిగతావన్నీ నమ్మకాలు. ఆకలి మనిషిని నిస్సహాయుణ్ణి చేస్తుంది. ఎంతటి అకృత్యాన్నైనా చేయిస్తుంది. ఆ అకృత్యం తాలూకు ఆనవాళ్ని నిర్దాక్షిణ్యంగా తొలగించుకుంటాం, మనస్సును చంపుకుని కొందరికి ఆకలి రాత్రే వేస్తుంది / రాత్రి ఆకలి రౌతులేని గుర్రంలాంటిది / ఉషోదయంలో / చెత్తకుండీలో / మరణ వేదన అనుభవించిన / లేలేత కుసుమం ఆకలి గాయం - అంటూ అత్యంత దయనీయంగా ఆకలి గాయం తాలూకు "చీకటి తప్పు" ఫలితమైన లేలేత కుసుమాన్ని స్పృశిస్తారీమె.

కవిత్వం రాయాలని కూర్చుంటే ఎంత తపన పడ్డా (కవిత్వపు) తడి తగతలక రాత్రి నిట్టూర్పులతోనే గడిచిపోయిందట. తెల్లవారినా ఒక్క అక్షరం రాలలేదట - తెల్లారిపోతుందిగాని / ఒక్క అక్షరం పడదు/ విసిగి వేసారి వెళ్ళిపోతున్నప్పుడు / కిటికీలోంచి చల్లటి పిల్లగాలి స్పర్శ / అప్పుడు అక్షరం ఏదో / నన్ను చేరుకొంటుంది - అంటారీమె. దీర్ఘకాలం వేచి చూశాక అంటే ధనాత్మక ఫలితం అమృతం కదా! కవిత్వం మూడ్‌ని ఈ కవిత వెలువరిస్తుంది.

పెరుగుతున్న సౌకర్యాల మధ్య తరుగుతున్న సంతృప్తిలోనే మానవజాతి విషాదం దాగి ఉంది. సృష్టిలో ప్రతీ వస్తువుకి విలువ ఉంటుంది. ఉపయోగంలేని వస్తువేదీ ఉండదు. మన కళ్ళకెపుడూ రుణాత్మక విలువలే కనబడుతుంటాయి. ధనాత్మక విలువలు కనుమరుగవుతుంటాయి. మనకర్థం కానంత మాత్రాన దాని విలువను తీసిపారేయడం అర్థం లేనితనం అంటారీమె. మన లేకితనాన్ని చూపెడుతూ - నినాదాలు లేవని/ విప్లవం కాదనడం / అర్థం లేనితనం - అంటారు.

అవున్నిజం. గొప్ప ఎమోషనల్ ఫీలింగ్స్ అరవవు, వ్యాపిస్తాయి రహస్యంగా.

ఈమె కవితల్లో ప్రకృతి సౌందర్య వర్ణన, భావనా శక్తితో నిండి ఉంది. "నీటి చినుకు" కవితలో చినుకు నేలపై పడటాన్ని వర్ణిస్తూ - దాహంతో అలమటించి నేల పొరలు నీటి చుక్కని తల్లిని వదలని బిడ్డలా ఆర్తిగా, గట్టిగా పట్టుకున్నాయంటారు. Long a waited fruit in sweeten కదా! ఆఖర్న - పరిమళాలు వెదజల్లే / ఆ చినుకు / ఓ ప్రాణ పుష్పం - అంటూ నీటి విలువని ప్రాణ సమానంగా భావిస్తారు కవి.

కాలంతో బాటు వార్ధక్యం రావడం సహజం. దాన్ని హుందాగా స్వీకరించడంలోనే మన అంతఃసౌందర్యం ఉంటుంది. అయితే అసూయ, ద్వేషాగ్నుల వల్ల మనం వయసు మీరిన వాళ్ళలా కనబడతాం. మనసు స్వచ్ఛంగా ఉంటే ముదిమిలో కూడా మోహనంగా ఉండగలం. ఎన్నిసార్లు తిరగేసి చూసినా / ముసలి మనసు/ ముడతల ముఖాన్ని చూపిస్తోంది / అంతరంగాన్ని ప్రక్షాళన చేసుకోవాలి/ మళ్ళీ అద్దాన్ని తిరగేసి చూసుకొన్నప్పుడు / చిన్ననాటి చిన్నారి రూపం కనిపించాలి అంటూ అంతరంగ ప్రక్షాళన ఆవశ్యకతను సూచిస్తారు.

ఈమె నుండి మరింత పదునుతో, పసతో మరిన్ని సంపుటాలు రావాలని ఆకాంక్ష.

**(పుస్తకం : పడవలో చిన్ని దీపం, రచయిత : రేణుక అయోల, పేజీలు : 104, వెల : రూ. 50/-, దొరుకు చోటు : రేణుక అయోల, ఫ్లాట్ నెం. 210, భాగ్యశ్రీ అపార్ట్‌మెంట్స్, స్ట్రీట్ నెం.14, లేన్ నెం. 2, తార్నాక, సికింద్రాబాద్-17)**

## దాట్ల దేవదానం రాజు




# నిద్ర తలుపు అను పొడవైన గది వేళ్ళు

మంచి కవిత్వం చదివినప్పుడు మన అస్తిత్వపు పొలిమేర్లు విశాలంగా విస్తరించాలంటాడు ఇస్మాయిల్. అట్లా విస్తరించే క్రమంలో తన అనుభవాల్ని అప్రయత్నంగా భాషకి ఒదిగించుకునే సహజ స్వచ్ఛత కొందరి కవుల్లో కనిపిస్తుందని ఈ కావ్యానికి రాసిన ముందుమాటలో అద్దేపల్లి అంటారు. తను తేలికవ్వడం కోసమో లేదా ఒకానొక ఒంటరితనం బాధించినపుడో వైయక్తిక భావ సంచయానికి అక్షర రూపం ఇచ్చేటపుడు కవి మీద ఎవరి ప్రభావమో పడవలసిన అవసరం లేదు. ఎక్కడో ఆంధ్రదేశానికి దూరంగా ఉద్యోగిస్తున్న బి.ఎస్.ఎమ్. కుమార్ తీరు కూడా అంతే. కుమార్ సామాజిక వేదనను ప్రకటించడానికి కూడా క్లిష్టమైన శైలిని ఎంచుకోవడం ఈ కవితల్లో చూస్తాం. కవులు నిరంతరం కొత్త పదబంధాల్ని సృష్టించుకోవడానికి ప్రయత్నిస్తుంటారు. అసంబద్ధ కవులుగా ముద్రపడినవాళ్ళు మరీ ఎక్కువ కొత్తదనం కోసం పాకులాడతారు. కుమార్ ఈ కవితా సంపుటి ద్వారా ఆ జాబితాలోకి చేరాడు.

దుఃఖాలు నీడల్లా కదులుతూ కుమార్ ఒక అన్వేషకుని అవతారం ఎత్తాడు. ఒక పాదం తర్వాత సంబంధాన్ని మధ్యలో తెంచేస్తాడు. ఈ తెగిన కొస మరొక సంబంధంలేని ఊహతో ముడిపడుతుంది. అక్కడే పాఠకులు ఇబ్బంది పడతారు. ఒక ప్రయత్న పూర్వకంగానే కుమార్ అర్థాన్నీ, శబ్దాన్నీ విడదీస్తాడు.

కొన్ని చోట్ల కుమార్ ఊహా వైచిత్రికి అబ్బురపడతాం. నిరాడంబర శైలి, అరుదైన అంతరంగ మథనం, నిజాయితీ మనల్ని చదివిస్తుంది. అధివాస్తవిక దృష్టి కూడా మనలో ఒక కొత్త ద్వారాన్ని తెరుస్తుందని చదవగానే అనిపిస్తుంది. 'వర్షంలోని వారు' కవితా శీర్షిక చదవగానే మనకెంతో అనుభవమైన సంగతే కదా అని ముందు కురుకుతాం. మరోసారి చదివితేనే గాని పదచిత్రాలు రూపుకట్టవు. 'పాము చర్మం మీద జారే నీటిబొట్టు స్పర్శ' కళ్ళని దేహం నిండా లాగి ముద్దగా పిసుకుతున్నారు' 'నిద్ర పుంతలో కస్సున దిగిన ముల్లులాంటి నీ పిలుపు', 'భయాల పంజరం నిద్రలేని కన్నుని వేటాడి నిద్రనిస్తుంది' ఇట్లాంటి వాక్యాలు ప్రతీకాత్మకంగా సాగుతాయి. ఏ ఇజాల ప్రభావము లేని శుభ్ర కవిత్వాన్ని కుమార్ నుంచి ఆశించవచ్చు.

**(నిద్ర తలుపు అను పొడవైన గది వేళ్ళు, కవి : బి.ఎస్.ఎమ్. కుమార్, పేజీలు : 60, వెల : రూ. 50/-, ప్రతులకు : సూర్య ప్రచురణలు, ఫ్లాట్ నెం. 21, ఫ్లాట్ నెం. 124, సూర్య సరోజ్ అపార్ట్‌మెంట్స్, హుడా కాంప్లెక్స్, హైదరాబాద్ - 500 027.**

## అంపశయ్య నవీన్




# కొమ్మలు రెమ్మలు

యగళ్ళ రామకృష్ణకు అరవయ్యేళ్ళు నిండిన సందర్భంగా ఈ షష్టిపూర్తి అభినందన సంచికను 'మో', 'స్మైలు'ల సంపాదకత్వంలో వెలువరించారు. ఈ అభినందన సంచిక పేరే 'కొమ్మలు రెమ్మలు'

'సౌగంధికం' అన్న పేరుతో ఈ అభినందన సంచికకు ముందుమాట రాసిన 'మో' ఇలా అన్నారు.

ఈ అభినందన సంచిక ఎందుకు? ఎవరికోసం?

యగళ్ళ రామకృష్ణ కోసం.

ఈ షష్టిపూర్తి అభినందన సంచిక... ఓ ఆవృతం పూర్తి చేసుకున్నందుకు"

ఇంతకీ ఈ యగళ్ళ రామకృష్ణ ఎవరు?

ఈయనను గురించి ఈయన పేరు తప్ప మరో మాట ఈ పుస్తకంలో లేకపోవడం గమనార్హం.

'మో'గారే అన్నట్టు "అసలు ఇదో (అభినందన సంచిక) సాకు. A Pretext for a text."

ఈ పుస్తకంలో వివిధ రంగాలలో ముఖ్యంగా సాహిత్య, సాంస్కృతిక రంగాలలో విశేష కృషి చేసి లబ్ద ప్రతిష్టులైన ఎందరో తెలుగు మహామహుల సంక్షిప్త జీవిత చరిత్రలు నిక్షిప్తం చేయబడ్డాయి. ఏదో సందర్భంలో ఆయా రచయితలు తమను గూర్చి తాము రాసుకున్న రచనల్ని, వాళ్ళను గూర్చి ఇతరులు రాసిన ఖండికల్ని ఈ పుస్తకంలో పొందుపరిచారు.

ఈ గ్రంథాన్ని రెండు భాగాలుగా వెలువరించారు. 'సౌగంధికం' అన్న పేరుతో మొదటి భాగం - ఈ భాగంలో వెన్నెలకంటి సుబ్బారావు నుండి మొదలెట్టి చలసాని ప్రసాదరావు వరకు 111 మంది మహామహులు తమను గూర్చి తాము రాసుకున్న సంక్షిప్త స్వీయ చరిత్రల్ని మనం చదువుతాం. రెండో భాగం "చందన చర్చ"లో సి.పి. బ్రౌన్‌తో మొదలెట్టి రజనీకాంతారావు వరకు ఎందరో మహానుభావుల్ని గూర్చి ఇతరులు రాసిన సంక్షిప్త వ్యాసాల్ని చదువుతాం. ఇలా ఈ గ్రంథంలో 194 సంక్షిప్త వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఎప్పుడెప్పుడో, ఎక్కడెక్కడో, ఎవరెవరో యేయే పత్రికలోనో రాసిన ఈ రచనలన్నింటినీ ఒకచోటికి చేర్చి 'కొమ్మలు రెమ్మలు' అన్న పేరుతో (తెలుగు సాహిత్యపు కొమ్మలు రెమ్మలుగా) ఈ గ్రంథాన్ని ప్రచురించిన 'మో', 'స్మైల్'లను అభినందించాలి.

**(కొమ్మలు రెమ్మలు, తెలుగు సారస్వత మూర్తుల స్వీయ, జీవిత చరిత్రలలోని సత్య శోధనాంశాలు. సంపాదకులు : 'మో', 'స్మైలు', ప్రతులకు : మో, 303, రైజ్ ఇన్ వ్యూ, రోడ్ నెం. 3, బంజారాహిల్స్, హైదరాబాద్ - 500 034. పేజీలు : 350, వెల : రూ. 250)**

గేరా




# "జారుడుబండ"పై నిలబెట్టిన పల్లె ప్రజల జీవితాలు

చితికిపోతున్న గ్రామీణ జీవితాన్ని, ఛిద్రమైపోతున్న వాళ్ళ మానవ సంబంధాల్ని, వాళ్ళ బాసలోనే, యాసలోనే బలంగా చిత్రీకరించిన కథల సంపుటే. ఎలికట్టె శంకరరావు రచించిన "జారుడుబండ". ఇందులో మొత్తం 13 కథలున్నాయి. దాదాపుగా అన్నీ గ్రామీణ జీవితాల్ని వస్తువులుగా చేసుకొని రాసినవే!

ఆధునిక యంత్రాలు, యంత్ర పరికరాలు, పనిలో రాశిని, వాసిని పెంచేందుకు ఉపయోగపడాలే గానీ, శ్రామికుల పొట్టగొట్టేవిగా ఉండకూడదు. పారిశ్రామిక రంగంలోనే కాకుండా, వ్యవసాయ రంగంలో కూడా ప్రవేశించిన యంత్రాలు, వ్యవసాయ కూలీల కడుపుల మీద ఎలా కొట్టాయో చెప్పే కథే ఇందులోని మొదటి కథ "తెల్లమబ్బులు". అసలే సకాలంలో వర్షాలు పడక, వ్యవసాయరంగం అతలాకుతలం అయిపోతుంటే, దానికితోడు ట్రాక్టర్లు, ప్రొక్లెయినర్లు, క్రషర్లే కాకుండా, వరికోతలకు కూడా మిషన్లు రావడంతో "కూడు కిష్టపాలాయె, బతుకు గంగపాలాయె, ఇంకేం మిగిలిందే?" అంటూ మేస్త్రి లింగమ్మ వేసే ప్రశ్న, ఈనాడు పల్లెటూళ్ళో ప్రతి రైతు కూలీనీ వేధిస్తున్న ప్రశ్నే.

ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలు అందుబాటులోకి రావడంతో, పల్లెల్లో కూడా నేడు విద్యావకాశాలు మెరుగుపడ్డాయి. అయితే ఆర్థిక ఇబ్బందులు, వ్యవసాయ బాధ్యతలు, కుటుంబ సమస్యల వంటి వాటివల్ల, గ్రామీణ కుటుంబాల్లో అందరూ చదువుకోలేకపోతున్నారు. అలాంటప్పుడు విద్య వల్ల తెలివితేటలే కాకుండా, ఉద్యోగాలు కూడా పొంది ఆర్థికంగా ఓ మెట్టు ఎదిగినవాళ్ళు, వ్యవసాయాన్నే నమ్ముకొని కష్టపడుతున్న తన సోదరులకు అండగా నిలవాల్సిందిపోయి, వారసత్వ వాటాల నెపంతో వాళ్ళను దోపిడీచేయడం ఈనాడు చాలా వ్యవసాయ కుటుంబాల్లో కనిపిస్తోంది. ఈ దుస్థితిని, దాన్నుండి బాధితుడు బయటపడేందుకు చేసే ధిక్కారాన్ని, ఆ సంఘర్షణను కళ్ళకు కట్టినట్టు చెప్పిన కథ "తశ్వ".

ఆకస్మిక తనిఖీల పేర అధికారులు, క్రింది స్థాయి ఉద్యోగుల మీద చేస్తున్న అరాచకాలకు కథా రూపమే "కూతల దండు" కథ. ఇందులోని ఆఫీసర్ ప్రవర్తన కొంత 'అతి'గా అనిపించినా ఆ పాత్రను నెగిటివ్‌గా చూపించడంలో అది సరిపోయినట్లనిపిస్తుంది.

అధిక ఫ్లోరిన్ బాధిత నల్గొండ జిల్లాలోని పల్లెల దీన, హీన పరిస్థితులను, దాన్ని పట్టించుకోని ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని ప్రతిబింబించే కథ "దూప". ఇది చిన్న కథే అయినా, ఫ్లోరైడ్ బాధితుల కడగండ్లను, దాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకురావడానికి ప్రజలు చేస్తున్న ప్రయత్నాలను చక్కగా చిత్రీకరించింది. తాగునీరు అందక, భూగర్భ జలాలు లేక, వ్యవసాయం తప్ప వేరే పని చేతగాక, చేసిన అప్పులు తీరే దారిలేక, ఆత్మహత్యలు తప్ప వేరే గత్యంతరం లేక, శవాలుగా మారిపోతున్న చిన్న, సన్నకారు రైతుల బీభత్స జీవిత దృశ్యాలను అద్దం పట్టి చూపిన అద్భుత కథ "భూతనక". ఇందులోని కథ, కథనం పాఠకుణ్ణి అమితంగా ఆకట్టుకొంటాయి. ఈ కథా సంపుటిలో ఉన్న కథలన్నింటిలోకి హైలెట్ వంటి కథ ఇది.

అయితే కొన్ని కథల్లోని ధోరణి అవాస్తవికంగా ఉండటమే కాకుండా, సమర్థనీయంగా కూడా లేదనిపిస్తుంది. "జారుడుబండ" కథలో ఇద్దరు భూస్వాములైన దొరల మధ్య నడిచే సంభాషణ ఇలా సాగుతుంది, "జీతగాండ్లు, కూలి నా కొడుకులతోని సావొచ్చిందనుకో."

"సీలింగ్ తెస్తదంట, మన మొకాన ఇంతేసి, అంతా అలగాజనానికి పుక్కటికి పంచుద్దంట."

"జాయిదాదు పోయినంక ఏ లంజకొడుకన్న ఇంటడా?....

ఈ అలగా జనమే రేపు 'దొరో కూలికొస్తవా' అని పిలవకపోతే సూడు."

ఇందులో భూస్వాముల భూముల్ని సీలింగ్ యాక్ట్ కింద పేదలకు పంచడం తప్పుగా ఫోకస్ చేస్తాడు రచయిత.

భూస్వాముల వద్ద పట్టా భూములు ఎన్నున్నా, వాటి జోలికి పోకుండా, కేవలం పోరంబోకు భూముల్ని మాత్రమే పేదలకు పంచాలన్నట్టుగా రాస్తాడు. అంతేకాకుండా చివర్లో నర్సయ్య దొర తన తల్లితో,

"అమ్మా దొర్లింట పుట్టిన రవిగానికి కొలువు యెట్లాగూ రాదు" అంటాడు. ఇక్కడ అగ్రకులాల్లో పుట్టిన పిల్లలకు ఉద్యోగాలు రావడం లేదన్నట్టు, అందుకు నిమ్న కులాలకు కేటాయించిన రిజర్వేషన్ విధానమే కారణమన్నట్టు రచయిత పాత్రల ద్వారా సూచిస్తాడు. అలాగే "కాకి గోల" అనే కథలో కుల వ్యవస్థను వ్యతిరేకించకపోగా, సమర్థిస్తున్నట్టు కనిపిస్తుంది. పైగా కులతత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న వాళ్ళను "పని దొంగలు" గా ముద్రిస్తాడు. సామాజిక సమస్యల పట్ల రచయితకు సరైన అవగాహన లేదని ఇలాంటి ఉదాహరణలు చెబుతాయి.

ఉనికి, దర్బార్, చెలగాటం, కాకిగోల వంటి కథల్లోని శిల్పం, చిన్నయసూరి 'నీతి చంద్రిక' కథల్లోలాగా పశుపక్ష్యాదుల పాత్రల ద్వారా కాకుండా, మానవ పాత్రలతోనే మరో కోణంలో వైవిధ్యంగా చెప్పి ఉంటే బాగా ఆకట్టుకునేవేమో.

అయితే, ఇది రచయిత మొదటి సంపుటి. ఇందులో రచయిత, కథనంలో చూపిన ఒరవడి, పాత్రల సంభాషణలో చూపిన పరిపక్వత గమనించినట్టయితే, ఇలాంటి ఒకటి రెండు లోపాలు ముందు ముందు అధిగమించగలడనే నమ్మకం పాఠకులకు కలుగుతుంది. పుస్తకం ముందు మాటలో ప్రఖ్యాత కథా రచయిత తుమ్మేటి రఘోత్తమరెడ్డిగారు చెప్పినట్లుగా రచయిత సూక్ష్మదృష్టితో కూడా జీవితాల్ని చూసి రాయగలిగినప్పుడు, ఎలికట్టె శంకరరావు నుండి మరిన్ని మంచి కథలు పాఠకులకు అందుతాయనడంలో సందేహం లేదు.

**(జారుడుబండ - కథల సంపుటి, రచయిత : ఎలికట్టె శంకరరావు, పేజీలు : 112, వెల : రూ. 45/-, ప్రతులకు : ప్రజాశక్తి, విశాలాంధ్ర, నవోదయ, సహచర బుక్‌షాపులు)**

అల



# గ్రామీణ జీవన సంవేదన 'నదిని దానం చేశాక'

1992 తరువాత గ్రామీణ జీవనంలో ప్రవాహవేగంగా మార్పులు చోటుచేసుకున్నాయి. ఫలితంగా పల్లెకు ప్రాణమైన సేద్యం ఛిద్రమైంది. ఆ వృత్తినే నమ్ముకున్న రైతు జీవనం దుర్భరమయింది. భూసంబంధీకులైన కవులు ఈ నేపథ్యాన్ని కవితా వస్తువుగా స్వీకరించి భిన్న కోణాల్లో రైతు కవితను ఆవిష్కరిస్తున్నారు. ఈ పరిణామం ఆహ్వానించదగినది. వర్తమాన కవిత్వ రీతుల్ని ఆకళించుకొని జీవిత లోతుల్ని స్పృశించగలిగిన వాళ్ళు మాత్రమే ఉత్తమ కవులు కాగలరు. గౌరినాయుడు ఈ కోవకు చెందినవాడు. నడుస్తున్న చరిత్రను అర్థం చేసుకొని అభ్యుదయ ఆలోచనలతో ఒక మహా భవిష్యత్తును ఆకాంక్షిస్తున్నాడు. మార్పుగతిని కళ్ళకు కట్టి తద్వారా ప్రపంచీకరణ సృష్టించిన భయంకర బీభత్సాన్ని స్ఫురింపచేస్తాడు. ఇదే ఈయన కవిత్వానికి జీవలక్షణం. కథా రచయితగా, గేయ కవిగా తెలుగు నాట సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్న గంటేడ 'నాగేటి చాలుకు నమస్కారం' అనే దీర్ఘ కవితతో కవిత్వ రచనలో అడుగు పెట్టాడు. ఇటీవల 'నదిని దానం చేశాక' అనే కవితా సంకలనాన్ని ప్రచురించాడు. ఆయన కవిత్వం నిండా తల్లడిల్లిన పల్లె తల్లి గుండె సవ్వడులే ప్రతిధ్వనిస్తుంటాయి. పరిచయ వాక్యాల్లో అట్టాడ అప్పలనాయుడన్నట్లు గ్రామీణ కవితా పతాక ఆయన.

కవితీకరించే విధానంలో కూడా గ్రామీణ అనుభవాలు, గ్రామీణ సామెతలు, మాండలికాలు, ఇంపుసొంపులు, గ్రామీణ అమాయకత్వం, మాటకారితనపు హొయలు ఉంటాయి. ఇవే ఆయన శైలీకరణలోని ప్రత్యేకతలు. ఆయన కవిత్వంలో ఆత్మీయత, ఆర్ద్రత, ఆశ, ఆర్తి ఎంతో మార్దవంగా ఉంటాయి.

పుట్టిన ఊరు, ఆడుకున్న ఏరు తనకు కాకుండా పోవడాన్ని భరించలేక బాధాతప్త హృదయుడై ఏరు కావాలని, ఏటి పాట కావాలని డిమాండ్ చేస్తాడు. పాయలు పాయలుగా తన అనుభూతుల్ని వర్ణిస్తున్న క్రమంలో ఏటిని, ఏటి నీటిని జలవస్త్రంగా, జలగీతంగా, జలడోలగా, జలహస్తంగా, జలపుష్పంగా, అలనేస్తంగా, జలకన్యగా, జలదేవతగా, జలశ్వాసగా వివరిస్తాడు. ఏటిని మట్టిదేహాల్ని అలల నాలుకల్తో నాకి శుభ్రపరిచే గోమాతగా, పుడమితల్లి పచ్చకోకగా, పడుచుపిల్లల నడుముల మీద నీళ్ళ కడవల నాట్యంగా భావిస్తాడు. అంతటి అమృతపూర్ణ నాగావళి గ్రామదేవత శిరస్సు మీద సుజల పూర్ణ కలశం కావాలని కోరుకుంటాడు.

పాలేర్ల జీవితంలో మధురానుభూతి 'కుందిరి'. కుందిరంటే చలికాలంలో వరిదిబ్బల మధ్య సన్నని ఖాళీ స్థలంలో కాపలా కోసం పడుకోవడానికి అనువుగా పందిరిలా వేసే చోటు. వలసపోయిన పాలేరు నగరంలోని దుర్గంధపూరితమైన అద్దె గుడిసెల్ని తలచుకుని దుఃఖిస్తూ గతంలో పల్లెలోని కుందిరిని ఊహించుకున్న స్వగతమే. "అది మాకొక కలల గూడు / నులివెచ్చని రాత్రి తోడు / నిప్పులెత్తని కుంపటి / ఒంటి మీద గుడ్డలెరగని పాలేరు పిల్లలకు / పిలిచి వెచ్చదనం పంచే పట్టడం." జీవిత విధానంగా వ్యవసాయం సాగిన రోజుల్లో ఉత్తరాంధ్ర గ్రామీణ జీవితంతో ఏమాత్రం పరిచయమున్న కుందిరి అనుభూతుల్లోకి పాఠకులు సైతం జారిపోతారు. ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతులకు ధైర్యం చెప్పడం, ఓదార్చడం తన బాధ్యతగా గుర్తించిన కవి గౌరినాయుడు. అందుకే 'కాసింత గుండె దిటవు చేసుకోవాలి' అంటాడు. సచ్చి సాధించేది లేదని, బాధల్ని ఓర్చుకోవాలని, ఓర్చుకుంటే కోడిగుడ్డు సట్టెడవుతుందని నచ్చచెపుతాడు. "విధ్వంస దృశ్యం"లో గ్రామాల్లోకి, రైతు సేద్య విధానాల్లోకి హరిత విప్లవమై చొరబడ్డ వ్యాపారం లాభాల బలుపెక్కిన బహుళజాతి కంపెనీలు, వాటికి ఇంధనమైన ప్రపంచీకరణల కారణంగా "దిక్కు నక్కులేని నాగలి / ఒక ముసురు పట్టిన వేళ / పొయ్యిలోకి దూకి ఆత్మహత్య చేసుకుంటుంది" అని చెప్పి "చదరంత పొలంలో చాలు పొయ్యడానికి ఇనుప దున్న రూపాయి మేపందే టైరు పాదం కదలదు" అని అంటాడు. వ్యవసాయ రంగంలోకి వచ్చిన మార్పులు రైతుని చావు దెబ్బ తీసిన విధానాన్ని వివరించాడు. "స్వేద సముద్ర తరంగాలు మొన్నంటో మెట్ల కేసి తలలు బాదుకొని విరిగి పడిన దృశ్యాన్ని మనముందుంచాడు. విధ్వంసక క్రమ పరిణామంలో పోరాటం అనివార్యమని, పొలమూ, కళ్ళమూ, చెరువు, కాలువ, ఇళ్ళు, వీధి అన్నీ రణ క్షేత్రాలేనని, చివరకు రైతు బతుకే రణమని అంటాడు. క్షణ క్షణం రెక్కలల్లార్చిన రాబందుల నీడల్లో డొక్కలెండిన రైతుల బతుకులు ఎలా ఉంటాయో ఊహించుకోమంటాడు.

ప్రపంచీకరణ నేపథ్యంలో పల్లెల్లో కృత్రిమ కరువు తిష్టవేయడాన్ని బలంగా చెప్పే కవిత "గెద్దలాడుతున్నట్టే". 'మావూరి ఆకాశం మీద / వేలాడే నీటిపట్టును చూస్తుంటే / అమృతభాండాన్ని మోసుకొస్తున్న గరుత్మంతుడే అనిపించేది / తేనెధారల్లాంటి జలధారల కోసం ఊరు ఊరంతా ఒక దోసిలిగా మారిపోయేది' అని గతాన్ని నెమరువేసుకుంటూ ప్రస్తుత పల్లెల్ని పొడగట్టిస్తాడు. "మా వూరి ఆకాశం మీది మబ్బులు / ఆగడం లేదిప్పుడు / పట్నాలకే వలస పోతున్నట్లున్నాయి." ఊరుకు రుతువులు రానప్పుడు, బతుకులో రుతువులు ఎక్కడ్నుంచి వస్తాయని ప్రశ్నిస్తాడు. ఊరు ఆకాశం మీద మబ్బులాడినా గెద్దలాడినట్టేనని విలపిస్తాడు. 'కరువు కచేరి'లో మృగశిర, ఆరుద్రలాంటి కార్తెలు, ఆషాఢ, శ్రావణ, భాద్రపదం వంటి మాసాలు రైతుని ఎలా మోసం చేశాయో వినిపిస్తూ, కార్తెలు రైతు బతుకు మీద కరువుని ఆరేసిన విధానాన్ని వర్షం కురవకపోవడానికి, నీటి చెమ్మ నేల మీద నిలవకపోవడానికి కారణాల్ని తెలుపుతాడు. వాణిజ్య పంటల ఖడ్గ చాలనంతో ఉత్తరించబడిన వారి శిరస్సుల గురించి విశదపరుస్తాడు. "మిద్దింటి గోడ మీద అద్దం పెంకు"లో కలల్లోనూ, పొలాల్లోనూ పచ్చదనం చిత్రించే రైతు చిత్రకారుడు తన బతుకు బొమ్మల్నిండా నల్ల రంగే పులుముకున్నాడని బాధపడతాడు. ఉత్తుత్తి జీవోలు చేస్తున్నామని

బుకాయిస్తున్న పాలకుల నైజానికి 'ఫ్ఫ్! మచ్చుతునక. "ప్రభుత్వాలు / కురవని మేఘాలు / ఉత్తుత్తి వాగ్దానాల ఉరుములు" అంటూ దోపిడీ ప్రభుత్వాల వర్గ నైజాన్ని వివరిస్తాడు.

నిర్వాసితుల గోడుని పట్టించుకోని ప్రభుత్వాలు వాళ్ళని అణచివేయడానికి, భయకంపితుల్ని చేసి కిమ్మనకుండా చేయడానికి వాళ్ళ మీద కాల్పులు జరిపింది. తన పక్కనే జరిగిన దుర్మార్గాన్ని నిలదీయడానికి, రికార్డు చేయడానికి చేసిన ప్రయత్నమే నదిని దానం చేశాక' పుడమిని పసిపాపను చేసి లాలించవలసిన వేళ ఖాకీవనంలో నెత్తురు పువ్వును కావడం యాధృచ్ఛికం కాదంటాడు. పండును తిండం పండే నేర్పినట్లు బతుకు కోసం పోరాట మార్గం తప్పదంటాడు. నేలంటే దళారి పాలకులు కొంచెం మట్టి, కొంచెం ఇసుక, కొన్ని రాళ్ళూ, రప్పలు లేదా నాలుగు గట్ల నడుమ కొంత ఖాళీ జాగాగా భావిస్తారని, అసలు నేలంటే తరతరాల స్వేద పరిమళాలు వీచే నా పూర్వుల రక్త మాంసాస్తికల నుంచి మొలుచుకొచ్చిన బతుకు చెట్టని చెబుతాడు. తోటపల్లిని కొత్తగాయాల తల్లిగా కీర్తిస్తాడు.

చదువుకోవలసిన వయస్సులో చిన్నారులు బాల కార్మికులుగా ఎలా బతుకీడుస్తున్నారో తెలియజేసే కవిత 'రైస్ మిల్లులో చిట్లిన రాగం'. చదువు కలలు చెదిరిపోయి అమ్మలేని కుక్కపిల్లలా దయనీయంగా బతుకుతూ బండచాకిరికి బలైపోయిన బాలుని బతుకుని తెలిపే కవిత ఇది. "ఒరే నాయనా! / అక్షరాలే నిన్ను దిద్దుకోవాల్రా? / చదువే నిన్ను చదువుకోవాల్రా! నా చిట్టి తండ్రీ!" అని ఊరడిస్తూ నేటి చదువుల డొల్లతనాన్ని వెల్లడించాడు.

గిరిజనులది ఒక ప్రత్యేకమైన జీవిత విధానం. దాని నుండే వాళ్ళ సంస్కృతి, సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, పండగ పబ్బాలు పుట్టుకొచ్చాయి. వేల ఏండ్ల సంస్కృతి ప్రపంచీకరణ ఫలితంగా కనుమరుగైపోతున్నాయి. 'ఆశ' కవిత ఇదే విషయాన్ని తెలుపుతుంది. కొత్తల పండగలో సంప్రదాయ నృత్యాల్ని వదిలి రికార్డింగ్ డాన్స్‌ల మాయలో పడి యువత కొట్టుకుపోవడాన్ని చెబుతూ "అయితేటి / ఆకరమ్ము కాలిపోయి / అడివంటుకొని కొత్త సిగుర్లెయ్యదా / కొండగుండె మంటలారి గిణింతాలు దిద్దదా, అప్పుడు ఎనకటి కతలన్నీ ఎలుతురు పువ్వులై ఇరగబుయ్యవా" అని ఆశావహ దృక్పథంతో కవిత ముగుస్తుంది. 'కొండ'లో ఈ విధమైన బాధే వ్యక్తమవుతుంది. "ఇప్పుడు కొండ ఘనీభవించిన కుండని, విచ్చుకున్న సూర్యనేత్రం కోసం ఆశగా ఎదురు చూస్తుంటాడు కవి. గిరిజన బతుకుల్లో వెలుగులు నిండాలన్న గాఢమైన ఆశని వ్యక్తం చేశాడు. తరతరాలుగా దళితులకు సమాజం చేసిన గాయమే 'గాయం' కవిత. అంతా నకిలీ వైద్యులే గాయాల్ని రేపుతారు తప్ప కట్టు కట్టి మాన్పరని కవి కలత పడతాడు. సమాజంలోని అన్ని వర్గాల వాళ్ళు తిలా పాపం తలా పిడికెడన్నట్లు గాయాల్ని ఎక్కువ చేస్తున్నారు తప్ప నయం చేసే ప్రయత్నాలు చేయలేదని అభిప్రాయపడతాడు. కారంచేడు, పదిరికుప్పం, నీరుకొండ అన్నీ గాయాలేనని అంటు కారణాల్ని వెతికి దోషుల్ని శిక్షించాలని డిమాండ్ చేస్తాడు. 'ఇన్విజిలేటర్', 'స్టాండప్... రైజ్ ద హేండ్' కవితలు ఉపాధ్యాయుల సమస్యలకు సంబంధించినవి. ఉపాధ్యాయుల పట్ల సమాజానికి ముఖ్యంగా అధికార గణానికి ఉన్న చిన్నచూపు, అధికార దర్పాన్ని ఈ కవితలు తెలుపుతున్నాయి. 'ఓ గాయకుడా!' జముకుల గాయకుడు గురించి కాగా 'ఈటివోడు' గ్రామాల్లో సాహసోపేత విన్యాసాలు చేసి తను దుర్భర జీవితాన్ని గడిపి పదిమందికి సంతోషాన్ని పంచుతాడు. పాట గురించి, కవిత్వం గురించి, వ్యక్తిగత అనుభూతులు గురించి అందమైన కవితలు సంకలనంలో చోటుచేసుకున్నాయి. గంటేడ కవిత్వంలో కళింగ పల్లె కళ్ళ ముందు గెంతులేస్తుంటుంది. నిరాడంబర పల్లె జీవన ఔన్నత్య ముగ్ధుల్ని చేస్తుంది. మాండలికాలకు కవిత్వ గుభాళింపులు అద్ది ఉత్తరాంధ్ర పలుకుబడులకు సాహిత్య గౌరవాన్ని తెచ్చిన గౌరునాయుడు అభినందనీయుడు.

**(గ్రామీణ జీవన సంవేదన, కవి : గంటేడ గౌరునాయుడు, వెల : రూ. 40/-, ప్రతులకు : గంటేడ గౌరునాయుడు, నాయుడు వీధి, కురుపాం-535 524)**

**జి.ఎస్.**

---




## పత్తిపూలల్లోని ఎర్రజీరల్ని చూపే కవితలు

**ప**త్తిపూలు, తాకితే మాసిపోయేంత తెల్లగాను, పట్టుకొంటే కందిపోయేంత సుతిమెత్తగాను, చూసేందుకు మనోహరంగాను ఉంటాయి. కానీ, ఆ పత్తిని పండించే రైతుల జీవితాలు మాత్రం, నల్లని మృత్యుఛాయలతోను, రక్తమోడ్చే గుండె గాయాలతోను, ఒళ్ళు గగుర్పొడిచే దారిద్ర్యంతోను దుర్భలంగా ఉంటున్నాయి. ఆ రుగ్మతలకంతటికీ కారణం వ్యవస్థేనని, ఆ పత్తిపూలు ఎరుపెక్కేంత రౌద్రంతో కవితాగానం చేసిన పత్తి శివప్రసాద్ తొలి కవితా సంపుటే "ఎరుపెక్కిన పత్తిపూలు".

ఇందులో పత్తి రైతులనుద్దేశించి రాసినది కేవలం 'పత్తిపూలు' అన్న మొదటి కవిత మాత్రమే. మిగతా కవితలన్నీ రకరకాల సామాజిక సమస్యలపైన రాసినా, అన్నింటిలోను నేటి దోపిడీ వ్యవస్థలోని రాక్షసత్వం, అంతస్సూత్రంగా ప్రతిబింబిస్తోంది.

ఇందులో 1978 నుండి 1985 వరకు రాసిన మొత్తం 95 కవితలున్నాయి. ఎక్కువ భాగం మినీ కవితలే. ఒక వాక్యంగా ఒదిగిపోదగ్గ కవితలు కూడా ఓ పేజీని ఆక్రమించుకోవడం విశేషం. అయితే సినారెగారు మినీ కవితల్ని 'సౌదామినీ' కవితలంటూ చమత్కరించినట్టుగా చటుక్కున మెరిసే గుణం మినీ కవితలకు ముఖ్యం. ఇందులోని చాలా కవితల నుండి అలాంటి మెరుపులు పాఠకుల హృదయాల్ని తాకుతాయి. "భారీ విగ్రహమై / భయపెట్టలేను / జోరీగనై /చెవిలో/ రొదపెడతాను"అంటూ కవి స్వయంగా చెప్పుకున్నాడు.

అందమైన అంత్యప్రాసలతో, అనంతమైన భావాన్ని అర్ధవంతంగా, ఆకట్టుకునేలా, అంత తక్కువ నిడివిలో చెప్పగలగడం, అంత సులభమైన పని గాదు. అందుకే కాబోలు మినీ కవితలు ఇంకా ఎంతోమందిని, ముఖ్యంగా సామాన్య పాఠకుల్ని ఆకర్షిస్తూనే ఉన్నాయి. శివప్రసాద్‌గారు అందించిన అలాంటి కవితల్లో మచ్చుకు కొన్ని

"కళ్ళ ముందు జరిగే కుళ్ళును చూసి /
తొలగించే ప్రయత్నం చేయనివారు /
అన్ని అంగాలున్నా / వికలాంగులే"

"ఏపుగా కాసిన చెట్టుపై / ఏ రాయి విసిరినా /
కాయ నేల కూలటం ఖాయం /
ఎదురు కాల్పుల ఘటనల్లో / ఎదురెదురు కాల్చుకొన్నా /
ఒక వైపు వారే మటుమాయం"

పైరులో / పచ్చదనంతో దాక్కొన్నా /
కలుపు మొక్కలను / పీకి పారేయాల్సిందే / నరకాల్సిందే"

ఇలాంటి ఎన్నో మినీ కవితలు, మరికొన్ని మామూలు వచన కవితలు, పాఠకుల్ని ఆకట్టుకుంటాయి. అయితే, చీమలు పెట్టిన పుట్టల్లోకి పాములు చేరడం వంటి పోలికల్ని, ఓటు రాజకీయాల్ని ఒకటి కంటే ఎక్కువ కవితల్లో వాడటం వల్ల చర్వితచరణంగా అనిపిస్తుంది. శుద్ధవచనంలా కాకుండా, తీసుకొన్న కవితా వస్తువులు పాతవే అయినా, కవిత్వీకరించే తీరులో కొత్తదనం చూపిస్తే నిస్సారంగా అనిపించే కొన్ని కవితలు కూడా, చిక్కగా, చక్కగా వచ్చేవేమో అనిపిస్తాయి.

శిల్పంలోను, పదచిత్రాల ఎంపికలోను మరింత శ్రద్ధ తీసుకొంటే మున్ముందు పత్తి శివప్రసాద్ నుండి, ఎరుపెక్కిన పత్తి పూల వంటి కవితలే కాకుండా, సింధూర వర్ణ కవితా మందారాలు, అరుణారుణ కవితా గులాబీలు కూడా వస్తాయని ఆశిద్దాం.

**(ఎరుపెక్కిన పత్తిపూలు - పత్తి శివప్రసాద్, పేజీలు :98, వెల : రూ. 50/-, ప్రతులకు : పత్తి శివప్రసాద్, 4-3-86, సోమవారిపేట వీధి, నిర్మల్-504 106)**

---

**డాక్టర్ బాల శ్రీనివాసమూర్తి**




## వైవిధ్యభరితమైన ఇంటర్వ్యూలతో "జీవనరేఖలు"

వివిధ రంగాల్లో నైపుణ్యాన్ని సాధించిన ప్రముఖుల అనుభవాలు, వారి ఆలోచనలు, అభిరుచులు, దృక్పథాలు ఎంతో విలువైనవి. ఆయా ప్రముఖుల వ్యక్తిత్వాన్ని, ప్రతిభా గరిమనూ వెలకట్టేందుకు ఇవి ఎంతో ఉపయోగపడతాయి. కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భాల్లో పురస్కరించుకొని నిర్వహించే ఇంటర్వ్యూల్లో ఈ ప్రముఖులు తమ మనసులోని మాటల్ని వ్యక్తపరుస్తూ ఉంటారు. ఒకటి రెండు తప్ప నూటికి తొంభై ఎనిమిది ఇంటర్వ్యూలు అచిరకాలంలోనే కాలగర్భంలో కలసి పోతుంటాయి. అయితే ఒకరితో కాకుండా అనేకమంది ప్రముఖులతో ఇంటర్వ్యూలు జరిపి, వాటిని ఒక చక్కని అభిప్రాయ మాలికవలె అచ్చువేస్తే సదరు పుస్తకం అన్ని తరాల వారికి ఉపయోగపడుతుంది. కవి పాత్రికేయుడు తాళ్ళపల్లి మురళీధర్ గౌడ్ ఈ పని చేశారు. ఆయన పలువురు సాహితీవేత్తలతో జరిపిన విపులమైన ఇంటర్వ్యూలన్నింటినీ 'జీవన రేఖలు' అనే పుస్తకంగా ఇటీవలే ప్రచురించారు. రచయిత ప్రయత్నాలు అక్షరాలా అభినందనీయం.

భిన్న ధ్రువాలు, విభిన్న ప్రక్రియలకు చెందిన పలువురు సాహితీ ప్రముఖులతో తాళ్ళపల్లి ఇంటర్వ్యూలు గరిపారు. ప్రజాకవి కాళోజీ నారాయణరావు వంటి నాటితరం స్వాతంత్ర్య సమరయోధుడిలో మొదలుకొని నేటి తరానికి చెందిన కవి ఎండ్లూరి సుధాకర్ వరకు తాళ్ళపల్లి గరిపిన ఇంటర్వ్యూల్లో ఎంతో వైవిధ్యం కన్పిస్తుంది. జి.వి. సుబ్రహ్మణ్యం, వడలి మందేశ్వరరావు, బేతవోలు రామబ్రహ్మం, చేకూరి రామారావు వంటి కవి పండిత విమర్శకులు, దాశరథి రంగాచర్య, అంపశయ్య నవీన్ వంటి నవలా రచయితలు, అవంత్స సోమసుందర్, ఎన్. గోపి, అద్దేపల్లి వంటి కవులు జీవన రేఖల ముఖాముఖీలో మనతో సంభాషించారు. జీవన రేఖల్లోని పలు ఇంటర్వ్యూలు ఇదివరకే పత్రికల్లో ప్రచురితమయ్యాయి. వాటిని పుస్తక రూపంలో తీసుకొని వచ్చే క్రమంలో రచయిత మురళీధర్‌గౌడ్ శ్రద్ధ ద్యోతకమవుతోంది. ఇంటర్వ్యూ జరుపుతున్న ప్రముఖుడికి సంబంధించిన పుట్టు పూర్వోత్తరాలు, ఆయన తాలూకు ఇంటర్వ్యూ ఎంతో ఆసక్తికరంగా వున్నాయి. జీవనరేఖలోని ప్రముఖుల ఫొటోలు కూడా ప్రచురించడం బాగుంది.

కొన్ని ఇంటర్వ్యూలు నిజానికి సంపూర్ణమైన ఇంటర్వ్యూలుగా భాసించవు. ఆయా ప్రశ్నల్లో వైరుధ్యం లేకపోవడం కారణం. మురళీధర్‌గౌడ్ ఇంటర్వ్యూల్లో ఆయన అడిగిన ప్రశ్నలు సందర్భానికి తగినట్టు వైవిధ్య వివేచనాలతో కూడి కన్పిస్తాయి.

సాహిత్య జిజ్ఞాసువులందరి పుస్తకాల అలమరాలో ఉండవలసిన అలంకారం 'జీవన రేఖలు' పుస్తకం.

**(జీవన రేఖలు (వీక్షిత్రాలు) తాళ్ళపల్లి మురళీధర్ గౌడ్, వెల : రూ. 125, ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్ లేదా సూర్య ప్రచురణలు, ప్లాట్ నెం. 2, ప్లాట్ నెం:1-4. సూర్య సరోజ్ అపార్ట్‌మెంట్స్, హుడా కాంప్లెక్స్, సరూర్‌నగర్, హైదరాబాద్-357)**

సైదులు ఐనాల




## 'ప్రాణం ప్రణవం' నానీలు

అనేకానేక కవితా రీతులకి జన్మస్థలంగా, అనేకానేక సాహిత్యవాదాలకు నిలయంగా ప్రజ్వరిల్లిన సీమ ఆంధ్ర దేశం. ఇతర భాషా సాహిత్యాన్ని తనకు తెల్సిన రీతిలో తెల్సుకొని తన్మయత్వం చెందిన తనం మన తెలుగు సాహిత్యానిది. తెలుగు సాహితీ పూదోటలో పరాభి పద్యాల నడుముల్ని విరగ్గొట్టిన నాటి నుండి వచన కవిత్వం పరవళ్ళు తొక్కింది. అనంతరం ఇంకాస్త నిడివి తగ్గి సూటిగా హృదయాల్లోకి దూసుకుపోయే అలతి అలతి అక్షరాలతో వచ్చిన మినీ కవిత్వం, హైకు వంటివి సాహితీ లోకాన్ని సుసంపన్నం చేశాయి. మారుతున్న లోకానికి అనుగుణంగా క్రొత్తగా వచ్చే కవితా రూపాలు తొందరగా ఆకర్షిస్తున్నాయి. అట్లాంటి కవితా రూపాల్లో చెప్పుకోదగ్గది 'నానీ'లు. డాక్టర్ ఎన్. గోపి ప్రారంభించిన ఈ ఉద్యమం ఆంధ్ర రాష్ట్రాన్ని చుట్టి వచ్చింది. ఆ ప్రచారాన్నందుకున్న అనేకులు నానీలను సొంతం చేసుకున్నారు. ఆ క్రమంలోనే డాక్టర్ ఎం. విజయశ్రీ 'ప్రాణం ప్రణవం'గా నానీలను తెలుగు పాఠక లోకానికి అందించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖలో అసోసియేట్ ప్రొఫెసర్‌గా ఉన్న విజయశ్రీ తనదైన ముద్రతో 'నానీ'లను అందించారిలా... 'గడ్డిలో నాటిన / గంధం మొక్క / పైరంతా / పరిమళాలై వీస్తుంది. ఇరవై ఒక్క ఆరు అక్షరాల్లో ఇంతటి అభివ్యక్తిని ప్రదర్శించడం వెనుక కవయిత్రి ప్రతిభ, శ్రమ ఉంది. మనం రోజు చూసే దృశ్యాల్ని, వినే సంఘటనల్ని 'నానీ'లుగా మలచడంలో కవయిత్రి కలానికి చేయి తిరిగిందన్నట్లు కన్పిస్తుంది. ఆ కోవలోకొచ్చే నానీలు ఈ "ప్రాణం ప్రణవం" నిండా పరచుకున్నాయి. మచ్చుకు ఒకటి. "ప్రతి తల్లిలో / ఒక శబరి / చిన్న బొజ్జల నిండా / తియ్యని పళ్ళే మరి."

అభివ్యక్తిలో చక్కని శిల్పరీతిని ప్రదర్శించే నానీలనూ అందించారు. "గణితంలో దిట్ట / వరాహ మిహిరుడు / ఇంటి లెక్కలు/ రాయమనండి చూద్దాం / అంటూ 'ఆమె' మాత్రమే నెరపగల వస్తువుని పైకి తీసుకొచ్చారు కవయిత్రి. తీరుతెన్నుల్లోనూ, తీసుకునే వస్తువుల్లోనూ, అభివ్యక్తిలోనూ తనదైన ముద్ర కోరుకునే ప్రతీ ఒక్కరూ చదవదగ్గ నానీలను అందించిన విజయశ్రీ పాఠకుల మదిలో చిరస్థాయిగా నిలుస్తారు. విచిత్రమేమిటంటే గోపిగారి 'నానీ'లను సంస్కృతంలోకి అనువదించే క్రమంలో నేనూ 'నానీ'ల నెందుకు రాయకూడదనే ఆలోచనా ఫలితమే ఈ "ప్రాణం - ప్రణవం" అని ఆమె మాటల్లో విన్నప్పుడు ఆశ్చర్యమేస్తుంది. ఎవరు, ఎప్పుడు, ఏ సంఘటన. ఎవర్ని ఏ విధంగా మార్చునోగదా? అన్పిస్తుంది. కవిత్వానికి ఒకానొక ప్రేరణ అవసరం. ఆ ప్రేరణ పరిపూర్ణంగా పొందిన విజయశ్రీ కవిత్వం మరింత పరిపూర్ణంగా రావాలని ఆశిస్తూ...

**(ప్రాణం - ప్రణవం (నానీలు) - డాక్టర్ ఎం. విజయశ్రీ, వెల : రూ. 30/-, పేజీలు : 50, దొరుకుచోటు : ఎం. విజయశ్రీ, ఫ్లాట్ నెం. 504, జగన్నాథ్ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం. 6, విద్యానగర్, హైదరాబాద్-44. ఫోన్ నెం. 040-27632188**

ఎం.కె.




## చితికిపోతున్న గ్రామీణ జీవితాలకు దర్పణం 'మిత్తవ'

మంచి ముత్యాల్లాంటి మంచి కథలతో మంచికంటి వెలువరించిన పన్నెండు కథల సంకలనం 'మిత్తవ'. ప్రకాశం జిల్లాలోని అగ్రకులాల్లోని పేదరికాన్ని రచయిత చాలా వాస్తవికంగా, సహజంగా, ఈ కథల్లో చిత్రీకరించారు.

కరువులో మానవ సంబంధాలు ఎంతగా విచ్ఛిన్నమైపోతాయో, నీటి కోసం, పొట్టాత్రం కోసం కరువు బారిన పడిన ప్రజలు ఎంతగా విలవిల్లాడిపోతారో బాధాకరమైన ఆ జీవితాల్ని ఆర్ద్రంగా, దయనీయంగా చిత్రించిన కథ 'మిత్తవ'. తీవ్ర కరువులో భర్త దేశాలు పట్టిపోగా, అయిష్టంగా, బాధగానే తప్పనిసరై బిడ్డలతో పుట్టింటికి చేరిన గోయిందమ్మ, నెలరోజులకే వదిన నిరాదరణతో దిక్కుతోచక, ఏమీ పాలుపోక బిడ్డలతో తనువు చాలించుకోవడం 'మిత్తవ' ఇతివృత్తం.

సుబ్బయ్య కళాకారుడైన బేల్దారి. సిమెంట్ గోడలపై బొమ్మలు చెక్కడంలో దిట్ట. అలాంటి సుబ్బయ్య మూడో అంతస్తు మీద పనిచేస్తూ కాలుజారి కిందపడి అవిటివాడైపోయాడు. ఎన్నడూ పని ముఖం ఎరుగని అతని భార్య సుబ్బులుపై కుటుంబ పోషణ భారం పడుతుంది. మైళ్ళకు మైళ్ళు ఒంగోలు రోజూ వెళ్ళి 'మెట్టు' దగ్గర పని కోసం పడిగాపులు పడాలి. కరువు కారణంగా మెట్టు (బేల్దారి కూలీలు ఒక చోట చేరే ప్రాంతం) దగ్గర జనం ఇసుకవేస్తే రాలదు. ఇదే అదునుగా మేస్త్రులు కూలి తగ్గిస్తారు. సుబ్బులు పనిచేస్తూ తిండిలేక, కళ్ళు తిరిగి, కాలుజారి పడి ఈ లోకాన్నే విడిచిపెడుతుంది. ఇక అవిటివాడైన ఆ తండ్రిని పోషించే భారం ముక్కుపచ్చలారని, ముద్దు ముద్దు మాటలు మాట్లాడే పసిబిడ్డ సుజాతవంతవుతుంది. కరువు పరిస్థితుల్నీ, నీటి కోసం పడే పాట్లనీ, బేల్దారి మేస్త్రుల పీడననీ, దోపిడీని చాలా చక్కగా కళ్ళ ముందు నిలిపిన ఈ కథ 'మెట్టు'.

తీవ్ర నిరాదరణకు గురవుతున్న వృద్ధుల జీవితాన్ని సహజంగా చిత్రించిన కథ 'యాతన'. సుబ్బరామయ్య బాగా బతికిన మనిషి. కొడుకులు ఇద్దరూ వేర్లు పడుతూ ఆస్తిపాస్తులతో పాటు తండ్రి పోషణని చెరి ఆరునెలలు పంచుకుంటారు. ఇక కొడుకులూ, కోడళ్ళ కోపాలూ, తాపాలూ, ఈసడింపులూ, తిట్లూ, ఛీత్కారాలు, అవమానాలూ, అసహ్యించుకోవడాలూ! వాటిని భరించలేని సుబ్బరామయ్య గత ఘనాన్ని వదిలేసి తోటల పనికి కాపలాకి కుదురుకుంటాడు. ఇది 'యాతన. పేదరికం, దుర్భర దారిద్ర్యం కారణంగా ఏనాడూ సుఖం ఎరుగని ఓ తల్లి తన ఒక్కగానొక్క కూతుర్ని దరిద్రపు ఛాయలు సోకకుండా, కనీసం బిడ్డ అయినా సుఖపడుతుందనే ఉద్దేశంతో ఆస్తిపాస్తులు కలిగిన రెండో

పెళ్ళివాడితో ముడిపెట్టాలని తాపత్రయపడుతుంది. అందుకు కూతురు ససేమిరా కాదంటుంది. తల్లి ఎలాగైనా కూతుర్ని ఒప్పించాలని ప్రయత్నించినా, కూతురు ధీటుగానే స్పందిస్తుంది. దిగువ మధ్యతరగతి కుటుంబాల్లోని వేదనల్నీ, వెతల్ని, కష్టాల్నీ, కడగండ్లనీ, తపనల్నీ, తాపత్రయాన్ని అద్భుతంగా ఆవిష్కరించిన ఈ కథ 'పెళ్ళి సమ్మందం'.

మల్లెల సువాసనల్లా పరిమళించాల్సిన బాల్యాన్ని బందిఖానాల్లో చదువుల పేరిట బంధించడాన్ని, సృజనక్రియగా మారాల్సిన చదువుల్ని బజారు వ్యాపారంగా మార్చడాన్ని, చిగురు మొగ్గల్ని చిదిమేయడాన్నీ, చదువంటే నాలుగ్గోడల మధ్య పుస్తకాల్లో పురుగుల్లా బందిలై పోవడమనే దృష్టినీ తిరస్కరిస్తూ, నూతన వెలుగులతో, నూతన భావాలతో, ఆలోచనలతో చదువులు ఉండాల్సిన అవసరాన్నీ, ఆ విధమైన పాఠశాలనీ కవితాత్మకంగా సృజించిన కథ 'వెన్నెల పూదోట'.

వానలేక, పంటల్లేక, ధరల్లేక, తిండి గింజల్లేక, తిండిలేక, కొడుకుని చదివించుకునే దిక్కులేక - రైతు ఆక్రందనని అక్షరీకరించిన కథ 'ఊరు పొమ్మంటుంది'. రామిరెడ్డి కొడుకు సుబ్బారెడ్డి. పదిలో మంచి మార్కులు వస్తాయి. కాలేజీలో చేరతానంటాడు. ఇంటి పరిస్థితుల కారణంగా తల్లిదండ్రులు వద్దంటారు. అతను అలిగి ఇల్లు వదిలిపెట్టి పోతాడు. కాలం కలసిరాకపోవడంతో, ఊళ్ళో అవమానాలు భరించలేక రామిరెడ్డి, భార్య, కూతురు అర్ధరాత్రి దొంగల్లా వూరు వదిలి పెట్టి వెళ్ళిపోతూ, ఇక ఈ వూరు ముఖం చూడకూడదనుకుంటారు. ఇది 'ఊరు పొమ్మంటుంది' కథ.

జాలయ్యకి పొలం అంటే ప్రాణం. మట్టితో అనుబంధం. పొలం అతని వూపిరీ, ఆవాసం, నివాసం. ఎంత రోగం వచ్చినా పొలాన్ని విడిచి వుండలేదు. అతని మనుమడు శీనయ్య. లారీ డ్రైవర్. స్వంత లారీ కొనుక్కోవాలని తపన. ఉన్న పొలం అమ్మితేనే లారీ కొనేది! పొలంతో బంధం పెనవేసుకున్న తాత, నాయనమ్మ, అమ్మా, నాన్న అందరూ ఒప్పుకోకపోయినా బెదిరించీ, ఒప్పించీ లారీ కొంటాడు. 'మాయరోగం' కథ ఇది.

ఒక స్త్రీ కుటుంబ జీవనంలోనూ, పని ప్రదేశంలోనూ ఎదుర్కొనే మానసిక హింస, శారీరక హింస, లైంగిక హింసని వెల్లడించిన కథ 'సుశీల'. ఒక్క ప్రకాశంజిల్లాలోనే దాదాపు లక్షమందికి పైగా పొగాకు కంపెనీల్లో మహిళా శ్రామికులు పనిచేస్తున్నారు. వాళ్ళందరికీ ప్రతీక సుశీల. కోడి కూయకముందే నిద్రలేచి, ఇంటి పనీ, వంట పనీ చేసి, పిల్లల్ని సముదాయించుకుని దాదాపు ఏడెనిమిది మైళ్ళు పరుగెత్తుకుని పోవాలి, ఏడుగంటలకే. నిమిషం ఆలస్యమైనా గేటు వేస్తారు. ఇక అక్కడ సూపర్‌వైజర్లూ, ముఠా కూలీల లైంగిక హింస సర్వసాధారణం. అక్కడ పని పరిస్థితుల్నీ, కుటుంబంలో భర్త పీడననీ చాలా వాస్తవికంగా, ఎలాంటి కృత్రిమత్వం, భేషజం, అసహజం లేకుండా నిక్కచ్చిగా చెప్పిన కథ 'సుశీల'.

అమాయక రైతుల్ని గొర్ల దళారి ఎలా ముంచుతాడో, వంచిస్తాడో చెప్పిన కథ 'దళారి'. అగ్ర కుల అహంకారాన్ని చిత్రించిన కథ 'కాలం మారింది'. భూ'కామందు'ల లైంగిక దోపిడీనీ, లైంగిక అరాచకత్వాన్నీ వెల్లడించిన కథలు 'మనసు లేని చోట', 'దొంగలు'.

కథలు అన్నీ ప్రకాశంజిల్లా మాండలీకంతో గుభాళించాయి. సహజమైన భాష, జీవ భాష, జనం భాషని రచయిత చాలా నేర్పుగా పట్టుకున్నాడు. ప్రగతిశీల కథా సాహిత్యాభిమానులందరూ తప్పకుండా చదవాల్సిన ఉత్తమ కథల సంకలనం ఇది. కె. శివారెడ్డి, కాట్రగడ్డ దయానంద్ పుస్తకానికి ముందుమాటలు రాశారు.

**(మిత్తవ - కథా సంకలనం, రచయిత : మంచికంటి, పేజీలు : 168, వెల : రూ. 60/-, ప్రచురణ : క్రాంతి ప్రచురణలు, ఒంగోలు. ప్రతులకు : మంచికంటి, బీచ్ రోడ్, కొత్తపట్నం-523 286. ఇంకా విశాలాంధ్ర, ప్రజాశక్తి)**

మొలకలపల్లి కోటేశ్వరరావు

## బడుగు జీవుల 'బతుకు పయనం'

### బి.ఎస్. రాములు కథలు




సీనియర్ కథా రచయిత బి.ఎస్. రాములు రాసిన ఏడు కథల సంకలనం 'బతుకు పయనం'. మొదటి కథ 'నానమ్మ'. చేనేత కార్మికురాలైన ఓ నాన్నమ్మ సంవత్సరీకానికి మనుమరాలు వస్తూ, ఆమెని గూర్చిన స్మృతులతో నడిచిన కథ. చేనేత పనివాళ్ళ దుర్భర దారిద్ర్యాన్ని గురించి కొంత చర్చ నడుస్తుంది. జాతి చిహ్నంగా రాట్నాన్ని జెండా ఎక్కించిన గాంధీ తాత ఆ చేనేత బతుకులకి ఏమిచ్చాడు అని ఆ మనుమరాలు మూగగా ప్రశ్నిస్తుంది. రెండో కథ రాత్రి పూలు. ప్రేమించిన యువతి దూరమైపోగా కుటుంబం కోసం జీవితాన్ని వెచ్చించిన ఓ అన్న కథ ఇది.

లస్మయ్య, లచ్చుంబాయిలు నేతకూలీలు. రవిప్రకాశ్ పెద్ద చదువు చదువుకుని అమెరికా వెళ్ళి కుటుంబాన్ని ఆదుకుంటాడు. చెల్లెళ్ళు ఇద్దరికీ మంచి సంబంధాలు చూసి పెళ్ళిళ్ళు చేస్తాడు. తను కూడా ఒక సైంటిస్టు కూతుర్ని పెళ్ళాడుతాడు. తమ్ముడికి లారీ ట్రాన్స్‌పోర్ట్ ఏజెన్సీ ఇప్పిస్తాడు. తల్లిదండ్రుల్ని అమెరికా తీసుకుపోతాడు. అక్కడే మిత్రులందరితో కలిసి భార్య ఎండీగా ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీ ప్రారంభిస్తాడు. ఇది 'బతుకు పయనం' కథ. నేత శాలీల్ని గురించీ, వాళ్ళు వూరు వదిలి పని వెతుక్కుంటూ పోవటం గురించి, శిథిలమైపోయిన ఆ కుటుంబాలు, సంబంధాల గురించి కొంత ప్రస్తావన వుంటుంది.

బిడ్డ పెండ్లి కోసం అవసరమై బొంబాయి బట్టల మిల్లులో సాంచాలు నడిపే రాపోలు ఎల్లయ్య స్వచ్ఛంద పదవీ విరమణ చేస్తాడు. తరువాత భీవండి చేరతాడు. అక్కడ కొంతకాలం చేసి, అక్కణ్నించి స్వగ్రామం కొడిమ్యాల దగ్గర పల్లెటూరికి వస్తాడు. పొట్ట కోసం రకరకాల వృత్తులు చేస్తాడు. సిరిసిల్లలో పవర్‌లూంలో పనిచేస్తుంటే ఆ యజమాని ఆత్మహత్య చేసుకుంటాడు. అక్కడ పనిపోవటంతో గోదావరిఖనిలో ఉన్న అల్లుడి దగ్గరకి వెళ్తాడు. అక్కడ అల్లుడి పని కూడా పోతుంది. పాపం ఆ అల్లుడు కట్టెలు కొట్టడానికి వెళ్ళినా, చేపలు పట్టడానికి వెళ్ళినా బెడిసి కొడుతుంది. ఆ చేనేత కుటుంబం అల్లకల్లోలం కావడం 'ప్రశాంతం' కథ.

భార్య తండ్రి లేకపోవడంతో అత్తగారి కుటుంబాన్ని ఆదుకున్న కథ 'ఇంటల్లుడు'. మిట్టపల్లి రవీంద్ర హైస్కూల్ అసిస్టెంట్‌గా పనిచేస్తుంటాడు. పెళ్ళయిన కొంతకాలానికి భార్య తండ్రి ఏవో రోగాలతో చూపించే దిక్కులేక మరణిస్తాడు. మామ లేకపోవడంతో రవీంద్ర చిన్న

బావమరిదిని తీసుకుపోయి చదివిస్తాడు. తన చెల్లి పెళ్ళి తనే చేసి అప్పుల్లో చిక్కుకుంటాడు. ఇదే సమయంలో మరదలికి పెళ్ళి సంబంధం వస్తుంది. అందరూ వచ్చి అడగటంతో అప్పుల్లోనూ, ఇబ్బందుల్లోనూ వున్న మరదలికి పెళ్ళి జరిపిస్తాడు. చివరగా పెద్ద బావమరిది కొడుకుని కూడా తన ఇంట్లోనే వుంచుకుని చదివించడానికి సిద్ధమవుతాడు. బాధ్యత, సహృదయత, మంచితనం, మానవత్వం కలిగిన 'ఇంటల్లుడి' కథ ఇది.

రచయిత జైల్లో వున్న తన మిత్రుడ్ని కలుసుకోవడానికి వెళ్తాడు. ఆ మిత్రుడు జైలు జీవితం ఎంత గొప్పగా, అద్భుతంగా, ఆనందంగా, స్వేచ్ఛగా వుందో చెపుతాడు. "... నాలుగు డెయిలీ పేపర్లు వస్తాయి. టీవి ఉన్నది. బాత్రూంలున్నాయి. లైబ్రరీ వున్నది. కావలసినన్ని నీళ్ళు ఉన్నాయి. వాలీబాల్, కబడ్డీ, కారెమ్స్, చెస్...ఎన్నో ఆటలు హాయిగా ఆడుకోవచ్చు. పొద్దున ఏడింటికే వేడి వేడి చాయ్... తొమ్మిదిన్నరకి అన్నం... మధ్యాహ్నం మళ్ళీ చిక్కటి పాలతోటి చాయ్..." ఇప్పుడు విశాలంగా ఉన్న ప్రపంచమే జైలుగా వుందనీ, జైలు జీవితమే ఎంతో హాయి అని, ఖైదీలు ఎంతో స్వేచ్ఛాజీవులు అనీ ఈ కథ చెపుతుంది. ములాఖత్ తరువాత బయటికి వచ్చిన రచయితకి "... జైలు మీద ప్రేమ కలుగుతుంది". ఆహా... భారతదేశంలో జైళ్ళు ఇంత బాగున్నాయన్నమాట! ఈ కథ ద్వారా రచయిత జైళ్ళు ఎంతో బాగున్నాయని చెప్పాలని చాలా తాపత్రయపడ్డారు.

'జీవనయానం' పెద్ద కథ లేదా మినీ నవలగా చెప్పుకోవచ్చు. నేత కార్మికుడు చంద్రయ్య కొడుకు అరవింద్. మెడికో. అతను క్లాస్‌మేట్ మెడికోని ప్రేమిస్తాడు. ఇతని కంటే మంచి సంబంధం ఆమెకి దొరకడంతో ఇతని ప్రేమని తిరస్కరిస్తుంది. మెడిసిన్ అయిన తరువాత అతను సొంతంగా హాస్పిటల్ పెట్టుకుంటాడు. తన హాస్పిటల్లోనే పనిచేసే పిల్లల స్పెషలిస్ట్ డాక్టర్ అరుణని పెళ్ళి చేసుకుంటాడు. టూకీగా ఇది కథ. తెలుగు సినిమా ప్రేమకథే! అయితే అక్కడక్కడా సమాజం మీదా, సమాజపు తీరుతెన్నులూ, ధోరణుల మీదా, ఆర్థిక వ్యవస్థ మీదా, మానవ సంబంధాలు, సాంఘిక సంబంధాల మీదా కొన్ని కఠిన సత్యాలూ, సూత్రీకరణలూ, ప్రతిపాదనలూ ఉన్నాయి.

సీనియర్ కథా రచయిత బి.ఎస్. రాములు వెలువరించిన ఈ సంకలనం చాలా నిరాశపరిచింది. వస్తు శిల్పాల దృష్ట్యా చూస్తే కొన్ని కథలు చాలా బలహీనంగా, పేలవంగా, కృత్రిమంగా, అసహజంగా వున్నాయి. మన భూమి పత్రిక కోసం బి.ఎస్. రాముల్ని చేసిన ఇంటర్వ్యూ, పుస్తక ప్రచురణకు ఆర్థిక సాయం చేసిన డాక్టర్ దంపతుల పరిచయం, సంపాదకుల ముందుమాట అదనం.

**(బతుకు పయనం, బి.ఎస్. రాములు కథలు, సంపాదకులు : కొక్కుల భాస్కర్, గూడూరి సీతారాం, పేజీలు : 126, ధర : రూ. 45/-, ప్రతులకు : యూనివర్సిటీ ఆఫ్ సోషల్ ఫిలాసఫీ, 2-2-186/53/5, రామకృష్ణనగర్, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్- 500 013)**

---

సైదులు ఐనాల



## జీవితానుభవంలోంచి పుట్టిన ఒకానొక ఉద్వేగం అరుణ "గుప్పెడు గింజలు"

కొందరితో మాట్లాడుతుంటే ఓ సంచలన పుస్తకం చదువుతున్నట్లనిపిస్తుంది. ఓ సాహితీవేత్తతో సహచర్యం చేస్తున్నపుడు కొన్ని వందల భావాల్ని పోగేసుకుని మాలలల్లుతున్నట్లుంటుంది. కొందరి హృదయాల్నిండా సాహిత్యం పరచుకుంటుందేమోనన్నంత భ్రాంతి కలుగుతుంది. కవిత్వం నిండా ఎండిన గొంతుల్ని, కాటికెళ్తున్న సజీవ మనుష్యుల్ని, ఒక్క నీటి చుక్క కోసం జరిగే మహా సంగ్రామాల్ని నింపుకున్న కవి డాక్టర్ ఎన్. గోపి. తెలుగు పాఠకులకు పరిచయ వాక్యం అవసరం లేని కవి. నావీ నీవి కలిసి "నానీ"లంటూ సృష్టికర్తగా ఒక నూతనోత్తేజాన్ని నింపి సాహితీ లోకానికి నానీలనందించాడు. రాష్ట్ర నలుమూలలా తిరుగాడి సాహితీ క్షేత్రాల్ని సుసంపన్నం చేస్తున్నాయి. చూడగానే, చదవగానే ఇట్టే ఆకట్టుకునే గుణాల్ని సొంతం చేసుకోవడమే 'నానీ'ల ప్రత్యేకత. అట్లాంటి 'నానీ'లను ఇంకా చెప్పాలంటే అంతకు మించిన వ్యక్తీకరణతో 'నానీ'లను గుప్పెడు పట్టి గుమ్మరించారు ఎన్. అరుణ.

నానీల ఆలోచన గోపీగారిదా? అరుణగారిదా? అనే అనుమానం కలగక మానదు గోపి సతీమణి అరుణ అందించిన "గుప్పెడు గింజలు" నానీల సంపుటి చదివితే. తను అనుభవించిన జీవితాన్ని 'నానీ'గా మలచిన తీరు అరుణను అగ్రస్థానంలో నిలబెడతాయని చెప్పవచ్చు.

"నేను / వర్షాన్ని ప్రేమిస్తాను / ధూళిగా విడిపోయిన నన్ను / ముద్దగా చేస్తుంది /" వర్షంలోని సహజ గుణాన్ని తన తత్వంతో పోల్చుకుంది కవయిత్రి. వర్షాన్ని ఎండిన బీడు, తడారిన రైతు గొంతు, బక్కచిక్కిన జంతువులు ఎవరు ప్రేమించరూ? అదే విధంగా కవయిత్రి వర్షాన్ని ప్రేమిస్తుందట. దానికి కారణమేంటో చెప్పడంలో అందరికీ తెల్సిన దాన్నే భావుకతగా చెప్పడం పాఠకుల్ని ఆకర్షిస్తుందీ 'నానీ'. అలాగే మనిషి రోజురోజుకీ ప్రకృతిపై యుద్ధ బావుటా ఎగరేస్తున్నాడు. ప్రతిసారీ విజయాన్నే కోరుకునే మనిషి తన మనసులోని వికృతిని మాత్రం జయించలేకపోతున్నాడంటూ "మనిషి జయించాల్సింది / ప్రకృతిని కాదు/ మనసులోని / వికృతిని" చెప్పడంలో సున్నితమైన విమర్శ ఉంది. ఎండకు ఎండిన మన్నుపై వచ్చే తొలకరి వాసనలు ఎందర్ని కవుల్ని చేసిందో. మరెందర్ని కవయిత్రులుగా మలిచిందో "వెళ్ళిపోతున్న / వేసవిని చూసి / కన్నీటి జల్లులా / తొలకరి" అంతా మనం చూసేదే. వినేదే కానీ అదే వస్తువు చిత్రణలో తేడాగా, అభివ్యక్తిలో భిన్నంగా నేర్పు గల శిల్పి చేతిలో చెక్కబడ్డ శిల్పంగా 'నానీ'ల నందించిన కవయిత్రి ఎన్. అరుణకు అభినందనలు జీవిత సారాన్ని మరింత చిక్కగా మున్ముందు పాఠకులకు అందిస్తారని ఆశించడం ఎక్కువ కాదేమో! మోహన్ కవర్ డిజైన్, ఓల్గా చెప్పిన మాటలు ఈ నానీల పుస్తకానికి విలువని మరింత పెంచాయి.

**(గుప్పెడు గింజలు (నానీలు) - అరుణ, పేజీలు : 53, వెల : రూ. 30/-, ప్రతులకు : ఎన్. అరుణ, 13-1-5బి, శ్రీనివాసపురం, రామంతపూర్, హైదరాబాద్-13, ఫోన్: 040 - 27037585 మరియు విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

తెలకపల్లి రవి




# అవగాహన పెంచే 'సమయమూ, సందర్భమూ'

సమాజానికీ సాహిత్యానికి మధ్య వుండే సంబంధం గురించి కొత్తగా చెప్పాల్సింది లేదు. ఆ సమాజాన్నీ, సాహిత్యాన్నీ కూడా పట్టించుకుని పరితపించే వ్యక్తి సింగమనేని నారాయణ. కావ్యకర్త మాత్రమే కాక కార్యకర్త కూడా. కరువు పిలవకుండానే పలికే అనంతపురం జిల్లాలో ప్రగతిశీల సాహిత్య సామాజిక కార్యక్రమాలన్నిటికీ ఆయన ప్రోత్సాహం, ప్రత్యక్ష భాగస్వామ్యం వుంటాయి. బహుముఖ కార్యకలాపాల్లో మునిగితేలుతున్నా ఆయన సాహిత్య వ్యాసంగాన్ని నిర్లక్ష్యం చేయరు. నిశితంగా పరిశీలిస్తూ నిర్మొహమాటంగా నిర్మాణాత్మకంగా స్పందిస్తూ వుంటారు. ఇప్పుడు తెలుగు కథ గురించిన గుర్తింపు పెరిగిందని అందరూ అంగీకరిస్తున్నారు. కాని ఆ పరిణామం తీసుకురావడానికి ప్రారంభ వచనం పలికిన వారిలో సింగమనేని ఒకరు. ప్రత్యేకించి రాయలసీమలో కథ పుట్టుక, పరిణామం, ప్రస్తుత స్థితి వీటన్నిటి పట్లా ఆయనకున్న అవగాహన, ఆసక్తి విశేషమైనవి. సమయమూ సందర్భమూ అన్న ఈ వ్యాస సంకలనంలో సింగమనేని ప్రధానంగా తెలుగు కథ గురించి విశ్లేషణనందించారు. కొన్ని నవలలపైన రాసిన విమర్శలూ, తెలుగు భాషా సమస్యపై విశ్లేషణా కూడా వున్నాయి.

రాయలసీమ కథా చిత్రం అన్న తొలి వ్యాసంలో సింగమనేని ఆర్థిక రాజకీయ నేపథ్యంలో కోస్తా జిల్లాల కన్నా అక్కడ కథా ప్రక్రియ ఆలస్యంగా ప్రవేశించడానికి దారితీసిన పరిస్థితులను సాకల్యంగా పేర్కొంటారు. గురజాడ కన్యాశుల్కం రాసే నాటికి ఇక్కడ ఇంకా సంప్రదాయ కవితే రాజ్యమేలడానికి గల కారణాలను విశదపరచారు. 'రెండు బండల మధ్య నెరియల్లోనుంచి అంకురించి తన ఉనికి కోసం మనుగడ కోసం ప్రకృతితో పోరాడే రాతి మొక్కలా ఎదిగి శాఖోపశాఖల మహావృక్షంగా విస్తరిల్లిన రచయిత కె.సభా గారు' అంటూ మరో మంచి కథకుడైన మధురాంతకం రాజారాం మాటలను ఉటంకించారు. తర్వాత రాజారాం కథలనూ పరిచయం చేసి ఆయన శైలిని విశ్లేషించారు. రాయలసీమలో కథలు రాస్తున్న వారిని సౌలభ్యం కోసం రెండుగా విభజించారు. అక్కడి నుంచి మొదలు పెట్టి అత్యాధునికుల వరకూ ప్రస్తావించి వారి వారి ప్రత్యేకతలు విశిష్టతలూ వివరించారు. ఈ తరాల మధ్య తేడాలు, వాటి ప్రాతిపదిక వగైరాలను కూడా సోదాహరణంగా పొందుపరచారు. కోస్తా ప్రాంతంలో కథకులు ప్రధానంగా బ్రాహ్మణులు కాగా ఇక్కడ బ్రాహ్మణేతరులే రాయడానికి గల కారణాలను పరిశోధించాలన్నారు. "రాయలసీమ కథలకు నేడు తెలుగు సాహిత్యంలో ఒక ఆమోదయోగ్యమైన స్థానం వున్నది. రాయలసీమ కథకులందరూ మట్టివాసనలు అనుభవించిన వారు అని ముగింపులో పేర్కొన్నారు. రాయలసీమ పరిస్థితులకూ అక్కడ వెలువడిన కథలకూ మధ్య అంతస్సంబంధాన్ని సాధికారంగా వివరించే ఈ వ్యాసం సాహిత్యపరంగానే గాక సామాజిక అవగాహనకూ దోహదకారి.

తొంభయ్యవ దశకంలో తెలుగు కథ, 2002లో తెలుగు కథ అన్న మరో రెండు దీర్ఘ వ్యాసాలలో సింగమనేని ప్రపంచీకరణ నేపథ్యంలో కథల తీరుతెన్నులు వివరిస్తారు. ఈనాడు ముందుకొచ్చిన సాంస్కృతిక ఆర్థిక సమస్యలను, వాటికి స్పందనగా రచయితల సృజననూ పోల్చిచూపారు. సింగమనేని శైలికన్నా సామాజిక సారాంశానికి ప్రాధాన్యతనిస్తారని ఈ వ్యాసాలు తేటతెల్లం చేస్తాయి. వి.చంద్రశేఖర రావు, గోపిని కరుణాకర్ వంటివారి శైలీ విన్యాసాలను ఆయన పెద్దగా హర్షించకపోగా నిశితంగా విభేదించారు. అలాగే వ్యవస్థితమైన ఆరోగ్యకరమైన సామాజిక విలువల పట్ల ఆషామాషీగా వ్యవహరించే రచనలనూ, అరాచకపు ఛాయలను నిస్సంకోచంగా విమర్శిస్తారు. అంతకుముందు సంవత్సరాలతో పోలిస్తే 2002లో కథ క్రమానుగత శిఖరారోహణ చేయలేదని అభిప్రాయపడ్డారు. స్త్రీవాదంలో బలంగా కనిపించే సమస్యా చిత్రణను అభినందిస్తూనే దాని పరిమితులనూ, ఆ కోవలోని కొంతమంది రచనల పాక్షికత్వాన్ని ఎత్తిచూపుతారు.

ఇవేగాక ప్రసిద్ధ కథకులైన చాగంటి సోమయాజులు, కేతు విశ్వనాథరెడ్డి, మధురాంతకం రాజారాం, రాచమల్లు రామచంద్రారెడ్డి, వంటి వారి కథలనూ, కథన శైలుల ప్రత్యేకతలను విశ్లేషణాత్మకంగా తెలియజేస్తారు. వి.ప్రతిమ కథా సంపుటికి రాసిన ముందు మాటలో ఆమె కథల పరామర్శ వుంది.

రంగనాయకమ్మ జానకి విముక్తిపై సింగమనేని వ్యాఖ్యలు సాహిత్యంలో సామాజిక సిద్ధాంతాలను చెప్పవలసిన తీరును ప్రతిబింబిస్తాయి. అంతా వాదనలు బోధనలు మయం కావడాన్ని విమర్శిస్తాయి. యుద్ధనపూడి సులోచనా రాణి కీర్తికిరీటాలను సమీక్షిస్తూ చేసిన రచన చూస్తే ఒకనాటి వ్యాపార నవల ఎలా వుండేదో తెలుస్తుంది. ఇక మహీధర రామమోహనరావు ' కొల్లాయి గట్టితేనేమి' పైనా ప్రసంగ వ్యాసం వుంది. మహీధరమంతటి నవల అన్న శీర్షికలోనే దాని సారాంశం సాక్షాత్కరిస్తుంది. తెలుగులో బోధన అవసరంపై 2003-04 మధ్య అనంతపురం ఆకాశవాణి నుంచి ప్రసారమైన ప్రసంగాలను ఈ పుస్తకం చివరి భాగంలో ఇచ్చారు. నేడు జరుగుతున్న చర్చల నేపథ్యంలో ఈ వ్యాసానికి ప్రత్యేక ప్రాధాన్యత వుంది.

మొత్తంపైన సీనియర్ కథకుడూ, విమర్శకుడూ మాత్రమే కాక సామాజిక ఉద్యమ కారుడు కూడా అయిన సింగమనేని వ్యాసాలు నిబద్ధత నిశితత్వం గల ఒక నిరాడంబర సాహిత్య జీవిని మన ముందుంచుతాయి.

**(సమయమూ - సందర్భమూ (సాహిత్య వ్యాసాలు) - సింగమనేని నారాయణ, పేజీలు : 132, వెల : రూ. 50/-, ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

# ఛాయాగీత్



డా॥ ఎన్ గోపి

సూర్యుడికే
సూర్యుడు కనిపించనంత కాంతి!
మధ్యాహ్నం ఒంటినిండా మెరుపు
గాలి కూడా తళతళ!
ఒక్క నీడ మాత్రం
చెట్టుకింద శకలాలుగా
కురులను మీటుకుంటుంది
నీడ అంది కదా!
"సూర్యుడికి బుద్ధిలేదు
ఒళ్ళుంది కదా అని
బాహువులు సాచి
లోకమంతా పొర్లుతున్నాడు

నాకు నిలువ నీడ లేకుండా చెయ్యాలని
కిరణాలకు ఆరాటం
అదెలా కుదురుతుంది?
నీటిలాంటి దాన్ని కదా నేను!
ప్రవాహం నా స్వభావం
ఎన్ని పాయలుగానైనా చీలుతాను
ఈ తీగెకు మొదలెక్కడో!

కిరణం సంగతి వేరు
వొంచితే విరిగే పెలుసుకట్టె
కిరణం సూదిగా మారి
అదే పనిగా నన్ను గుచ్చితే
రక్త సంధ్యే దానికి ప్రాప్తి
ఇప్పుడిక ధోకా లేదు నాకు
చీకటి ఎదురొచ్చి కౌగిలించుకుంది
దాని ఒడిలో ఎంత భద్రత!
ఎందుకంటే
అది బోలెడన్ని నక్షత్రాల్ని
వెంట తెచ్చింది మరి!

---

# అమ్మా! అంటే ఏమిటి మమ్మీ?



వై.హెచ్.కె. మోహన్‌రావు

క్షీరసాగర మధనంలో
అమృతంతో ఉదయించింది
అమరులేలిన అమరావతికి
సాక్షీభూతంగా నిలిచింది
వేయి స్తంభాలను పోగరలతో
పలుకరించి పరవశించింది
సుప్తశిలలను సప్తస్వరాలుగా
మలచిన నాదశిల్పి
అమ్మదనంలో కమ్మదనం కలిపి
వడపోసిన తేనెలూరు తెలుగు
కాకతీయుల నేల కదం తొక్కిన వెలుగు
కొండవీడు శిఖరాన గణితికెక్కిన తెలుగు
అష్టదిగ్గజాల ఆశువై అలరింది

కృష్ణరాయల నోట 'లెస్స'గా పలికింది
వెలుగు భారతికి తెలుగు హారతి అయ్యింది
క్షరములేని అక్షరమై నడిచింది
మల్లెల గుభాళింపు వెదజల్లిన తెలుగు
మంచి గంధం విరజిమ్మిన వెలుగు
పడమర పొగతో మసకబారుతుంది
ఉరికొయ్యలుగా మారిన పట్నాలు
మరణశయ్యలైన కార్యాలయాలు
పరభాషా వేషాలేసుకున్న కొలువులు

తల్లిభాషకు తిలోదకాలు ఇస్తున్న సచివులు
అమ్మా అంటే ఏమిటి మమ్మీ
అని ప్రశ్నిస్తున్న కాన్వెంట్ బళ్ళు
ఇప్పుడు
చదువుకున్నవాడు తల్లి తెలుగుకు శాపం
వాడి కరెన్సీ దాహం కన్నతల్లికి లోపం
తెలుగింట తెలుగిప్పుడు సవతి బిడ్డ
తెరువు తెలియక తల్లడిల్లుతున్న
తెలుగు బావుటా రెపరెపలాడేందుకు
ప్రతి నట్టింటా తెలుగు ధ్వజాన్ని ఎత్తుదాం
తెలుగు మాగాణంలో
పశ్చిమ కలుపుని ఏరివేద్దాం
ఈ ఉగాది వాకిట
అచ్చ తెలుగు తోరణాలు కడదాం

---

# సృష్టి రహస్యం



శైలజామిత్ర

జీవితం కాలవేగ చలనంలో
అదృష్ట సీమల్ని అతిక్రమిస్తూ...
అసాధ్యమైన అపాయాల్ని గుర్తిస్తూ...
ఒకప్పుడు పక్షిలా... మరొకప్పుడు జంతువులా
పాములా... విష కీటకంలా
విషాదం, ఆనందాల మధ్య సన్నివేశాన్ని బట్టి
మారడమే ప్రకృతి మాత అమృతతత్వం
కరువు కాటకాలతో స్వేచ్ఛగా విహరించే భౌతిక పరావర్తనం
ఎప్పటికప్పుడు చేపడుతున్న మనిషి సరికొత్త ప్రయాణం
నిలువుటద్దంలో కనబడుతున్న సూర్యబింబ నివాస స్థలం
చీకటి సమావేశంలో ఏకగ్రీవంగా ప్రకటిస్తున్న నిరసన పత్రం
అరె!! మళ్ళీ తెల్లవారింది ఆహ్లాదంగా సమయం
ఒకసారి వెన్నెల సంద్రంలా

ఒకమారు ప్రశాంత మంద్రంలా
కదిలిపోతున్న మేఘంలా
జారిపోతున్న కాలంలా
నిద్రిస్తున్న ఆకాశంలా
ఒదిగిపోతున్న పాపాయిలా
జన్మిస్తున్నప్పటి నుండి ముఖంలో ప్రతిబింబిస్తూ
ప్రతి నిమిషం సమయానికై ఎదురుచూస్తుంది భవిష్యత్తు
క్షణక్షణం అంతమొందిస్తుంది వర్తమానం
దుఃఖత్రయంతో బంధింపబడివున్న ఈ గుండె
రెండు ముక్కలై, చెక్కలై
ఒకదాని ముఖం మరొకదానికి కనబడనీయకుండా
దిశదిశలా వాక్చిత్రం పొందేలోగా నిరాశగా మింగేస్తోంది మృత్యువు
ఆది తుది ఎరుగని మహాకాంతి పుంజాలు ఈ మానవులు
అహంకారం, అంధకారం తెలియని అంతఃకరణ
ప్రతీక స్వరూపమే ఈ ప్రపంచం...
ఈ కాంతుల్ని పట్టుకోవడానికీ, ఈ రూపం మారిపోవడానికీ
తిరిగి తిరిగి మరో రూపంలో ప్రత్యక్షం కావడమే
ఎవరికీ అర్థం కాని సృష్టి రహస్యం...

# తెలుగులో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం



విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథల పరమావధి కేవలం ఆనందం కాదు. ప్రపంచంలో శాస్త్ర సాంకేతిక రంగాలలో జరుగుతున్న నూతన ఆవిష్కరణలను గూర్చి, వాటి అభివృద్ధిని గూర్చిన విజ్ఞానికాంశాలను ఫిక్షన్‌తో జత చేసి పాఠకులకు అందించడం ముఖ్య లక్ష్యంగా ఉండాలి. విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథల ద్వారా నేటి బాలబాలికలకు సైన్సు పట్ల ఆసక్తిని, శాస్త్ర - సాంకేతిక రంగాల యందు జిజ్ఞాసను పెంపొందించ గలిగినపుడే మన దేశం వైజ్ఞానిక రంగంలో ఉన్నత శిఖరాలను అధిరోహించగలదు.

**తన్నీరు కళ్యాణ్‌కుమార్**
**రీసెర్చి స్కాలర్, నాగార్జున యూనివర్శిటీ**

ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో అత్యంత ప్రజాదరణ పొందిన సాహిత్య ప్రక్రియగా కథా సాహిత్యాన్ని చెప్పుకోవచ్చు. తెలుగు వాళ్ళకు అనేక వందల సంవత్సరాలుగా కథా సాహిత్యం ఉన్నప్పటికీ ఆంగ్ల సాహిత్య ప్రభావంతోనే దానికి ఒక నిర్దిష్ట రూపం, ఒరవడి కలిగాయి. తెలుగు సాహిత్యంలో ఆంగ్ల భాష ప్రభావంతో ఈ శతాబ్దంలో ఆవిష్కరణలు పొందిన నూతన ప్రక్రియ విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం. ఈ ప్రక్రియ మన సాహిత్యంలో కొన్ని దశాబ్దాల ముందే ఉదయించినా, తన పరిధిని విస్తృతం చేసుకోవడంలో సఫలీకృతం కాలేకపోయింది.

విజ్ఞానరంగంలో వచ్చిన మార్పులు సాహిత్యం మీద చూపిన ప్రభావమే వైజ్ఞానిక కాల్పనిక సాహిత్య ఆవిర్భావానికి కారణం. విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యాన్ని ఆంగ్లంలో 'సైన్సు ఫిక్షన్' అంటారు. రచన కాలం వరకు వెలుగు చూసిన వైజ్ఞానిక అంశాలను దృష్టిలో ఉంచుకొని వాటి ప్రాతిపదికగా భవిష్యత్తులో ఆవిష్కృతం కావడానికి అవకాశం ఉన్న సైన్సు పరికరాలు, యంత్రాలు, పద్ధతులను, మానవ సమాజంపై చూపే ప్రభావాన్ని ముందుగానే ఊహిస్తూ సృజించే సాహిత్యమే వైజ్ఞానిక శాస్త్ర కాల్పనిక సాహిత్యం.

విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యానికి సంబంధించిన లక్షణాలు ఇవి అని ఇతమిద్ధంగా చెప్పలేక పోయినప్పటికీ, ఆయా విజ్ఞానశాస్త్ర కాల్పనిక రచనలు ఆధారంగా కొన్ని లక్షణాలు నిర్ధారించవచ్చు.

1. విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యంలో సైన్సుకు ఎంత ప్రాధాన్యం ఉంటుందో అంతకంటే ఎక్కువ ప్రాధాన్యం ఊహలకు ఉంటుంది.

2. విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యంలో రచయితచే చేయబడిన ఊహలు భవిష్యత్తులో నిజరూపం దాల్చడానికి అవకాశం ఉందేమో అనే భావన పాఠకునికి కలిగిస్తుంది.

3. భవిష్యత్తులో మారనున్న మానవ జీవితాన్ని గూర్చి, పొంచివున్న ప్రమాదాలను గూర్చి ముందుగానే విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యం ఊహిస్తుంది.

4. విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యం భవిష్యత్తులో మానవుడు కనుగొనడానికి అవకాశం గల నూతన పరికరాలను, నూతన ప్రయోగాలను, నూతన పరిశోధనలను ఊహిస్తుంది.

ఈ లక్షణాలు కలిగియున్నది మాత్రమే విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యం కాదు. దీని పరిధి విస్తరించే కొద్దీ ఈ లక్షణాలు కూడా పెరిగే అవకాశం ఉంది.

19వ శతాబ్దంలో పాశ్చాత్య సాహిత్యంలో విజ్ఞానశాస్త్ర కాల్పనిక రచనలు విరివిగా వెలువడ్డాయి. ఎడ్గర్ అలెన్‌పో, జూల్స్‌వేర్న్, హెచ్.జి. వెల్స్, మేరీ షెల్లీ, అసిమోవ్, సి.ఆర్. క్లార్క్, నాతనియెల్ హోతార్న్, ఫిట్‌జేమ్స్, ఒబ్రియన్ మొదలైన రచయితలు విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలు. నవలలు రాశారు. 1840 నాటికే అమెరికాలో ఎడ్గార్ అలెన్‌పో అనే రచయిత చంద్రమండల యాత్రను, జూల్స్‌వేర్న్ (1880) హెలీకాప్టర్‌ను, జలాంతర్గామిని, ఖండాంతర క్షిపణిని ఊహించారు. వైజ్ఞానిక శాస్త్ర ప్రాతిపదికగా వారు చేసిన ఊహలు తరువాత కాలంలో వాస్తవ రూపాన్ని దాల్చాయి. 1939 ప్రాంతంలో ఆసిమోవ్ అనే రచయిత ఊహించిన మరమనిషి. అంతరిక్ష నౌక నేడు వాస్తవాలయ్యాయి. కవుల కల్పనలకు, రచయితల ఊహాశక్తికి గౌరవం లభించింది. పైన పేర్కొన్న ఆంగ్ల రచయితల ప్రేరణతో తెలుగు రచయితలు కూడా విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యాన్ని సృజియించాడు.

తెలుగు సాహిత్యంలో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలు ప్రారంభ దశ నుండి నేటి వరకు అనేక మార్పులకు లోనవుతూ వెలువడ్డాయి. తెలుగులో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్య ప్రారంభం 1927 ప్రాంతంలోనే జరిగింది. 1927 తెలంగాణా ప్రాంతం నుండి వెలువడిన 'సుజాత' మాసపత్రికలో సిరిగూరి జయరావుగారి 'పరమాణువులో మేజువాణి', 1928 మార్చి సంచికలో శంకర నారాయణరావుగారి 'చంద్రమండల చోద్యములు' ప్రచురించబడినవి. అయితే ఈ కథలను పూర్తి స్థాయి విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలుగా చెప్పలేము. ఆ కాలం వరకు వెలుగు చూసిన శాస్త్ర విషయాలను, పరిశోధన ఫలితాలను, ఊహలను పాఠకులకు సులభంగా అర్థమయ్యే రీతిలో చెప్పడానికి చేసిన తొలి ప్రయత్నంగా చెప్పుకోవచ్చు. ఈ కథలను విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలు అనే కంటే, వైజ్ఞానిక కథలుగా భావించడం సబబు. కాని ఈ రచయితలు భవిష్యత్తులో రానున్న రచయితలకు వీరు స్ఫూర్తిదాయకం అయ్యారు.

1930 తరువాత దాదాపు 25 సంవత్సరాల వరకు మన సాహిత్యంలో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం

కన్పించడం లేదు. ప్రజలు జాతీయోద్యమ రచనల వట్ల ఆకర్షితులు కావడం. నిరక్షరాస్యత, రెండవ ప్రపంచయుద్ధం వల్ల విజ్ఞాన పరిశోధనలు స్తంభించిపోవడం ఈ స్తబ్దతకు కారణాలై ఉండవచ్చు. 1956 నుండి మరలా విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలు రావడం ప్రారంభమైనవి. రెండవ ప్రపంచయుద్ధం తరువాత తెలుగు సాహిత్యంపై కమ్యూనిజం ప్రభావం ప్రసరించింది. ఈ కాలానికి చెందిన కొడవటిగంటి కుటుంబరావుగారు 'చంద్రగ్రహంలో', గ్రహాంతర యాత్ర' కథలను రాశారు. ఈ కథలలో రచయిత శాస్త్రీయ విజ్ఞాన ఊహలను, కల్పనలను సమకాలీన సమాజ వ్యవస్థలతో అన్వయించి సమాజంలోని లోపాలను విమర్శించడం కన్పిస్తుంది.

1956 ప్రాంతంలోనే ఆంగ్ల సాహిత్య ప్రభావంతో అపరాధ పరిశోధన రచనలు చేయడం తెలుగు రచయితలు అలవర్చుకున్నారు. రచయితలు అపరాధ పరిశోధనల రచనల పేరున ఎన్నో వైజ్ఞానికాంశాలను పాఠకులకు అందించారు. ఎన్.ఆర్. నందిగారు సాధికారమైన విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథను రాసి అత్యాధునిక తెలుగు విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథకు ఆద్యుడైనారు. ఈ కథ పేరు 'రెండు జడల కళ్ళజోడు'. ఈ కథ 1956లో 'డిటెక్టివ్' అనే మాసపత్రికలో సెప్టెంబర్ సంచికలో ముద్రితమైనది. డిటెక్టివ్ పత్రికలలో నందిగారు 'పరకాయ ప్రవేశం', 'మానవుడు – దానవుడు' కథలను రాశారు. ఈ కథలలోని అంశాలన్నీ వైజ్ఞానిక సంబంధమైనవే. కాని కథనం మాత్రం అపరాధ పరిశోధన పద్ధతిలో సాగుతుంది.

'చుక్కాని' అనే పక్ష పత్రికలో 1959 జూన్ సంచికలో వెలువడిన కె.ఆర్.కె. మోహన్‌గారి 'చంద్రమండల యాత్ర' కథను పూర్తి స్థాయి విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా లక్షణాలతో కూడిన కథగా చెప్పవచ్చు. ఈ కథలో రచయిత చంద్రమండలాన్ని గూర్చి చేసిన ఊహ పది సంవత్సరాల తరువాత 'నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్' చంద్రునిపై కాలు మోపడంతో నిజమైనది. కె.ఆర్.కె మోహన్‌గారు 'సైన్స్ ఫిక్షన్ కథలు' అనే పేరుతో తన విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథల సంకలనాన్ని ప్రచురించారు.

తెలుగులో పురాణపండ రంగనాథ్, మైనంపాటి భాస్కర్, కె. సదాశివరావు, రెంటాల నాగేశ్వరరావు, విల్లలమఱ్ఱి

— — — — * * * — — — —

**ఇతర కథలతో పోలిస్తే విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలో పాత్రల ప్రాముఖ్యత చాలా తక్కువని చెప్పవచ్చు. విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలో కథంతా అందులో రచయిత చెప్పదలచుకున్న వైజ్ఞానికాంశం చుట్టూ తిరుగుతుంది. ఈ వైజ్ఞానికాంశమే కథలో ప్రధాన పాత్ర అని చెప్పుకోవచ్చు.**

— — — — * * * — — — —

రాజ్యలక్ష్మి, యండమూరి వీరేంద్రనాథ్, యర్రమిల్లి జె. శేఖరం, శంఖువరపు సరోజ సింధూరి, మధురాంతకం నరేంద్ర, రాపేటి రామకృష్ణరావు, మొహమ్మద్ ఫిరోజియా మొదలైన వారు విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలను రాశారు. కె. సదాశివరావుగారి 'ఆత్మాఫాక్టర్', 'మానవాఫాక్టర్' కథలు అనేకమంది పాఠకుల మన్ననలను పొందాయి.

తెలుగులో వెలువడుతున్న విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలపై కేవలం విజ్ఞానశాస్త్ర పరిశోధనల ప్రభావం మాత్రమే కాక, సమాజంలో వస్తున్న సాంఘిక మార్పుల ప్రభావం కూడా ఉంది. సమాజంలో వస్తున్న సాంఘిక మార్పులను, విజ్ఞాన రంగాలలో జరుగుతున్న పరిశోధన ఫలితాలను తనలో మిళితం చేసుకొని తెలుగులో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథారచన సాగిపోతుంది.

తెలుగులో వచ్చిన విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలను ఇతివృత్తం ఆధారంగా చేసుకొని కొన్ని రకాలుగా వర్గీకరించవచ్చు.

1. అంతరిక్షయానం లేక గ్రహాంతర యానాలకు సంబంధించిన కథలు.
2. రోబోట్ లేక కంప్యూటర్‌లకు సంబంధించిన కథలు.
3. జన్యుశాస్త్ర, వైద్యరంగానికి సంబంధించిన కథలు.
4. భవిష్యత్తులో సంభవించనున్న పరిణామాల ఊహలకు సంబంధించిన కథలు.
5. భౌతిక, రసాయనిక శాస్త్రాలకు సంబంధించిన కథలు.

విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలోని కథా శిల్పాన్ని పరిశీలిస్తే విజ్ఞానశాస్త్ర కాల్పనిక రచయితలు ఏదో ఒక చిన్న సంఘటనను తీసుకొని దాని చుట్టూనే కథను అల్లుతారు. దాదాపు విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలు అన్ని ప్రథమ పురుషలోనే కథనం కలిగి ఉంటాయి. రచయిత చెప్పదలచు కొన్న వైజ్ఞానికాంశాలను పాఠకులు త్వరగా అవగాహన చేసుకోవడానికి ప్రథమ పురుష కథనమే ఉత్తమమైనది. విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలో సంఘర్షణ ఎక్కువగా ఇద్దరు శాస్త్రవేత్తల మధ్య గాని లేదా వేరు వేరు గ్రహవాసుల మధ్య గాని చిత్రీకరించబడుతుంది. అంతరిక్షయానాలలో సంభవించే ప్రమాదాలు సైతం కథను సంఘర్షణకు గురిచేసి పాఠకులకు ఆసక్తి కలిగించే విధంగా కథనం సాగిపోయేటట్లు చేస్తాయి.

విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలో ఎక్కువగా ఇతర గ్రహాలలో వాతావరణ పరిస్థితులను గూర్చి, రాబోయే కాలంలో విజ్ఞానశాస్త్ర అభివృద్ధి వలన మారే మానవ నాగరికత, భౌతిక జీవనాన్ని గూర్చి సన్నివేశ చిత్రణలు ఉంటాయి. విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలోని భాషను గాని, కథా శీర్షికలను పరిశీలిస్తే ఆ కథా రచయితలు ఎక్కువగా ఆంగ్ల భాష వదాలను ఉపయోగిస్తున్నారని చెప్పవచ్చు. దీనికి కారణం సైన్స్‌కు సంబంధించిన పదాలకు సమానార్థాన్నిచ్చే పదాలు తెలుగులో లేకపోవడం ఒక కారణం. ఒకవేళ ఉన్నప్పటికీ ఆ పదాలకు ప్రజాదరణ లభించడం లేదు. ఆంగ్ల భాష మీద రచయితలకు ఉన్న మక్కువ కూడా ఆంగ్ల భాషా పదాలను ఎక్కువగా ఉపయోగించడానికి కారణం అవుతుంది.

ఇతర కథలతో పోలిస్తే విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలో పాత్రల ప్రాముఖ్యత చాలా తక్కువని చెప్పవచ్చు. విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలో కథంతా అందులో రచయిత చెప్పదలచుకున్న వైజ్ఞానికాంశం చుట్టూ తిరుగుతుంది. ఈ వైజ్ఞానికాంశమే కథలో ప్రధాన పాత్ర అని చెప్పుకోవచ్చు. కథలో రచయిత చెప్పదలచుకున్న వైజ్ఞానికాంశానికి అనుసంధానంగానే పాత్రల సృష్టి జరుగుతుంది. పాఠకులు కూడా పాత్రలను దృష్టిలో పెట్టుకొని చదువుతారు. విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలో మనకు కన్పించే భాష ఆధునిక ప్రమాణ భాష, కథనంలోని అన్నీ పాత్రల సంభాషణల్లోను ఇదే కన్పిస్తుంది. ఈ కథలలోని పాత్రలు కూడా నగర జీవితాన్ని దాటిపోవు. కావున మాండలిక భాషను ఉపయోగించుటకు ఇచ్చట అవకాశం లేదు.

విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలలో ఏ

కొద్ది కథలు మినహాయించి చాలా కథలు శిల్పపరంగా బలహీనంగా ఉన్నాయని చెప్ప వచ్చు. దీనికి ముఖ్య కారణం రచయితలకు సాహిత్యం మీద మంచి పట్టు లేకపోవడమే. అంతేగాకుండా వైజ్ఞానికాంశాలను పాఠకులకు అందించాలనే తాపత్రయంలో రచయితలు శిల్పంపై అంతగా దృష్టి సారించడం లేదు.

సాహిత్యం యొక్క ముఖ్య లక్ష్యం సామాజిక ప్రయోజనం. తెలుగు కథా సాహిత్యంలోని ఒక కోవకు చెందిన విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం యొక్క ఆవశ్యకత సమాజానికి ఉంది. విజ్ఞానశాస్త్ర అభివృద్ధితో ప్రపంచమే ఒక కుగ్రామంగా మారుతున్న ఈ శతాబ్దంలో విజ్ఞానశాస్త్ర మూలాలను సామాన్య ప్రజలకు, ముఖ్యంగా బాలబాలికలకు అందించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఈ అవసరాన్ని విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం తీరుస్తుంది. ఈ కథా సాహిత్యం ప్రస్తుతం మానవజాతి ఎదుర్కొంటున్న సమస్యలను వివరించి ఈ సమస్యలు భవిష్యత్తులో ఏ విధంగా తీవ్రతరమవడానికి అవకాశం ఉందో విశదీకరిస్తూ ఆ సమస్యల పట్ల ప్రజలకు అవగాహన కలిగేటట్లు చేస్తుంది. విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యం కేవలం భవిష్యత్తు ఈ విధంగా ఉంటుంది అని చెప్పడవే కాదు. భవిష్యత్తులోని లోటుపాతులను కూడా వివరిస్తుంది.

వివిధ రకాలైన ఆలోచనలతో, సిద్ధాంతపరంగా వెలువడే విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యం అటు రచయితలకు, ఇటు శాస్త్రవేత్తలకు అనుసంధాన్ని ఏర్పరుస్తుంది. భవిష్యత్తులో నూతన పరికరాలను, నూతన పరిశోధనలను, నూతన ప్రయోగాలను సృష్టించడానికి ఈ సాహిత్యం ఒక మార్గదర్శి. విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్య అధ్యయనం మానవ పరిశోధన వికాసానికి దోహదం చేస్తుంది. సైన్సు అనేది రెండు వైపులా

— — — — * * * — — — —

**పాశ్చాత్య దేశాలలో వలె తెలుగులో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం విజయవంతంగా వెలువడక పోవడానికి నిరక్షరాస్యత ఎక్కువగా ఉండటం ప్రధాన కారణం.**

— — — — * * * — — — —

పదునున్న కత్తివంటిది. సైన్సు మేలుతో పాటు కీడును కూడా కలిగిస్తుంది. విజ్ఞానశాస్త్ర కాల్పనిక సాహిత్యం సైన్సును ఉపయోగించు కోవలసిన తీరును, సైన్సును స్వార్థానికి ఉపయోగించు కోవడం వల్ల కలిగే దుష్పరిణామాలను గూర్చి హెచ్చరిస్తుంది.

1956 సంవత్సరంలో తెలుగున విజ్ఞానశాస్త్ర కాల్పనిక తొలి కథ వెలుగు చూసిందని అనుకుంటే గడిచిన ఈ 49 సంవత్సరాలలో పట్టుమని వంద కథలు అయినా సాధికారికంగా కాకపోయినా సంఖ్యాపరంగానైనా వెలువడకపోవడం విచారం. తెలుగులో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం అంతగా వెలువడకపోవడానికి ప్రధానంగా రెండు కారణాలు చెప్పుకోవచ్చు. ఇందులో మొదటి కారణానికి రచయితలు, పత్రికలు కేంద్రం కాగా, రెండవ కారణానికి పాఠకులు కేంద్రంగా ఉన్నారని చెప్పవచ్చు.

నేటి పత్రికలు సినిమాలకు, క్రైమ్ కథలకు ఇచ్చినంత స్థానం విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథలకు ఇవ్వడం లేదు. విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యాన్ని సృజియించే రచయితలు అటు సైన్సు మీదో, ఇటు సాహిత్యం మీదో పట్టు కలిగి ఉంటున్నారు. సైన్సు, సాహిత్యం రెండింటి పైన పట్టు కలిగిన రచయిత సృజియించే సాహిత్యమే పాఠకులకు ఆసక్తి కలిగించే విధంగా చదివించ గలుగు తుంది. తెలుగులో వెలుగు చూసిన విజ్ఞాన శాస్త్ర కాల్పనిక కథలలో ఎక్కువభాగం పాశ్చాత్య కథా సాహిత్యాన్ని అనసరించి వచ్చినవే.

పాశ్చాత్య దేశాలలో వలె తెలుగులో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం విజయవంతంగా వెలువడకపోవడానికి నిరక్షరాస్యత ఎక్కువగా ఉండటం ప్రధాన కారణం కాగా మన పాఠకులలో చాలామందికి సైన్సు పట్ల ప్రాథమిక స్థాయి అవగాహన లేకపోవడం కూడా మరో ముఖ్య కారణమని చెప్పవచ్చు.

అభివృద్ధి చెందుతున్న మన దేశంలో విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యాభివృద్ధికై ఎంతో కృషి చేయవలసిన అవసరం ఉంది. భారతదేశ సాంకేతిక ప్రగతిని, ప్రపంచ పారిశ్రామిక నాగరికతకు సమన్వయపరిచి రేపటి రోదసీ, జీవ సాంకేతిక సంస్కృతికి అంకురార్పణ జరిగే రచనలకు మన రచయితలు చేయాలి. పత్రికలు కూడా విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యాభివృద్ధికై కృషి చేయాలి. కేంద్ర సాహిత్య అకాడమీ కూడా ఈ సాహిత్యాన్ని ప్రోత్సహించాలి. ఈ దిశగా చర్యలు చేపడితేనే జాతీయ స్థాయిలో తెలుగు విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథ ఉన్నత స్థానాన్ని సంపాదించుకోగలదు.

విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథల పరమావధి కేవలం ఆనందం కాదు. ప్రపంచంలో శాస్త్ర సాంకేతిక రంగాలలో జరుగుతున్న నూతన ఆవిష్కరణలను గూర్చి, వాటి అభివృద్ధిని గూర్చిన విజ్ఞానికాంశాలను ఫిక్షన్‌తో జత చేసి పాఠకులకు అందించడం ముఖ్య లక్ష్యంగా ఉండాలి. విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథల ద్వారా నేటి బాలబాలికలకు సైన్సు పట్ల ఆసక్తిని, శాస్త్ర – సాంకేతిక రంగాల యందు జిజ్ఞాసను పెంపొందించ గలిగినపుడే మన దేశం వైజ్ఞానిక రంగంలో ఉన్నత శిఖరాలను అధిరోహించగలదు. ఇంతటి ఆవశ్యకత కలిగిన విజ్ఞానశాస్త్ర కాల్పనిక కథా సాహిత్యం నూతన శతాబ్దిలో మరిన్ని నవీన కల్పనలతో తెలుగు కథా సాహిత్యానికి సరికొత్త వెలుగును ప్రసాదించగలదని ఆశిద్దాం.

---

# అడవి అంటుకుంది / నీళ్ళు నిప్పులతో

**రేణుక అయోల**

తగలబడుతూ
పచ్చని అడవులు
కాలుతున్నాయి
కాలుతున్న అడవిలో
కుందేళ్ళ వేట

ఎన్నో వృక్షాలు
అటవి సంపదలు
వెలుగు చొరపడని
ఆకుపచ్చని పందిరి

ప్రతీ ఆకు ప్రతీ తీగె
పలుకరిస్తుంది
అడవిలో పోరు
చెట్లకి గాయాలు
తెగనరికిన కొయ్యలు
కదులుతున్న సైన్యం
పాదాల కింద
నలుగుతున్న
చీమలు
మూగబోయిన
కోయిలలు

ముగిసిన వేటలో
దొరికినవి
అమాయకపు కుందేళ్ళు
రక్తం వోడుతూ
ఆకలి పరుగులు
ఉరకలు
అడవిలో ఉంటూ
జనఘోష విన్నాయి
తల్లిని విడిచి
పారిపోయాక

ఇదీ రావడం
కడుపు కోత పెట్టి
మృతదేహాలై
చివికిన కాగితంలో
పేలికలు పేలికలుగా
కడలిలా పొంగిన శోకం
అడవి అంటుకుంది
అగ్గిలేకుండా
నీళ్ళు నిప్పులతో

# తాళ్ళను తెంపిండ్రు



నల్ల భూమయ్య

గా వూరు గప్పట్ల 'జిల్ల సదరు' గని, గిప్పట్ల గది 'తాలూక సదరు' అయ్యింది. మూడు తాలూకాలకు కలిపి పెద్దది. గక్కడ కంపిన్లు గిట్ట ఏం లెవ్వు గాబట్టి వూరు ఏం ఎదుగలేదు. పాత రోజులల్ల జిల్ల సదరుగ వున్నప్పుడు ఎట్లుండేటిది? గిప్పుడు గూడ గట్లనే వున్నది. గిప్పుడు గిప్పుడు సీన్న టాకీసు వెట్టిండ్రు...

సర్కారు బడి, దావుఖాన, కోర్టు, గప్పటి కాలం జెల్లు, సిన్న సిన్న ఓటళ్ళు, గంతకు తగ్గ అంగడి బజారు. గిప్పట్ల గోన్ని ప్రైవేట్ దావుఖాన్లు, బడులు గూడ అచ్చినై. పక్కకున్న కాలేర్ల మీద జూస్తె గీవూరు ఏం పేరు లేనిదే - పేరు పెద్దది, పెట్టెల్ల పోసాని అన్నట్టుగా - మూడు తాలూకాల మీద పెద్దది, వూరు సిన్నది. గప్పట్ల గిక్కడ కూరగాయలు గిట్ట బాగా అగ్గోకు దొరికేటియి - గీడ పెద్ద వాగు వున్నందున, సుట్టూత పల్లెలున్నందున. గని, గిప్పుడు గీడ గూడ 'మార్కెటింగ్ డిపాటు' పెట్టినందున అన్నిటిని గూడ మస్తు పిరెంజేసిండ్లు బేపారపోళ్ళు. పేరుకు ప్రజలది రాజ్యం, పెత్తందార్లదే బోజ్యం - సస్యశ్యామలదేశం, అయినా నిత్యం క్షామం - నదుల జీవ జలాలు, ఉప్పు సముద్రం పాలు - యువకుల శక్తికి భవితవ్యానికి లేనే లేదిట చోటు అన్నట్టుగానే అన్ని గూడ. గీడ కూరగాయలు గిట్ట పండిచ్చి అమ్ముకునేటోళ్ళు - గీవూర్లె గాకుంట దగ్గెరున్న కాలేర్లకు మరిగి ఎక్కో ధరలకు అమ్ముకునుడు జెయ్యవట్టి గిక్కడ అన్నీ పిరెమైనై, కాలేర్లకు తగ్గట్టుగ ధరలు గని, గిక్కడి మందికి గంతకు తగ్గ ఆముదానులు మట్టుకు ఏం లెవ్వు.

'శివయ్య' బతుకంత గూడ గీ వూర్లెనే. కంపిన్లు గిట్ట ఏం లేనందున బతుకుటానికి - జేస్తే ఏదన్న సిల్లెర బేపారం అసుంటిదే. శివయ్య గసుంటి పనులే జేసెటోడు. పొగాకు బేరమో, అంగట్ల అమ్ముకునుటానికి - సెక్కర బిళ్ళలు, మురుకులు, సకినాలు, గారెలు, బజ్జీలు, పేలాలుండలు, నువ్వులుండలు... ఇంట్ల పెండ్లాం, ఆడిపిల్లగండ్లు కల్సిగ వీటిని జేస్తె, శివయ్య ఆటిని నులుకమంచం మీద పర్సుకోని అమ్ముడు.

శివయ్య - తెల్లగ, అజానుబావుడు. పెండ్లాం గూడ తగ్గట్టుగనే, తెల్లటి ఆడది. అయ్య, అవ్వ వారం ఆడిపిల్ల గండ్లు - తెల్లగ, సుంగారంగ. మొగపిల్లగండ్లు ఆడిపిల్లగండ్లకన్న సిన్నోళ్ళు. ఇంక ఎవ్వరు సేతికందలేదు. గప్పట్ల ఆళ్ళ సదువులు గూడ గాపాటే - ఇంట్ల ఆముదాని వారం. శివయ్య యిద్దరు బిడ్డెల పెండ్లి జేసిండు. ఇగ ఒక్క 'సరోజిని' మట్టుకే పెండ్లికి మిగిలి వున్నది - ఆడిపిల్ల గండ్లల్ల.

ఎవని కెట్టులగునో ఎవ్వడెరుంగును? జరిగేది తెలియదు - అన్నట్టుగ శివయ్య రోగం, నొప్పి ఏం లేకుంటనే, మంచాల వడి సిక్కకుంటనె సడెల్న సచ్చిపోయిండు - పాముగర్సి. పైసలు లేక యింత, సముయానికి మందులందక యింత

అన్ని గల్సి శివయ్య పాణం దీసినై. పచ్చని తరువు పెనుగాలిపాలై కూలేదనుక తెలియదు అన్నట్టుగ. గివయ్య పెండ్లాం పిల్లల బతుకులల్ల కల్లోల పవనాలు చెలరేగునా, మనుగడ చీకటిమయమై పోయె అన్నట్టు అయ్యింది. గతుకుల్లల్ల బతుకు లోతు గొయ్యిల పడ్డది.

గిప్పుడు శివయ్య పెండ్లాం, సిన్నబిడ్డె, పిల్లగండ్లు అందరు బతుకుటానికి యిగ గదే దుకాణాన్ని జూసుకోవాలె అంగట్ల. తల్లి, బిడ్డలే జూసుకోవాలె. ఇంట్లగ వీటిని జేసుడు, అంగట్ల ఆటిని అమ్ముడు. తల్లి యింట్ల వున్నప్పుడు బిడ్డె, బిడ్డె యింట్ల వున్నప్పుడు తల్లి – అంగట్ల. ఇగ మొగపిల్లగండ్లు బడులు గిట్ల ఏం లేక అందరు గూడ దొరికిన పనులు జెయ్యాలె. అండ తొలగు నెడల అందరి పనియట్లె అన్నట్టుగ. దుకాండ్లల్ల జీతముండుడు గసుంటి పనులు. మొగపిల్లగండ్లు యింక సిన్నతనం యిడువక తిరిగెటోళ్ళు, వూర్లువట్టి తిరిగెటోళ్ళు. గసుంటప్పుడు యిగ యిల్లు నడ్సుడంతో గూడ ఆడోళ్ళ తోటే...

గిప్పుడు సరోజిని వైసు ఆడిది. శివయ్య బిడ్డెలు అందరు గూడ అందంగ వుంటరు గని గాళ్ళ అందర్ల గూడ సరోజిని యింకింత సుంగారంగ వుంటది. గాసుట్టు మట్టు గసుంటి ఆడిపిల్ల గండ్లు ఏడనో ఓదగ్గెర, నూట్లె ఒక్కలు – సాటిలేని పొలతి చక్కదనము. కుచోన్నతే కుంకుమరాగశోణే, నాసాగ్రేనవ మౌక్తికం – ఘుమఘుమ పూవులు సిగలోన, సొగసుల మోమును ముడుచుకుని – వడుచుదనం అందానికి తంబూలమెత్తింది – అడుగడుగున ఆడే లేనడుము సొంపులు, సడిసేయక పూరించే వయ్యారపు వంపులు – పరుగులు తీసే జవరాలి వయసు, పిలువక పిలిచి విరహాల రేపు – హిమగిరి సొగసులు – మనసు పడే మనోజ్ఞ సీమ. కన్నె మేను దాని కస్తూరి వాసనలు – వైసుదాని మేను వర్ణింపశక్యమే అన్నట్టుగ... వైసుల వున్న సరోజిని... తిరుగాడును తేనెటీగ తీయదనము గోరి... కరకంకణ నిక్వణాలు, పదనింకుర నిస్వనాలు!



మొగమనిషిలేని సంసారం. అబ్బయున్న వానికన్ని యున్నట్టులే అన్నారు. అబ్బలేని సరోజిని – యింట్ల వుండవలసిన వైసు ఆడిది – సరోజిని అంగట్ల. అంగడినంత సరోజిని జూత్తుంటది, సరోజినిని అంగడంతా జూత్తుంటది. ఈడు అచ్చినా పెండ్లిగాని వైసు ఆడిది. ఆడోళ్ళ మీద నడ్సుకస్తున్న సంసారం. బతుకుదేగోపాటి అంటె యిగ ఆడిపిల్ల పెండ్లి ఎట్ల? ధనము లేక యున్న ధైర్యంబు చిక్కదు...

ఒగనాడు సరోజిని కనపడకుండా పోయింది. వూర్లె తల్లి సరోజిని జాడ కోసం ఎతికింది, ఎతికిచ్చింది – సుట్టాల యిండ్లల్ల, తెల్సినోల్ల యిండ్లల్ల. గని, సరోజిని జాడ దొరుకలేదు. గా తరువాత కాలేర్లల్ల వున్న బిడ్డెల యిండ్లకు మనుషుల్ని పంపింది జాడ కోసం... గాడ గూడ సరోజిని పత్తా లేదు. కాలేర్ల వున్న సుట్టాల యిండ్లల్ల గిట్ల, తెల్సినోల్ల యిండ్లల్ల గూడ జాడలేదు. సరోజిని అక్కలు కాలేర్ల పరేషాను...గా తరువాత ఈళ్ళకు కవరందింది – సరోజిని జాడ తెల్సింది, వున్న వూర్లోనే వున్నదని. ఉన్న ఊర్లోనే వున్నదల్ల రెండు, మూడు రోజుల దనుక తల్లిని, అక్కలను అందర్ని గంత గానం పరేషాను జేసింది. గన్ని రోజులు ఎక్కడున్నది? ... గని, పరేషాను మట్టుకు తీరింది. గా తరువాత తెల్సింది అక్కలకు – సరోజిని అంగట్ల వున్న ఒక యింట్ల జాడ తెల్సింది అని. ఆ మబ్బు తెరలే వీడి ఆడింది చందమామ... ఏ మబ్బు తెరలలోన దాగుంది చందమామ?

సరోజిని జాడ 'వెంకటేశం' యింట్ల దొరికింది! వెంకటేశం యిల్లు అంగట్లనే వున్నది. సరోజిని దుకాణం పెట్టుకునే ఎనుకనే వెంకటేశం యిల్లు. వైసు, అందంగా వున్న సరోజిని – వెంకటేశం గూడ మంచిగుంటడు. వైసు పోరడు. ఒకరి చూపులొకరిపైన విరితావులు వీచగ – మొదట మూగినవి మొలక నవ్వులు, పిదప సాగినవి బెదురు చూపులు – వలపు కొలనులో కలకల విరిసిన కలువల కన్నుల కాంతివో – కలిగిన తలపులు వలపులు రేగ – కొనసాగిన కోరికలే మురిపించును వేడుకలై – పట్టరాని లేత వలపు పరవశించి పాడింది – పైట చెంగు రెపరెపలు పదపద లెమ్మన్నాయి. చనువై మనసై నెలరాయునితో కలువలు కులికే అందాలు – ఎన్నాళ్ళో వేచిన హృదయం – ఇన్నినాళ్ళ ఈ వలపులు వికసించుట యిందుకా – ప్రస్తుతంపు వేళ, తప్పియున్నగాని ఒప్పియుండు – మనసున మనసై, బ్రతుకున బ్రతుకై తోడొకరుండిన అదే భాగ్యము – నా తోడు నీవై వుంటే నీ నీడ నేనేనంటి – వెలసి నావు నాలో నే కలిసిపోదు నీలో – విరజాజి తీగసుంత, ఒరిగింది మావి చెంత – వెదికే పెదవులతో, తొణికే మధువులతో, కలిగిన తాపమంత కౌగిలిలో తీరెలె – మిసమిసలాడే నుదుటి కుంకుమ చిరు చెమటలలో కరుగుటకా – నీ కడ సురలోక భోగాలే – నింగిలోని అందాలన్ని ముంగిటలోనే నిల్చిన రోజు – కొంగుముడి వేసుకుని కొత్త దంపతులు...

సరోజిని, వెంకటేశం కులాలు ఏరేరే. ఒక్క కులపోనితోటి సరోజిని పెండ్లే గాకుంట పోయి వుండేటిదా గోంత ఆల్సెం అయ్యినా గూడ, గని సరోజిని, వెంకటేశంనే మనసుపడ్డది. వెంకటేశం సరోజినినే మనసుపడ్డడు. గువ్వలైన ఆ కోరికలే గూటిలోన చేరిన రోజు. ప్రాప్తమున్న తీరానికి పడవ సాగిపోయింది – ఈ తనువే మనకిక చెరి సగము అని.

'కులం సెడిన' బిడ్డె మూలంగా తల్లి ఏడ్పులు, ఆడ్పులు – పొల్ల గిట్ల చేసినందుకు, కులపోల్లు, లోకులు అంటున్నందుకు 'అయ్యో, ఎంత పనాయె' అని తల్లిని జూసి పొయ్యేటందుకు అచ్చిపొయ్యే సుట్టాలు. శివయ్య పెండ్లాం సూసుటానికి అచ్చిన పెద్ద బిడ్డె అత్త తోటి సెప్పవట్టింది. "అగ జూడు వదినా, అందరు నన్ను కాకులవారం పొడుస్తుండ్రు. ఆడి పోరికి పెండ్లి జెయ్య సేతగాక, తప్పిచ్చుకునుటానికి అవ్వే సెప్పి వుంటది బిడ్డెకు – దొరికినోన్ని పట్టుకొని పొమ్మని. గందుకే

## సవరణ

గత సంచిక కొన్ని ప్రతులలో 'గమనం' కథా రచయిత పేరు దస్తగిరి అని తప్పుగా ప్రచురించబడింది. రచయిత పేరు **ఎస్. శ్రీదేవి**గా సవరించుకోగలరు.

పోరి గట్ల జేసింది. లేకుంటే పోరి గింతకు తెగిస్తదా? అని నామీద నిందలేస్త్రంద్రు. ఆడి పోసుకుంటున్నరు. స్త్రీల నడత వలన సిగ్గుబోయె అంటున్నరు. బయటనింటి సిగ్గు బండ సంసారంబు అన్నట్టుగా కులపోల్లు, పూరోళ్ళు ఒకవేపు పూర్రూతలూగుతూ కథనాలు, ఒకవేపు పురికించు యుద్ధభేరీలు అన్నట్టుగ వున్నరు.

వియ్యపురాలు అన్నది "గయన్ని నువ్వేం యినకు వదినా... యిననట్టుగా వుండు. వాదులాడువారు వర్ణింపలేరయా అన్నట్టుగా గీ పూరోళ్ళు. కన్నతల్లి ఎవతన్న బిడ్డెకు గట్ల జెప్పుతదా? కాకులు కావు కావు మని నోరు నొచ్చేదనుక వొర్రి వంక ఆడి దవుదలే దగ్గర పడుతై. నువ్వేం బెంగ పెట్టుకోకు. తాతెగించు వాడెదండి యీ భువిలోన. పిల్లగండ్లు గీ పూర్లెనే వుంటె, పూరోళ్ళ కండ్లల్ల కన్పిస్తంటె కాకులు నిన్ను పొడుస్తనే వుంటయి. గిది పల్లెటూరు అసుంటిది. గిక్కడోళ్ళకు గిసుంటియే గావాలె. గంతకన్న పనేం వుండద్దు. గందుకని పిల్లగండ్లు పూరి కంట్లె వుండద్దు. మా యింటి దగ్గర వుంచుకుంటం. గక్కడ కంపిన్లు, కాలేరు, గక్కడ బతుకుతరు. గక్కడ గింత గానం వుండది మనుషులల్ల. వైసు పోరగండ్లు, మనుసులు కలువవచ్చు. గిట్ల జేస్తె జేసి వుంటరు, ఆళ్ళ బతుకులు ఆళ్ళయి, ఎవరి బతుకులు గాళ్ళయి అనుకుంటరు గని దూరం గొట్టరు. బుడుమ కాయ చేదు ముదిమిన తీపగు...." అన్నది వియ్యపురాలు.

వియ్యపురాలు దెప్పి పొడుస్తదేమో అనుకున్నదల్ల వుల్టా గింత సల్లటి మాటలు జెప్పేటప్పటికి శివయ్య పెండ్లానికి నిండ బలం, సంబురం ముసిరినై. వియ్యపురాలు సరోజిని – వెంకటేశంను ఆళ్ళ యింటి దగ్గర్లోనే వుంచుకోని ఆళ్ళకు అవుసురాలకు ఆసరపడ్డరు. అక్కడ సరోజినికి అక్క, బావ, అక్క అత్తమామలు, సుట్టుముట్టోళ్ళు అంతగూడ సరోజినిని మంచిగనే జూసిండ్లు. ఆళ్ళండ్ల గల్సుకున్నరు. సరోజిని మందిల గల్సి పొయ్యింది అందరాడోళ్ళ వారమే.

సరోజిని, వెంకటేశం పెద్ద పెద్ద సదువులు సదువుకోనున్న గూడ మనసులు గల్సినందున ఆళ్ళు గూడ కల్సి పొయ్యింద్రు. కులం కట్టుబాట్ల మొద్దు మొద్దు తాళ్ళను తెంపేసుకొని, సిన్న సదువులకు మిన్న జ్ఞానమురాదు అన్న దాన్ని సరోజిని వుల్ట చేసి సూపింది. గుణము మేలుగాని కులమేమి మేలురా అనుకున్నది. ఒజ్జతోడ వాదులాడనరంగ మానరా అనుకున్నది లోకుల విషయంల. బెదురలేదు, జంకలేదు. తొణకలేదు, బెణకలేదు. సరోజిని సూపులకే సుంగారమైంది కాదు, మనసు కూడా సిక్కటిదే...

---

# స్వప్నం

**కెంగార మోహన్**



వాస్తవ సంద్రంలోంచి వచ్చిన
స్వప్నం కలకలం రేపుతుంది
నిత్యం తెలియని ఊహల్లోకి
నెడుతూనే వుంది
ఎన్నో భావాల కలబోతల్ని
వడబోసి చూపెడుతుంది
ఒక్కోసారి అనుభూతుల్ని
ఆలింగనం చేసినట్లనిపిస్తుంది
గాఢనిద్రలోనూ
ఉగ్రవాదుల ఉన్మాదచేష్టలు
ఉలికిపాటుకు గురిచేస్తాయి
మతం మత్తులో మతోన్మాదుల
మారణహోమాలు కలవరపెడ్తున్నాయి
ఉవ్వెత్తున ఎగసిపడుతున్న
కడలి కెరటాలు కన్నీటి సునామీలను
సృష్టిస్తున్నాయి
ఎండిన వాగుల్లోని
యిసక రేణువులు
వర్షించు మేఘం కోసం
ఆర్తిగా ఎదురు చూస్తున్నాయి
కళ్ళు తెరిస్తే
కన్నీటి దృశ్యాలు కనిపిస్తున్నాయి
కనుపాపలకు సైబర్ పొర
కప్పినట్లుంటుంది
మన స్వంతమనుకున్న అన్నింటినీ
మానవత్వాన్ని మంటగలిపే
బహుళజాతి భూతాలు
సొంతం చేసుకున్నాయి
మిగిలింది స్వప్నం మాత్రమే

---

# కలలు కనడం ఒక వీరకృత్యం

**అల**



కలలు సాకారం కాదానికి
ఎంత కలత పడాలి
గుండె సాగరమై
ఎన్ని కల్లోలాలు చెలరేగాలి
కలలు కనడం
ఇక్కడొక వీరకృత్యం
కలలు కనడం
ఇప్పుడొక సాహస చర్య
కలల చివుళ్ళను చిదిమేస్తే
ఏమ్మిగులుతుంది?
ఏమీ చెయ్యలేని చేతగానితనం మీద
చీదరించుకోవడం మినహా
నిష్క్రియా, నిశ్శబ్దాల్ని
నిందించుకోవడం మినహా
గత సౌభాగ్య, సౌరభ ఊహ ఉరవడిలో
పుడకలమై కొట్టుకుపోవడం మినహా
ఏమ్మిగులుతుంది?
సిద్ధాంతాల సెలయేళ్ళను పక్కకు నెట్టి
ఆశయ తేజోపుంజాల్ని కిందకు దులిపి
చెత్తబుట్టలపై మిగలడం మినహా
దుర్గంధ మురికి కాల్వలమై
నెట్టుకుపోవడం మినహా
ఏమ్మిగులుతుంది?
నిర్భయుడే కలలు కంటాడు
శ్వాస పీల్చుకున్నంత సహజంగా
దాహం పుచ్చుకున్నంత సులువుగా
కాళ్ళకు గజ్జలు కట్టి
భుజాన గొంగడి వేసి
గొంతెత్తి చిందెయ్యడమూ కలే
బాధల గుదిబండల్ని దిగమింగి
బతుకు దారిలో చైతన్యం నింపుకొని
జన సమీరాల్ని సమీకరించి
తుఫానై రూపెత్తడమూ కలే
స్వేచ్ఛాయుద్ధమో
న్యాయపోరాటమో
అక్టోబర్ తిరుగుబాటో
మహోగ్ర లాంగ్ మార్చో
అన్నీ కలలే!
సాకార కల్లోల సాగరాలే

# స్వేచ్ఛా ప్రతిమ



గేరా

అట్లాంటిక్ జలాల మధ్య
ఆకాశాన్నంటుతూ,
అద్భుతంగా,
ఆర్భాటంగా
అం...తెత్తు ఆడ విగ్రహం!
ఓహ్!
ఎంత సౌందర్యం!
ఏమి గాంభీర్యం!
చీకటి దిక్కు దేశాలకన్నింటా
వెలుగు నింపడానికన్నట్టు
కుడిచేతితో ఎత్తిపట్టుకున్న కాగడా
నిజానికి,
చీకటి ఖండంలోని
చిన్నాచితకా రాజ్యాలన్నిటినీ
కాల్చి బూడిద చేసింది
ఉదయ సూర్యునిలా ఎదిగి వస్తున్న
తూర్పు దేశాలెన్నింటినో
మాడ్చి మసిచేసింది
పరమ పవిత్ర గ్రంథాలన్నట్టు
ఎడమచేత పొదివి పట్టుకొన్న
రాతి పలకల్లోని చరణాలు
ఆచరణలో
ప్రజాస్వామ్యవాదుల్ని
ప్రగతి కాముకుల్ని
ఉరికంబమెక్కించడానికి
ఊచకోత కోయడానికి
అందంగా పొందుపరచిన
పన్నాగాలే!
ప్రపంచానికంతటికీ
తానే మహారాణినన్నట్లు
తలపై ధరించిన మెరుపుల మకుటం
వాస్తవానికి
తన పెత్తనాన్ని కాదన్న ప్రభుత్వాలపై
కత్తులు దూసి, నెత్తురు పారించి
తన దోపిడీని అడ్డుకున్న దేశాల్ని
కూలగొట్టి, కొల్లగొట్టి
కోటి పాపాలను తలకెత్తుకున్న
కసాయి కిరీటం
ఇక
దేహానికి చుట్టుకొన్న ధవళవస్త్రం
స్వేచ్ఛకు, స్వచ్ఛతకూ సంకేతం కానేకాదు
అది
ఒల్లంతా నిండిపోయి
పొరలు పొరలుగా పైకి పొంగిన
తెల్లవారి దురహంకారపు కొవ్వు!
ఎప్పటికైనా
శ్వేతేతర సమాజాలన్నింటిపైనా
శాశ్వతంగా కప్పాలనుకొంటున్న
కఫన్!
ఇది ముమ్మాటికీ
స్వేచ్ఛా సౌభ్రాతృత్వాలకు
ప్రతీకగా నిలిపిన దేవతగాదు
సామ్రాజ్యవాద రక్తపిసాసను
ప్రతిబింబిస్తున్న దయ్యం!
జక్కనాచార్యుణ్ణి తలపిస్తూ
విగ్రహాన్ని చెక్కిన ఓ మహాశిల్పి,
క్షమించు!
ఉద్దేశాలకు విరుద్ధంగా
వాస్తవాలెదురైనప్పుడు
విలువలన్నీ వికటించి
విషం కక్కుతున్నప్పుడు
విధ్వంసమైపోయేది
ఒక్క వాణిజ్య సౌధాలే అనుకోకు
వెయ్యడుగుల విగ్రహాలైనా
వెయ్యిన్నొక్క సామ్రాజ్యవాద
సింహాలైనా
సింహాసనాలైనా...

---

# మిర్చీ బజ్జీ



జయంపు కృష్ణ

పట్టెడు బియ్యము కొనుటకు
పుట్టెడు అడ్డంకులాయె పూటకు పూట
తుట్టమారా లేవు నూకలు
నిట్టాడికి మీసమొచ్చె నిజము జయంపు!

చక్కెర బొక్కెడు లేదు
ఉక్కిరి రుచి మారిపోయె ఉల్టా సీదా
ఉక్కిరి బిక్కిరి అయితిమి
దిక్కెవ్వరు యిపుడు నీకు నిజము జయింపు!

జొన్నలు, సజ్జలు దొరకవు
గిన్నెలో సద్దెన్నమేదీ కడుపుకు నిండా?
పన్నులు మాత్రం బోలెడు
వెన్నిరిగెను బీద ప్రజకు నిజము జయింపు!

అల్లము బెల్లము జీలకర్ర
చిల్లర సామాను జనుల చేతికి అందదు,
కల్లయితే లేదు కొరత
తెల్లారెను బతుకు బాట నిజము జయింపు!

వంకాయ తోటి వంటలు
బింకముగా పరుగులెత్తె జింకలలాగున్
టెంకాయ కూడ ప్రియమే
జంకాయెను ధరలు చూస్తె
నిజము జయింపు!

బొగ్గులు కూడా దొరకవు
గగ్గోలుర వంటకాలు యింటింట యికన్,
ముగ్గులకు కరువు ముంగిట
సిగ్గాయెను తలచుకుంటె వింటె
నిజము జయింపు!

గుడ్డూ బ్రెడ్డూ లడ్డూ
తెడ్డిరిగెను తిరిగి చూడ నేటికి నేడు,
వడ్డేయిక అసలు మొదలు
చెడ్డీలు కూడా మిగలవిక నిజము జయింపు!

మద్యానికి కొదవలేదుర
హద్దులు దాటింది నేర ప్రవృత్తిలో ప్రజ,
సుద్దులు నేతల నోట ప్ర
బుద్దుల పాలాయె ధనము నిజము జయింపు!

పొగిడిరి ఓట్లకు నేతలు
ఎగిరెగిరిరి మాటలతో మంత్రము వేసి
దిగిపోయెను కైపు యిప్పుడు
సగమైతిమి దిగులుతోటి నిజము జయింపు!

అల్లిబొల్లి కబుర్లు చెప్పి
ముల్లును గుచ్చారు ఎదన నోటిని మూసి,
ఇల్లిల్లూ పస్తు పెట్టిరి
పిల్లిని పొయిలోకి పంపి నిజము జయింపు!

(జయంపు కృష్ణ శతకంలోంచి)

# ఒక ప్రయత్నం... ఒక అనుభవం "నెల్లూరుజిల్లా పిల్లోళ్ళ కతలు"



వీటిని కొంచెం పరిశీలిద్దామని జనవిజ్ఞాన వేదిక నెల్లూరుజిల్లాలో గత జనవరి – ఫిబ్రవరి నెలల్లో ఓ ప్రయత్నం చేసింది. మూడు నుంచి ఏడో తరగతి లోపు పిల్లలు తమ తాతల్నీ, అవ్వల్నీ అడిగి చెప్పించు కొని ఒక మంచి కథ రాయాలి. అదేమీ స్వంత రచన కాదు. పాత కథే. దీన్ని స్కూల్లో నిర్ణయించిన రోజున రాయాలి. స్వంత భాషలో రాయాలి. ఎన్ని తప్పులతోనైనా సరే. దీన్ని టీచర్లు పోటీ కింద లెక్కేసి "క్లవర్ల" చేత కంఠస్తం చేయించి, మన పాఠ్య గ్రంథాల మూసబోసిన రాతలో రాయించే ప్రయత్నం చేయ కూడదు. ఒక అవగాహన ఈ మేరకు కల్పించి టీచర్లకూ, పిల్లలకూ ఓ పిలుపునిచ్చాం. ఆశ్చర్యం. రెండు నిర్ణీత దినాల్లో అక్షరాలా పదివేల ఆరువందల డెబ్భై రెండు కథలు వచ్చాయి.

**వి. బాలసుబ్రమణ్యం**

పిల్లల్లేని కథల్లేవు. కథల్లేని పిల్లల్లేరు. కథలూ – పిల్లలూ లేని సాహిత్య ప్రపంచమూ లేదు. ఇది మనందరికీ తెలిసిన విషయం.

మనమిప్పుడు ప్రపంచం కుగ్రామమై పోయిందనుకొనే యుగంలో వున్నాము. టి.వి.లు వచ్చాక పిల్లలకి కథలు చెప్పే తీరికే మనకి లేకపోయింది. కార్టూన్ కథలే పిల్లలకి అందుబాటులో వుండేది. ఇంగ్లీషు మీడియం మన స్కూళ్ళలోకి జొరబడి తిష్టవేశాక తెలుగులో పిల్లల పుస్తకాలకు కరువెక్కువైంది. బడిలో కథలు చెప్పటం, చదివించటం కనుమరుగైంది.

ఇన్ని పరిణామాలు ఇంత వేగంగా ముసురుకొస్తున్న తరుణంలో మన గ్రామీణ పిల్లల కథా ప్రపంచం ఎలా ఉంది? వారి స్వప్న లోకాల రూపురేఖలెలా వున్నాయి? వస్తువులో, దృక్పథంలో వచ్చిన మార్పులేమిటి? అసలు మన పిల్లలివుడు ఎలాంటి కథలు వింటున్నారు? ఎలాంటి కథలు చదువు తున్నారు? ఎలాంటి కథలు ఇష్టపడుతున్నారు? మరి మన పిల్లలు ఈ కథల్ని రాయడానికి పూనుకొంటే ఎలా రాస్తారు? వాళ్ళ స్వంత భాష ఎలా వుంటుంది? అక్షరాభ్యాసం నుంచి ఐఐటి విద్య దాకా గుడ్డి కంఠస్తాలే అసలు సిసలు చదువులుగా చెలామణీ అవుతున్న ఈ కాలంలో పిల్లలు తమ కాల్పనిక జగత్తుకు అక్షరరూపం కూడా ఇవ్వగలరా? ఇస్తే ఆ భాష నుంచి మనం పెద్దలం, రచయితలం నేర్చుకోవలసింది ఏమైనా వుంటుందా?

వీటిని కొంచెం పరిశీలిద్దామని జనవిజ్ఞానవేదిక నెల్లూరుజిల్లాలో గత జనవరి – ఫిబ్రవరి నెలల్లో ఓ ప్రయత్నం చేసింది.

మూడు నుంచి ఏడో తరగతి లోపు పిల్లలు తమ తాతల్నీ, అవ్వల్నీ అడిగి చెప్పించు కొని ఒక మంచి కథ రాయాలి. అదేమీ స్వంత రచన కాదు. పాత కథే. దీన్ని స్కూల్లో నిర్ణయించిన రోజున రాయాలి. స్వంత భాషలో రాయాలి. ఎన్ని తప్పులతోనైనా సరే. దీన్ని టీచర్లు పోటీ కింద లెక్కేసి "క్లవర్ల" చేత కంఠస్తం చేయించి, మన పాఠ్య గ్రంథాల మూసబోసిన రాతలో రాయించే ప్రయత్నం చేయ కూడదు. ఒక అవగాహన ఈ మేరకు కల్పించి టీచర్లకూ, పిల్లలకూ ఓ పిలుపునిచ్చాం.

ఆశ్చర్యం. రెండు నిర్ణీత దినాల్లో అక్షరాలా పదివేల ఆరువందల డెబ్భై రెండు కథలు వచ్చాయి. వాటిని ఎలా చదవాలి? ఎలా పరిశీలన జరపాలి అనే ప్రశ్న అప్పుడొచ్చి పడింది. ఓ నెలరోజుల్లో 15 మంది టీచర్లు ఈ పనిని ఓ కొలిక్కి తెచ్చారు.

చాలా చిన్న పిల్లలు (3-4 తరగతులు) వచ్చీ రాని భాషలో రాసిన కథలు ఒక భాగం. ఆపై పిల్లలు కొంత అవగాహనతో రాసిన మరొక భాగం చేశాము. రెండింటా వున్న హృదయాన్ని పట్టుకొనే ప్రయత్నం చేశాము.

వచ్చినవన్నీ 99 శాతం గ్రామీణ పేదపిల్లలున్న ప్రభుత్వ స్కూళ్ళ పిల్లలకే. దీనికి జనవిజ్ఞాన వేదికకు ప్రైవేట్ స్కూళ్ళలో గల పరిచయం తక్కువ గావడం ఒక కారణం కావచ్చు. కానీ అంతకన్నా ముఖ్యమైన కారణం అక్కడి పిల్లల భాషా దారిద్ర్యం. కానీ అసలు కారణం కథల్నించి, కల్పనా ప్రపంచం నుంచి, స్వంత ప్రయత్నాల నుంచి, స్వేచ్ఛ నుంచి వీలున్నంత దూరం చేసి ప్రశ్నోత్తరాల్ని నూరి పోయడాన్నే విద్యగా ఈ స్కూళ్ళు నిర్వచించు కోవడం. ఇది మన విద్యా విధానంలోని లోపం.

వస్తువును పరిశీలిస్తే దాదాపు అన్నీ పాత కథలే. అవే నక్కలు, అవే దయ్యాలు, అవే నాగరాజులు, అవే రాజులు, అవే రాయిలు. అదే పేదరాశి పెద్దమ్మలు, అదే గుడ్డిపోలి. ఎన్ని నవ నాగరికతా వాసన లొచ్చినా, ఎన్ని సినిమాలూ, సీరియళ్ళూ వచ్చినా, పిసరంత మార్పు సైతం పిల్లల కథల్లో రాక పోవడమేమిటి? అని మనం ఆశ్చర్య పోతాం. తరతరాల తెలుగు పిల్లల కథలు అంత బలమైనవి, అంత సన్నిహిత మైనవీ అన్న మాట. పిల్లల స్వాప్నిక జగత్తులోకి మన ఆషామాషీ వ్యవహారాలు అంత సులభంగా జొరబడలేవన్న మాట. వాళ్ళ లోకం అంత అమలినంగా వుండిపోయిందన్న మాట. అసలు వాళ్ళ ప్రపంచం వాళ్ళ ప్రపంచమే. అందులో పిల్లలది స్వంతం ఏదో ఉంది. అసలు పిల్లలందరూ ఒకటే. వారిలో ఏదో అద్భుతమైన సమానత్వం ఉంది. సమానత్వం వాళ్ళ కాల్పనిక జగత్తులో కన్పిస్తుంది.

ఇక పాత్రలన్నీ సాదా సీదా పాత్రలు. అది నక్కగావచ్చు, నాగేంద్రుడు కావచ్చు, రాజు గావచ్చు. పశువులు మేయడం, కళ్ళాపి చల్లడం, పెళ్ళి సంబంధాలు వెతకడం, అమాంతం బోల్తా పడిపోవడం, మనం చూస్తాం, చాలా చిన్న ప్రాణులు చాలా పెద్ద వాళ్ళకి సాయం చేస్తాయి. అపాయాలు చాలా సామాన్యంగా ఉంటాయి. పెళ్ళి సంబంధాలు

వెతికిపెట్టడం, శత్రువును పల్టీ కొట్టించి ప్రమాదం నుంచి బయటెయ్యడం కంటే మించిన సాయాలుండవు. కూతుళ్ళ పెళ్ళిళ్ళది సమస్యే కాదు. మహా మహరాజులు నక్కలకి పిల్లనిచ్చేస్తారు. అల్లుళ్ళు కట్నాలకు వేధించే దుర్మార్గులుండరు. అమాయకులు, అడిగిందే తడవుగా సాయం చేసేవాళ్ళు వుంటారు. ఆడపిల్లలు అమాయకంగా ఉండరు. చమత్కారులుగా వుంటారు. సవతి పోర్లు చాలా ఎక్కువ. అడవులకి తరిమెయ్యడం, బిడ్డల్ని దాచిపెట్టెయ్యడం, వాళ్ళని పేదోళ్ళకిచ్చి పెళ్ళి చేసెయ్యడం లాంటివి పెద్ద భార్యల నిత్యకృత్యాలు. ఒక్కోసారి కథలు పెద్ద చిక్కుముడి వాలు పడిపోతుంది. అప్పుడల్లా శివపార్వతులు ఆకాశాన పోతుండాల్సిందే. పార్వతి బాధపడాల్సిందే. శివుడు మంచి మొగుళ్ళా వప్పుకోవలసిందే. ఏదో పరిష్కారం చెయ్యాల్సిందే.

అన్నీ మనకొచ్చే సమస్యలే. పరిష్కారాలు మనముందు కన్పించేవే. రాజులు కొడుకులు కూడా ఊరేగింపులో తప్పిపోతారు. మహరాజులు కూడా పొలం దున్నేపుడు సద్దిమూట కోసం ఎదురు చూస్తుంటారు. నాగేంద్రుడు కూడా ఆడపడుచుకు గాజులు పెట్టించడం కోసం లోకాలన్నీ వెతుకుతాడు. అల్లుళ్ళైతే తిక్క మొహాల వాళ్ళు. కోరి కష్టాలు తెచ్చుకుంటారు. వాళ్ళ భార్యలే వాళ్ళనెలాగో బయటవేస్తారు. దేవలోకాలు వుంటాయి గానీ అవి నక్క అరుపులకే గడగడలాడిపోతాయి. దయ్యాలైతే ఆవులు మేపి, రాజు కుమార్తెల్ని వెతికి పెట్టి, మనుష్యుల కోసం నానా కష్టాలు పడతాయి. సూర్యచంద్రుల క్కూడా మామూలు అన్నదమ్ముల కొట్లాటలు తప్పవు. జనం దగ్గర పరువు పొయ్యాక ఒళ్ళు దగ్గరపెట్టుకోక తప్పదు. ఎవ్వరికీ పెద్ద పెద్ద ఆశలుండవు. ఏదైనా వుంటే అది మంచిపిల్ల కావాలని కోరుకోవడమే. మహా మహా దేవుళ్ళిచ్చిన వరాల భవంతుల్లో ''అన్నం, కూరలు, కారప్పూస, గిన్నెలు, మంచాలు'' అన్నీ వుంటాయి. ఈ ''అన్నీ'' అంతకుమించిన కోరికలే వుండవు! మహారాణి పేరు కూడా రమణమ్మే, ఆమె కూడా కళ్ళాపి చల్లాల్సిందే. సద్ది కూడు తీసుకెళ్ళాల్సిందే. జలదారి గుంటకాడ, పశువుల కొట్టం కాడ, పేడ దిబ్బల కాడ తిరగాల్సిందే.

మహాద్భుతాలు జరుగుతాయి.


— — — — — * * * — — — — —

**లోకాతీత నీతులు, త్యాగాలు, ధర్మాలు ఈ కథల్లో మనక్కనిపించవు. పిల్లలు ప్రపంచాన్ని నిశితంగా గమనిస్తారు. అందులో బీభత్సాన్ని, కుళ్ళును కూడా వీళ్ళు అర్థం చేసుకొంటారు. మనం ఎంత దూరంగా పెట్టదల్చుకున్నా పిల్లలు వీటికేమీ దూరంగా వుండరు.**

— — — — — * * * — — — — —


అతీత శక్తులు, వస్తువులూ వుంటాయి. కానీ అవి చేసేదల్లా అన్నం కూరా ఎంత కావలస్తే అంత ఇవ్వడం, నీళ్ళ బానలు నీళ్ళు తగ్గకుండా చూడ్డం. మోసం చేసిన వాళ్ళ వీపుల మీద గుద్దడం అంతవరకే.

ఈ కథలు ఇంతకాలం ఇంత భద్రంగా మనడానికి ఈ స్వభావమే అసలు సిసలు కారణం. ఒక్కటీ జీవితాన్ని దాటిపోవు. ఏదీ మన చుట్టూ ప్రపంచాన్ని మించిపోదు. ఎంత తలతిరిగిన వారైనా సాదా సీదా గ్రామీణ పేద జీవితంలో ఒదిగి పోతారు. అందువల్లే పిల్లలు వాళ్ళకి అతుక్కుపోతున్నారు.

ఈ కథల్లో ముస్లిం పిల్లల కథలు దాదాపు 16 శాతం. అందులోనూ అమ్మాయిల కథలెక్కువ. వాళ్ళ కథలూ ఇవే. ఒక్కటంటే ఒక్క కథయినా మిగిలిన పిల్లల కథల కంటే భిన్నంగా వుంటే ఒట్టు. "ముస్లింలు జాతీయ సంస్కృతిలో కలసిపోవాలి" అని గొంతు చించుకొనే వారికిది కళ్ళు తెరిపించే అంశం. లేత పిల్లల ఊహల్లో కులమతాలు లేవు. కులాలు లేవు. అంతరాలు అంతకన్నా లేవు.

లోకాతీత నీతులు, త్యాగాలు, ధర్మాలు ఈ కథల్లో మనక్కనిపించవు. పిల్లలు ప్రపంచాన్ని నిశితంగా గమనిస్తారు. అందులో బీభత్సాన్ని, కుళ్ళును కూడా వీళ్ళు అర్థం చేసుకొంటారు. మనం ఎంత దూరంగా పెట్టదల్చుకున్నా పిల్లలు వీటికేమీ దూరంగా వుండరు. వాళ్ళు కల్లాకపటం లేని వాళ్ళే గానీ కల్లా కపటపు ప్రపంచం మాత్రం వారికి చాలా నగ్న వాస్తవం. దొంగతనాలు మామూలే. మోసాలు మామూలే. కుట్రలు, కుతంత్రాలు మామూలే. అయితే వీటిని ఎదుర్కోవడానికి కూడా ఇవే పద్ధతులు, అంతా మామూలు! ఇందులో ఏ తప్పు వాళ్ళకి కన్పించదు. కానీ ఎత్తుకు పై ఎత్తులుగా ఇవి ఏళ్ళ తరబడి సాగవు. ఒక్క ఎదురుదెబ్బతోనే బుద్ధి తెచ్చుకోవటం జరిగిపోతుంది. ఇది మానవ ఆకాంక్ష. అందరూ మంచిగా వుండాలనే సహజ కాంక్ష. ఇదే నిష్కల్మషంగా అడుగడుగునా మనకీ కథల్లో కన్పిస్తుంది.

ఇక కథన శైలి, పిల్లలది అద్భుతమైన సంభాషణ శైలి, కథన పద్ధతి (Navvation) చాలా తక్కువ. కొన్ని కథలైతే వాక్యాల చివర వున్న 'అన్నాడు'లాంటివి తీసేస్తే నాటికలుగా మారిపోతాయి! కథలు చెప్పడం పిల్లలకి ఎంతో సహజమైన భాషా నైపుణ్యాన్నిస్తుంది. ఎంత సన్నిహితులకు, ఎంత స్వేచ్ఛగా చెప్పే అవకాశముంటే అది అంత స్వచ్ఛంగా, సహజంగా వుంటుంది. ఇదంతా సంభాషణాత్మకంగా, ప్రశ్నల రూపంలో వుంటుంది. సరిగ్గా అదే పద్ధతి తొలి రచనల్లోనూ వచ్చేస్తుంది. పెద్దయ్యాక, మన వాచకాల భట్టీయం మొదలయ్యాక ప్రశ్న - జవాబుల కుస్తీలోకి దిగాక భాష పూర్తిగా మారిపోతుంది. కృతకాతి కృతకంగా తయారవుతుంది.

రెండోది వారి భాష. మనం అచ్చ తెలుగు కావ్యాల్ని చూశాం. అంత కృత్రిమ భాష ప్రపంచంలో ఎక్కడా వుండదు. మరి ఈ పిల్లల కథల్ని చూస్తే మచ్చుకైనా సంస్కృత పదం వెతికితే తప్ప దొరకదు. 'అమాయక చక్రవర్తి' అనే కథ వుంది. మౌనిక అనే 5వ తరగతి అమ్మాయి దీన్ని రాసింది. ఇది సుమారు 900 పదాలుండే పెద్ద కథ. అంతా వెతికితే ఇందులో పాతికకు మించి సంస్కృత పదాలు లేవు. రాత్రి, రాజ్యం, అన్నం, కాలం, నిజం, జనం, సమయంలాంటి పదాల్ని కూడా కలుపుకొన్నా పాతికకు మించి లేదన్న మాట! మనం 'వ్యతిరేకించారు' అంటారు. పిల్లలు 'కాదన్నారు' అంటారు. మనం 'గర్భం ధరించింది' అంటాం. వాళ్ళు 'కడుపొచ్చింది' అంటారు. రాజుగారైనా తన భార్యను 'పిల్లా! పిల్లా' అనే పిలుస్తారు. రాణిగారు కూడా 'అయ్యా', 'అబ్బా' అంటుంది మొగుణ్ణి. చాలామంది రాణులైతే 'మామా' అంటారు. ఓ కథలో రాజు రాణిని "పిల్లా పిల్లా ఈ తట్టుకి ఆ తట్టుకి కళ్ళాపి కొడుతున్నావు దేనికి" అంటాడు. ఎంత సరళ సుందర భాష! ఇక నెల్లూరు పిల్లలు కదా "మధ్యస్తం, గమ్మత్తుగా, గుంతకాడికి, మరిగిన్ని, దేగిశా, లగెత్తడం లాంటి మాండలికాలు, 'ఏందిమే?', 'ఊరుకో

అబ్బయ్యా', 'సాల్లే సంబడం' లాంటి యాసలు కావల్సినన్ని. గుడ్డి పోలి చాలా కథల్లో ప్రత్యక్షం. 'సీకాశొమ్ము' (ఒక పాత్ర) లాంటి అంతుబట్టని పదాలు అక్కడక్కడా తళుక్కుమని తంటాలు తెస్తాయి.

అట్లని శుద్ధ మాండలికం లేదు. ఒక సర్వ జనాంగీకృత వ్యావహారిక శైలి సర్వత్రా దర్శనమిస్తుంది.

ఈ భాష నుంచి, ఈ శైలి నుంచి బాలసాహిత్య రచయితలు నేర్చుకోవలసింది చాలా ఉంది. మన కావలసినంత బాల సాహిత్యం వుంది. కానీ అది దాదాపు పెద్దల భాషలోనే వుంది. 'సాహిత్య గౌరవం' కోసం మనమలా మర్చామా? బాల సాహిత్యానికి, బాలలకు దగ్గరగా వుండటం కంటె ఏ గౌరవం కావాలి? ఇలా రాయడం కష్టమని మనం మనం సొంత భాషనూ, శైలిని రుద్దుతున్నామా?

కొందరమ్మాయిలైతే చాంతాడంత కథలు రాశారు. అద్భుతంగా రెండు, మూడు కథల్ని కలిపేశారు. కొత్త ముగింపులిచ్చారు. ఆరవ తరగతి చెంగన లక్ష్మీ ప్రసన్న రాసిన 'కాళహస్తి రాకుమారుడు' వచ్చిన కథలన్నింటిలోకి పెద్ద కథ. 'ఇంత కథ ఎలా గుర్తుపెట్టుకొని రాశావమ్మా' అని అడిగితే 'మా తాత రోజూ సాయంత్రం నాకు కథలు చెపుతాడు సార్' అని బదులిచ్చింది. మన స్కూళ్ళు ఇలాంటి తాతయ్యల్ని చూసి ఏమైనా నేర్చుకుంటాయా? భాషా బోధనలో దీన్ని చూసి ఏమైనా మార్పులు వస్తాయా?

— — — — — * * * — — — — —

**ఈ భాష నుంచి, ఈ శైలి నుంచి బాలసాహిత్య రచయితలు నేర్చుకోవలసింది చాలా ఉంది. మన కావలసినంత బాల సాహిత్యం వుంది. కానీ అది దాదాపు పెద్దల భాషలోనే వుంది. 'సాహిత్య గౌరవం' కోసం మనమలా మర్చామా?**

— — — — — * * * — — — — —

విచిత్రమేమంటే పిల్లల కథల్లోకి ఇప్పుడు స్కూళ్ళు వచ్చి దూరుతున్నాయి. ఒక కథలో ఎలుగుబంటి పిల్లలు, కుందేలు పిల్లలూ కలిసి స్కూలు కెళతాయి. మరో కథలో అక్కా చెల్లెళ్ళు ఒకరికొకరు దూరమైపోతారు. వాళ్ళకు పెద్దయ్యాక పిల్లలు పుడతారు. ఆ పిల్లలు స్కూల్లో చేరి తగువులాడుకొంటారు. అప్పుడు వాళ్ళ అమ్మలు బడికొచ్చి ఏకమవుతారు. క్రమంగా పిల్లల హృదయాల్లో స్కూలు ఓ గొప్ప వ్యవస్థగా స్థానం సంపాదించుకొంటుందన్న మాట. నెల్లూరుజిల్లా గాబట్టి రొయ్యల, చేపల చెరువుల ప్రస్తావన కూడా కొన్ని కథల్లో ఉంది. కొన్ని కథలకు ముగింపులు విచిత్రంగా మారి పోయాయి. ఒకే కథ నాలుగైదు రూపాల్లో కన్పించడం చాలా ఎక్కువగా కన్పించిన ధోరణి.

వీటిని చాలా కోణాల్లో అధ్యయనం చేయాల్సి వుంది. ఇవన్నీ పిల్లల తొలి లిఖిత వ్యక్తీకరణలు. వీటి భాష, శైలి, వాక్య నిర్మాణం, వ్యాకరణం, యాస, దోషాలు, రచయితలు, భాషావేత్తలు, టీచర్లు, పాఠ్యగ్రంథ రచయితలు లోతుగా పరిశీలించాల్సిన అంశాలు. భాషా బోధనకే రచనలు కావల్సినంత సామాగ్రి నందిస్తాయి. పిల్లల భాష పట్ల, అసలు మొత్తం భాష పట్ల మన దృక్పథాన్నీ తారుమారు చేస్తాయి కూడా.

ఇందుకోసం వీటిలోని కొన్ని కథల్ని ఏరి ఒక సంకలనంగా "నెల్లూరు పిల్లోళ్ళ కతలు" పేర తెచ్చాం. ముద్రణ అన్న తర్వాత అందరూ చదివేలా వుండాలి. అందుకని అక్కడక్కడా సవరించక తప్పలేదు. పిల్లల భాష చెడకుండా, పెద్దగా జోక్యం చేసుకోకుండా ఈ పని చేశాం. ఒక నమూనాగా ఈ కథల్ని మనం తీసుకొని చర్చించవచ్చు. ఫొటోలతో, తల్లిదండ్రుల పేర్లతో సహా అచ్చులోకి ఎక్కడం, రచయితలుగా మారడం ఈ నిరుపేద గ్రామీణ పిల్లలకి ఊహకందని ఆనందాన్నిచ్చింది.

మరి మిగిలిన కథలన్నీ ఏం చెయ్యాలి? అందరికీ వాటి నెలా అందుబాటులోకి తేవాలి అనేది మాముందున్న ప్రశ్న. తెలుగు పిల్లల కథా ప్రపంచాన్ని ఒక "వెబ్‌సైట్"లోకి ఎక్కిస్తే ఎలా ఉంటుంది అనేది ఓ ఆలోచన. ఏది ఏమైనా ఈ చిన్ని ప్రయత్నం ఇచ్చిన అనుభవం మాత్రం మాటలకందనిది. మరపురానిది.




**వి.ఎస్.ఎన్. మూర్తి**

వసంతం వస్తే
ఆనందం పూవులకా
తుమ్మెదలకా..

పూదోట చుట్టూ
ముళ్ళకంచె వేశారు
తేటికదడ్డా

మావితోటలో
సాగుతోంది కచేరి
గానం కోయిల...

చంద్రోదయాన
వెన్నెల కవ్వించింది
కలువమ్మను...

పున్నమిరాత్రి
ఆకుల మీద నుండి
జార్తూ వెన్నెల...

మెట్ల పక్కన
పరిమళలు పూస్తూ
రేరాణి పొద...

చంద్రకిరణం
పూవుల పరిమళం
వెరసి ఆమె...

ఆమె తలలో
చేరామని కాబోలు
పూలకా గర్వం...

వెదురుగొట్టం
ఒడలంతా గాయాలే
శ్రావ్య రాగాలు...

వాయు సంగీతం
లీనమై వింటున్నాను
ఆకుల పాట...

చేతి రుమాలు
కన్నీటిని తుడుస్తూ
ఊరడించింది...

పూవుల బాధ
భ్రమరం కనలేదు
పూదేనె తప్ప....

# మానవత్వం



ఆకాశంలో ఓ పెద్ద ఉరుము ఉరమడంతో, ఎర్విన్ ఉలిక్కిపడ్డాడు. కదలకుండా తను ఉన్న రేకుల గదినంతా భయం భయంగా కలయజూశాడు. అక్కడ అతడు తప్ప మరెవరూ లేరు. బలంగా ఊపిరిపీల్చుకుని, నెమ్మదిగా వదిలాడు. సరిగ్గా, సూర్యోదయానికి ముందుగా - చలి, ఆకలి బాధిస్తుండగా, అతడికి ఆ గది కనిపించింది. అప్పటికి అతడు పూర్తిగా అలసిపోయాడు.

ఆంగ్ల మూలం : డాన్ స్టాకార్డ్

అనువాదం : కొల్లూరి సోమశంకర్

ఆ గదిలోని గడ్డి వల్ల కలిగిన వెచ్చదనం, అప్పటి వరకు తీసిన కునుకు అతడి చలిని, బడలికని కాస్త దూరం చేశాయి. అయితే అతడి ఆకలి మాత్రం తీరలేదు. ఆ పూట భోజనం లభిస్తుందన్న నమ్మకం కూడా లేదతనికి. పైగా తినడానికి ఏమైనా వెదుక్కోవడం అతడికి మరీ ప్రమాదం!

ఉత్తర అమెరికాకు త్వరగా చేరుకోవడమే ప్రస్తుతం అతడి ఏకైక లక్ష్యం. ఉత్తరాది సైనికులు బానిసలకు స్వేచ్ఛని ప్రసాదిస్తున్నారని ఇటువైపే వస్తున్నారని ఎర్విన్ విన్నాడు. గత మూడు రాత్రులుగా ఉత్తర రాష్ట్రాల వైపు ప్రయాణం చేస్తున్నా, నీలి దుస్తుల ఉత్తరాది సైనికుల జాడ లేదు. ఇంతలో మరో ఉరుము ఉరిమింది. దాంతో పాడు వర్షం కూడా మొదలైంది. తన ప్రయాణం కొనసాగించాలా లేక వాన వెలిసే వరకు ఇక్కడే ఆగాలా అనేది ఎర్విన్ తేల్చుకోలేకపోయాడు. ఇంతలో అతడికేవో మాటలు వినిపించాయి.

"ఇక్కడో గది ఉంది, గురువుగారు!" అని అంది ఓ గొంతు.

"అమ్మయ్య! తల దాచుకోవడానికి కాస్తంత చోటు దొరికింది...." గురువుగారి గొంతు పలికింది.

గది పక్కగా ఓ బండొచ్చి ఆగింది. ఆ చప్పుడు విని ఎర్విన్ గడ్డిలో దాక్కున్నాడు.

"వాన పెరుగుతోంది. తడిసిపోతాం..." అని లోపలికి వస్తున్న ఇద్దరు వ్యక్తులలో ఒకతను అన్నాడు. చూడటానికి ఆయన మత గురువుగా ఉన్నాడు.

"ఈ వాన వల్లే, ఉత్తరాది సైనికులు ఇటు రావడం ఆలస్యమవుతుందేమో?" అని అన్నాడు ఇంకో వ్యక్తి.

మత గురువు తన టోపీని తీసి గట్టిగా విదిలించి, దాన్ని అక్కడి గోడకు ఉన్న ఓ మేకుకి తగిలించాడు. బాగా పొడగరైన అతడికి సుమారు యాభై సంవత్సరాల వయసుండవచ్చు. అతడి సహచరుడు మాత్రం పొట్టిగా, లావుగా ఎర్రటి రంగులో ఉన్నాడు. అతడి గడ్డం ఇప్పుడిప్పుడే నెరుస్తోంది.

"ఆక్రమణదారులకి, మనకి మధ్య రక్షణగా మన దక్షిణాది సైనికులు ఉన్నారు. ఇక వాతావరణం నుంచి మనకు ఎటువంటి సాయమూ అక్కరలేదు..." చెప్పాడు మతగురువు.

"వాతావరణం మనకి హాని చేయదు" అన్నాడు పొట్టి వ్యక్తి.

"నేను అదే అనుకుంటున్నాను" అని అన్నాడు మతగురువు.

ఎర్విన్ వీళ్ళ మాటలు వింటూ, గడ్డిలో కదలకుండా దాక్కుని ఉన్నాడు. అతడికి వాళ్ళకి మధ్య 15 అడుగుల దూరం కూడా లేదు. ఉత్తరాది సైనికులు దగ్గరలోనే ఉన్నారనే వార్త వినేసరికి అతడికి ఉత్సాహం కలిగింది. కాని దొరికిపోతాననే భయంతో కదలకుండా ఉండిపోయాడు.

"ఈ యుద్ధం త్వరగా ముగిస్తే బాగుండు. బీభత్సం సృష్టిస్తోంది..." అని అన్నాడు పొట్టి వ్యక్తి.

"ఏదో చప్పుడవుతోంది. విను..." అన్నాడు మత గురువు చేయి పైకెత్తి.

రేకులపై టపటపా పడుతున్న వాన చినుకుల చప్పుడు కన్నా పెద్దగా గుర్రం గిట్టల శబ్దం వినపడింది. వెంటనే ఒక రౌతు తన గుర్రంతో సహా ఆ గదిలోకి వచ్చాడు. అతడు పొడగరి. అతడు ధరించిన బూడిద రంగు దుస్తులను బట్టి, అతడు దక్షిణాది రాష్ట్రాలకు చెందిన సైనికాధికారని తెలుస్తోంది. అక్కడున్న మత గురువుని, పొట్టి వ్యక్తిని పలకరించాడు. వారిద్దరూ బదులిచ్చారు.

"అమ్మయ్య! బూడిద రంగు దుస్తుల సిపాయిని చూస్తే, ఆందోళన తగ్గి, హాయిగా వుంది..." అని నవ్వుతూ, "ఉత్తరాది సైనికుల సంగతులు ఏమిటి మేజర్?" అని ప్రశ్నించాడు పొట్టి వ్యక్తి.



బదులుగా మేజర్ నవ్వి, "మీరు ఉత్తర దిశగా వెడితే గాని, ఈ రోజు నీలి దుస్తుల సైనికులని చూసే అవకాశం లేదు. బహుశా అది అంత సరైన ఆలోచన కాకపోవచ్చు" అని అన్నాడు.

పొట్టి వ్యక్తి తలూపాడు. "నిజమే! అది అంత సరైన ఆలోచన కాదు. నన్ను మీకు పరిచయం చేసుకోనివ్వండి. నా పేరు జెబ్ జాన్సన్. ఇప్పటికి దక్షిణ దిశగా నాకు తోటలు ఉన్నాయి. ఇక, నా మిత్రుడి పేరు క్లెమ్ కోలన్. ఈయన మత గురువు..." అని మేజర్‌తో చెప్పాడు.

"మీరు పరిచయం అవడం నాకెంతో సంతోషంగా ఉంది. నా పేరు ఆండ్రూ విల్కిన్స్" అని చెప్పాడు మేజర్.

"మీరు ఏ ప్రాంతం వారు మేజర్?" అని అడిగాడు జెబ్.

"వర్జీనియా" అని చెప్పాడు మేజర్.

"గొప్ప ఊరు" అంటూ మెచ్చుకున్నాడు జెబ్.

"నాకా ప్రాంతాన్ని సందర్శించే భాగ్యం కలగలేదు. కాని గొప్ప ఊరని విన్నాను" చెప్పాడు మతగురువు. అతడి మాటలెంతో మృదువుగా ఉన్నాయి. ఈ మార్దవం ఏళ్ళ తరబడి వేదికలపై నుంచి ప్రసంగించడం వల్ల వచ్చిన అలవాటు. తన ముఖంలో ఎటువంటి భావాలు లేకుండా తలాడించాడు మేజర్. ఈ ముగ్గురు మాట్లాడుకుంటుండగా, మేజర్ గుర్రం వెళ్ళి ఎర్విన్ దాక్కున్న గడ్డివామిలోంచి తన నోటికి చిక్కినంత గడ్డిని దొరకపుచ్చుకుంది. దాంతో గడ్డివామి నుంచి దుమ్ము పైకి లేచింది. ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా తుమ్మకుండా ఉండలేకపోయాడు ఎర్విన్. ఆ శబ్దానికి గుర్రం కూడా సకిలించింది.

"ఏంటా శబ్దం?" ప్రశ్నించాడు మత గురువు.

"అక్కడ ఎవరో ఉన్నట్లున్నారు" చెప్పాడు జెబ్. మేజర్ కత్తి దూసి, గడ్డివామి వైపు కదిలాడు. అక్కడికి చేరి, "మర్యాదగా బయటకి రండి. మీకేం ప్రమాదం లేదు" అని అన్నాడు.

ఎర్విన్ మరింత లోపలికి దాక్కోవడానికి ప్రయత్నిస్తూ, మేజర్ కంట పడ్డాడు. "బయటకు రా" అంటూ మేజర్ ఎర్విన్ చేయి పట్టుకుని బయటకు గుంజాడు మేజర్.

"నేను ముందే చెప్పానా, ఎవరో ఉన్నారని! చూడబోతే బానిసలా ఉన్నాడు" అన్నాడు జెబ్ నవ్వుతూ. మతగురువు కూడా అంగీకారంగా తలూపుతూ, "వీడు పారిపోతున్న బానిస అని నేను పందెం కాస్తాను. లేకపోతే ఇక్కడ దాక్కోవలసిన అగత్యం లేదు" అని అన్నాడు.

ఎర్విన్ వణుకుతూ, మేజర్ కాళ్ళ మీద పడ్డాడు. మేజర్ తన కత్తిని ఒరలో పెట్టుకున్నాడు.

"నీ యజమాని ఎవర్రా?" అని ఎర్విన్‌ని అడిగాడు జెబ్. ఎర్విన్ భయం నిండిన కళ్ళతో అతడికేసి చూశాడు.

"నేను నిన్నో ప్రశ్న అడిగాను. నీకు వినయ విధేయతలుంటే, బహుశా సరిగ్గా సమాధానం చెప్పేవాడివేమో!" అని కోపంగా అన్నాడు జెబ్.

ఈసారి కూడా ఎర్విన్ మౌనంగానే ఉండిపోయాడు. "వీడికి పెద్దమనుషులను గౌరవించడం తెలిసినట్లు లేదు" అని అన్నాడు మతగురువు.

"నా ప్రశ్నకి జవాబు చెప్పు..." అంటూ జెబ్ ఎర్విన్ కేసి దూసుకుపోయాడు. వెంటనే మేజర్ ఎర్విన్‌కి జెబ్‌కి మధ్యగా వచ్చి నిలబడ్డాడు.

జెబ్ వచ్చి మేజర్‌ని గుద్దుకుని ఆగాడు.

"క్షమించండి మేజర్! నేనీ బానిసకో గుణపాఠం నేర్పాలనుకున్నాను..." అని అన్నాడు జెబ్.

"ఆ అవసరం ఏమీ లేదు..." అని చెప్పాడు మేజర్ స్థిరంగా. జెబ్ నిర్ఘాంతపోయాడు. "మీరు ఏమంటున్నారో నాకర్థం కాలేదు" అని అన్నాడు జెబ్.

"ఇతడికి మీరు గుణపాఠం నేర్పాల్సిన అవసరం లేదని నేను అన్నాను" చెప్పాడు మేజర్.

"మీ ఉద్దేశ్యమేమిటో నా కర్థం కాలేదు" అన్నాడు జెబ్.

"బహుశా, స్వయంగా మేజర్ గారే వీడికి గుణపాఠం నేర్పాలనుకుంటున్నారేమో. ఉత్తరాది సైనికులతో పోరాడుతున్నందువల్ల ఆయనకా హక్కు ఉంది" అన్నాడు మతగురువు.

"మీరు చెప్పేది నిజమే. ఆయన హక్కుని నేను కాదనడం లేదు. అయితే వీడిని చంపకూడదు. వీడిని చూస్తే బాగా పనికొచ్చేవాడిలా ఉన్నాడు. వీడు విలువైన ఆస్తి..." అని అంటూ, "వీడిని మీరు చంపబోవడం లేదు కదా?" అని మేజర్‌ని అడిగాడు జెబ్. మేజర్ లేదన్నట్లుగా తలూపాడు. ఎర్విన్ కళ్ళు పెద్దవి చేసి, నోరెళ్ళబెట్టి వీరి సంభాషణని వింటున్నాడు.

"మీరేం చేస్తారో చేయండి..." అని అన్నాడు జెబ్ మేజర్‌తో. కాని మేజర్ కొంచెం కూడా కదల్లేదు. వాళ్ళిద్దరి కేసి చూస్తూ,"గుణపాఠాలు నేర్పడంపై నాకు నమ్మకం లేదు. ఈ యువకుడికి నేనేం పాఠం నేర్పబోడం లేదు...." అని అన్నాడు జెబ్, మతగురువు మేజర్ కేసి విస్మయంగా చూశారు.

"మేజర్, మీరు దక్షిణాది రాష్ట్రాలకు చెందినవారు. వీడేమో పారిపోతున్న బానిస. దక్షిణాది రాష్ట్రాల చట్టాల ప్రకారం బానిసలు పారిపోడం నేరం! పారిపోడానికి సహాయం చేయడం కూడా నేరమే..." అని అన్నాడు మత గురువు హెచ్చరిస్తున్నట్లుగా.

"దక్షిణాది రాష్ట్రాలకు చట్టాల గురించి మీరు నాకు చెప్పాల్సిన అవసరం లేదు" అని పొడిపొడిగా జవాబిచ్చాడు మేజర్. జెబ్ చిరాగ్గా ముఖం పెట్టి, "ఒకవేళ వీడు ఉత్తరాది సైనికుల కంటబడితే, వాళ్ళు వీడికి నీలి దుస్తులు తొడిగి, చేతికో తుపాకి ఇచ్చి మన దక్షిణాది వాళ్ళని చంపమని పంపుతారు..." అని చెప్పాడు మేజర్‌తో. మేజర్ సమాధానం చెప్పలేదు.

మతగురువు తన మృదువైన గొంతుతో, "మేజర్, వీడిని మీరైనా క్రమశిక్షణలో పెట్టండి. లేదా మమ్మల్ని పెట్టనివ్వండి. కనీసం వీడి యజమాని పేరైనా తెలుసుకుని, వీడిని ఆయనకి అప్పగించాలి" అని అన్నాడు మేజర్‌తో. మేజర్ ఇంకా మౌనంగానే ఉన్నాడు.

"మీకేమైంది?" అంటూ జెబ్ మేజర్‌కేసి దూసుకుపోయాడు. వెంటనే మేజర్ కత్తి దూశాడు. దాంతో జెబ్ వెనక్కి తగ్గి, "మీకు పిచ్చి పట్టింది" అని అన్నాడు.



"దక్షిణాది రాష్ట్రాలకు చెందిన అధికారి, ఓ పారిపోతున్న బానిసకి రక్షణ కల్పించడం నేనెన్నడూ చూడలేదు..." అని అన్నాడు మతగురువు వెటకారంగా.

"మీరిద్దరూ చాలా వాటిని చూసి ఉందరు" అని వ్యంగ్యంగా అంటూ, "గెటీస్‌బర్గ్ పోరాటంలో మీరెప్పుడైనా పాల్గొన్నారా?" అని అడిగాడు మేజర్. వాళ్ళిద్దరూ లేదన్నట్లుగా తలూపారు.

"అంటే మనుషులు ఫిరంగులవైపుకి నడపడం మీరెన్నడూ చూడలేదన్నమాట. రణరంగంలోని వైద్య శిబిరంలో క్షతగాత్రులకు చికిత్స చేయడం చూశారా? కనీసం గాయపడిన గుర్రాల ఆక్రందనలైనా విన్నారా?" ప్రశ్నించాడు మేజర్ ఆవేశంగా.

"మేజర్, వాటికీ ఇప్పుడీ బానిసకి క్రమశిక్షణలో పెట్టడానికి ఏమిటి సంబంధం?" అని అడిగాడు జెబ్ విసుగ్గా.

"ఇదంతా బాధించడం, ప్రాణాలు తీయడానికి సంబంధించినది. ఇప్పటి వరకు జరిగిన అకృత్యాలు చూడు. ఈ విధంగా మీరు ఒకరిని అనవసరంగా బాధించడం నేను చూడలేను..." బదులిచ్చాడు మేజర్.

"మీరు పొంతనలేని విషయాలు మాట్లాడుతున్నారు మేజర్. ఈ బానిస ఒకరి వ్యక్తిగత ఆస్తి. వీడికేమైనా అది మనకనవసరం. పోతే రణరంగంలో ఏం జరుగుతుందనేది అందరికి అవసరం. దక్షిణాది రాష్ట్రాల ఉద్ధరణ..."

మతగురువు ఇంకా తన మాటలను పూర్తి చేయకముందే – మేజర్ వ్యంగ్యంగా నవ్వి, "ఉద్ధరణా, దక్షిణాది రాష్ట్రాలను ఉద్ధరించడం గురించి మీరు నాకు చెబుతున్నారా?" అంటూ కత్తిని వాళ్ళకేసి గురిపెట్టి వారివైపు నడిచాడు. వాళ్ళిద్దరూ బెదరిపోయి భయంతో వెనుకడుగు వేశారు.

"శాంతించండి మేజర్. ఇప్పటికే మీరు చాలా యుద్ధాలు చేసి ఉంటారు. అందుకే తరచూ కత్తి దూయడం అలవాటైనట్లుంది." అన్నాడు జెబ్.

"హూ. యుద్ధాలు! మీలాంటి ఉన్మాదులే నాలాంటి అమాయకులని యుద్ధాలకి పంపుతారు. మేమేమో మీకోసం యుద్ధాలు చేస్తుంటే, మీరేమో హాయిగా తోటలలో కూర్చుని ఉంటారు. లేదా వేదికలపై నుంచి గొణుగుతుంటారు. ఇప్పటి దాకా జరిగిన రక్తపాతం చాలదన్నట్లు మీకింకా యుద్ధాలపై మోజు తీరలేదు. ఈ యువకుడిని చావగొట్టి తిరిగి తన యజమాని వద్దకు పంపాలని మీ కోరిక. అతడికి ఏమైనా మీకు బాధ లేదు..." ఆవేశంగా అన్నాడు మేజర్.

"మీకు పిచ్చెక్కినట్లుంది. లేకపోతే పారిపోతున్న ఈ నల్లవాడిని ఎందుకు సమర్ధిస్తారు?" అన్నాడు జెబ్.

"అతడి కేసి చూడండి" అన్నాడు మేజర్, ఎర్విన్ కేసి వేలు చూపిస్తూ. వాళ్ళిద్దరూ మేజర్ కేసి చూడసాగారు.

"అతడి కేసి చూడమన్నాను" ఈసారి కాస్త గట్టిగా చెప్పాడు మేజర్. వాళ్ళిద్దరూ మేజర్ కేసి చూడసాగారు.

"ధరించినవి చింకి దుస్తులు. కనీసం కాళ్ళకు చెప్పులైనా లేవు. ఆర్ధాకలితో ఉన్నాడు. దొరికిపోతే ఏం జరుగుతుందో అతడికి బాగా తెలుసని నా అభిప్రాయం! అయినా తెగించి పారిపోయాడు. ప్రమాదాన్ని ఆహ్వానించాడు. ఇదే మన దక్షిణాది రాష్ట్రాల కర్తవ్యాన్ని తెలుపుతోంది. కాదా? తెలివైన వాడెవడూ ఇటువంటి దుస్థితిని కోరుకోడు – ఊహకి కూడా అందని దుర్భర పరిస్థితులలో ఉంటే తప్ప" అన్నాడు మేజర్.

"వీడసలు మనిషే కాదు. కేవలం ఓ బానిస" అని అన్నాడు జెబ్.

"మూర్ఖంగా మాట్లాడకు. మన రక్తం వలెనే ఇతడి నెత్తురు కూడా ఎరుపే. ఇతడు కూడా మీలా, నాలా నొప్పికి, బాధకి స్పందిస్తాడు..." అన్నాడు మేజర్.

"మేజర్! ఒక దక్షిణాది వాడిగా మీకు మీ బాధ్యతని గుర్తు చేయడం మాకు తప్పని సరి" అన్నాడు మతగురువు.

"బాధ్యతా? బాధ్యతల గురించి నాకు చెప్పడానికి మీరెవరు? మర్యాదగా ఇక్కడ నుంచి కదలకపోతే, ముక్కలు ముక్కలుగా నరుకుతాను..." అని అరిచాడు మేజర్. వాళ్ళిద్దరూ హతాశులయ్యారు.

"బయటకు పొండి..." అంటూ మేజర్ కత్తి పట్టుకుని వాళ్ళవైపు నడిచాడు. వెంటనే వాళ్ళిద్దరు వర్షంలోకి పరుగెత్తారు. మేజర్ కత్తి దించకుండా గుమ్మం దగ్గర నిలుచున్నాడు. వాళ్ళ బండి బయల్దేరేవరకు కదలకుండా అక్కడే నిలుచున్నాడు. తర్వాత గట్టిగా ఊపిరి పీల్చి, కత్తిని ఒరలో పెట్టేశాడు.

జరుగుతున్న ఈ ఘర్షణ నంతా కదలకుండా చూస్తున్న ఎర్విన్, మేజర్ కేసి దృష్టి సారించాడు. గుమ్మం దగ్గర నుంచి లోపలికి వచ్చి, అలసటగా ఉండటంతో కళ్ళు నలుముకున్నాడు మేజర్.

"ధన్యవాదాలు మేజర్" అన్నాడు ఎర్విన్ మెల్లగా.

మేజర్ ఎర్విన్‌ని ఎగాదిగా చూసి, "ఆకలేస్తోందా?" అని అడిగాడు.

"అవును. పిచ్చాకలి" అని బదులిచ్చాడు ఎర్విన్. మేజర్ తన సంచిలోంచి ఓ రొట్టె ముక్కల కట్ట తీసి, "పెద్ద రుచిగా ఉండదు. కాని సైనికులకి నచ్చుతుందంటే, నీకు కూడా నచ్చుతుంది. నీ ఆకలి తీర్చుకో" అంటూ దాన్ని ఎర్విన్‌కి అందించాడు.

"కృతజ్ఞుడిని" అంటూ ఆ రొట్టెలని అందుకున్నాడు ఎర్విన్. అతడు తింటున్నంతసేపు మేజర్ గుమ్మంకేసి చూస్తూ నిలుచున్నాడు.

ఎర్విన్ తినడం పూర్తి కాగానే, మేజర్ అతడి వైపు తిరిగి కత్తి దూశాడు. ఎర్విన్ అదిరిపోయాడు.

"కంగారుపడకు. నేనో పటం గీయబోతున్నాను..." అంటూ మేజర్ నవ్వాడు. తర్వాత బూటుకాలితో క్రింద గడ్డిని జరిపి, మట్టిని చూపాడు. "మనం ఇక్కడ ఉన్నాం" అంటూ, ఉత్తరం వైపు ఓ గీత గీసి, "ఈ దారినే ముందుకు వెళితే, నదికి ఆవలి తీరాన ఉత్తరాది సైనికులు ఉన్నారు. అర్థమైందా?" అని అడిగాడు. ఎర్విన్ అర్థమైందంటూ తలూపాడు.

"మంచిది. నీకు అక్కడకి చేరడానికి రెండు మూడు గంటలు పడుతుంది. నది ఇలా ఉంది." అంటూ నేల మీద వంకరగా గీతలు గీశాడు మేజర్. "ఇక్కడ నదిని దాటడం సులువు. కొంచెం దూరంలో దక్షిణాది సైనికులు ఉన్నారు. నువ్వు వాళ్ళ కంటబడితే ప్రమాదం. కాబట్టి వాళ్ళు వెళ్ళేవరకు చెట్లలో దాక్కో. వాళ్ళ అక్కడ మహా ఉంటే ఓ అరగంట సేపు ఉంటారు. ఆ తర్వాత నువ్వు తప్పించుకోడానికి కావలసినంత సమయం దొరుకుతుంది" అంటూ, "నేను చెప్పేది స్పష్టంగా ఉందా?" అని ఎర్విన్‌ని అడిగాడు.

"అర్థమైంది" అంటూ మేజర్ చెప్పిన గుర్తులన్నింటిని తిరిగి చెప్పాడు ఎర్విన్.

"సరే, వర్షం తెరిపిస్తోంది. ఇక మనం బయల్దేరడం మంచిది. లేకపోతే వాళ్ళు తిరిగి వచ్చినా వస్తారు" అని అన్నాడు మేజర్. ఎర్విన్ తలూపాడు. మేజర్ తన గుర్రం కళ్ళెం పట్టుకుని బయటకు చూడసాగాడు. "వాళ్ళిద్దరిలో ఎవరో ఇక్కడ తన రగ్గుని మరచిపోయారు. నీకు కావాలంటే తీసుకో" అని అన్నాడు.

"వద్దు మేజర్. అది దొంగతనమవుతుంది" అని అన్నాడు ఎర్విన్. మేజర్ తృప్తిగా తలాడించి, బయటకు వెళ్ళి గుర్రం ఎక్కి... "నీకు మేలు కలుగు గాక" అని అన్నాడు.

"మీకు కూడా మేలు జరగాలని నా కోరిక మేజర్! పైగా ఈ యుద్ధం ఒకటి. మీకు విజయం ప్రాప్తించు గాక" అని అన్నాడు ఎర్విన్.

మేజర్ చిన్నగా నవ్వి "మేమీ యుద్ధంలో గెలవకపోవచ్చు" అని అన్నాడు.

"అలా అనకండి మేజర్" అని అన్నాడు ఎర్విన్. మేజర్‌కి కూడా ఏదో ఒక మేలు జరగాలనేది అతడి ఉద్దేశ్యం.

"మాకు ఓటమి తప్పదు. జరిగేది అదే! మనం భిన్నమైన మార్గాలలో ఉన్నాం. నా ప్రయాణం అధోముఖం. నీది పైపైకి! తరతరాలుగా శారీరకంగానూ, నైతికంగాను పతనమైన వ్యవస్థకి నేను రక్షణగా ఉన్నాను. నువ్వేమో ప్రగతి పథంలో దూసుకుపోతున్నావు. మనుషులే తప్ప బానిసలు ఉండని రోజు వైపు నీ పయనం సాగుతోంది. నేను గతాన్ని. గతించక తప్పదు. నువ్వు భవితవి. జీవించవలసినవాడివి...." అని చెప్పాడు మేజర్ ప్రశాంతంగా. ఎర్విన్ మేజర్‌నే చూస్తుండిపోయాడు.

"నీ పేరేమిటి?" అని అడిగాడు మేజర్. తన పేరు చెప్పాడు ఎర్విన్.

"ఎర్విన్, నీకు శుభం కలుగుగాక" అని చెప్పి, మేజర్ తన గుర్రాన్ని దౌడు తీయించాడు. తన దృష్టి నుంచి మేజర్ కనుమరుగయ్యే దాకా చూసి, ఎర్విన్ అడవిలోకి గబగబా పరుగెత్తాడు.

---

# పట్టుపోగులే ఉరితాళ్ళైన వేళ...

**రాధేయ**



ఇది మా యదార్ధ కథ
చేనేత చిత్రపటంలో
విరిగిన మగ్గం వ్యథ!
మా అధిష్టాన దేవత నందవరం చౌడేశ్వరి సాక్షిగా
అవతరమూర్తి, భావనాఋషి భక్త మార్కండేయుల సాక్షిగా
మేం చితికిపోతున్నాం
మా వృత్తి చావు బతుకుల్లో ఉంది
ప్రపంచీకరణ నీలినీడలు
మా చేనేత రంగాన్ని చేరి
చెదలు పట్టి తొలిచేస్తున్నాయి
బహుళ జాతి కంపెనీలు బలపడిపోయి
శ్రామిక వర్గం చతికిలబడిపోయింది
ప్రైవేట్ మిల్లుల ఆధిపత్యం
మా పూట కూలి కార్మికుల
పొట్టలు కొడుతుంది
మరమగ్గాల బ్రహ్మరాక్షసి
మా మగ్గం బతుకుల్లో విషం చిమ్ముతుంది
చీడపీడలతో పత్తి పంట దిగుబడి శూన్యమైంది
రాజకీయ క్రీనీడలతో
ముడి నూలు కొనుగోలు భారమైంది
రాత్రంతా నీలాకాశంలో
నక్షత్రాలను నిలిపి వస్త్ర శిల్పంగా చెక్కి
అందమైన చీరెను నేసినా
ఉదయాన్నే మండుటెండల బతుకేనా?
పగలంతా వెలుగు కిరణాల్ని అల్లి
హంసల్నీ, సీతాకోకచిలుకల్నీ పొదిగి
చీరెలలో నిలిపినా గంజిలో మెతుకూ కరువేనా?
అయినా జాతీయ స్థాయిలో వస్త్ర పరిశ్రమ
ఉత్పత్తిలో రెండో స్థానం పొందిందని గర్వపడదామా!
ఆకలిని భరించలేక, అడుక్కునే స్థాయి
దిగజారినందుకు సిగ్గుపడదామా?
గడిచిన మూడేళ్ళలో ఒక ఆంధ్రలోనే
నూట డెబ్బై నాలుగు ఆకలి చావులు
ఈ నేత కార్మికులవేనని ఎందరికి తెల్సు
ఇంకా దినపత్రికల కెక్కని ఆకలి చావులెన్నో
ఎవరికి తెల్సు!




# మట్టి మట్టి

దర్భశయనం శ్రీనివాసాచార్య

అతను భూమ్మీద పడ్డాడు
తొలి ఎరుక తన తల్లే
ఆమె ఒడి నుంచి
నేలమీదికొచ్చాడు
కాళ్ళూ చేతులూ ఆన్చి అంబాడాడు
అంతా మట్టే ఒంటి నిండా మట్టే
లేచిపడటం మళ్ళీ లేవడం
మట్టి మీదనే అతని తొలి సాధన

అమ్మ తీసుకెళ్ళి
శుభ్రంగా స్నానం చేయించింది
నీళ్ళను చూశాడు
అవీ మట్టి మీదే పారుతున్నాయి
నీళ్ళకెవరు స్నానం చేయిస్తారు
అతను అడగాలనుకున్నాడు

ఒక శుభముహుర్తాన
అక్షరం దిద్దడం మొదలెట్టాడు
మట్టి పలక మీద
అంబాడుతూ నేల మీద
గీతలు గీసిన నాడే
తొలి మాట రాసినట్లయిందని
అతను చెప్పాలనుకున్నాడు

చుట్టూచూశాడు
చెట్లు ఆకుపచ్చ అక్షరాల్తో
మహాకావ్యాల్లా కన్పించాయి
మట్టి విచ్చుకుంటేనే
అవి ఆవిర్భవించాయని అర్థమైంది
అక్షరాల్ని పక్షులు
పాటల్లా వల్లె వేస్తున్నాయని
శ్రోతగా గాలి ఊగిపోతుందని
గ్రహించాడు

నిగనిగల్తో కదిలే
నదుల పరవళ్ళను చూశాడు
అవే మలుపులు తిరిగి
పంట కాల్వలయే తీరు దర్శించాడు
అన్నం మొలకెత్తే దృశ్యాన్ని
గట్ల మీద నిల్చుని వీక్షించాడు
మట్టి ద్రవిస్తేనే
ఎవరికైనా అన్నమని అర్థమైంది
గునపం పట్టి
భూమిని తవ్వుతూ పోయాడు
మట్టి తెరుచుకుంది
ఓ చోట నల్ల వజ్రం
మరోచోట ఖనిజ ఖచితం
ఇంకోచోట పురాతన వృక్ష జ్ఞాపకం
లోపలికెళ్తూ వుంటే
గతాన్ని దర్శిస్తున్న యాత్రానుభవం
పాతకాంతుల వలయంలో అతను
కొత్తగా మెరిసిపోయాడు

నేలమీదికొచ్చాడు
నాలుగడుగులు నడిచాడు అది బాటయింది
నాగలి పట్టి నడిచాడు అది పొలమయింది
తవ్వి కట్టపోశాడు అది చెరువయింది
నాలుగ్గోడలు కట్టాడు అది ఇల్లయింది
ఎటు వెళ్ళినా అదే
మట్టి మంచి మిత్రుడని అర్థమైంది



అంతరిక్షమ్మీద కన్నుపెట్టి
నేల నుంచి ఎగిరాడు
గిరగిరా గిరికీలు కొట్టాడు
ఆకాశంలో పాదాలకు చోటు లేదని
ఆందోళన పడ్డాడు
నేల వాలాడు
గూటికి చేరినట్లు సంబరపడ్డాడు

తిరిగాడు నలు చెరగులా
మట్టి ఒకో చోటు ఒకో రంగులో!
తెలుపూ ఎరుపూ నలుపూ
అక్కడక్కడా ఆ రంగూ ఈ రంగూ కలుస్తూ -
ఏ రంగు గొప్ప
మట్టి మాట్లాడదు
సారమున్నవేవీ మాట్లాడవు కాబోలని
అతననుకున్నాడు

నడుస్తూ వుంటే
కాళ్ళకు రక్తమంటింది
చేత్తో తాకితే అవి కన్నీళ్ళు!
జీవితాలు భగ్నమై రక్తం పారితే
మట్టి దుఃఖిస్తుందని
తడి స్పర్శలో తెలుసుకున్నాడు

ఒకానొక పొద్దుటిపూట
'మట్టెంత' అని ఊహించబోయాడు
వాకిలిని చూశాడు,
మట్టి వాకిలంత అన్పించింది
బాటను చూశాడు - బాటంత అన్పించింది
పొలాన్ని చూశాడు - పొలమంత అన్పించింది
చూపునింకా పెంచుతూ పోయాడు
మట్టి విస్తారంగా కన్పడింది
అంతా ఇంతా కాదు
మట్టి అనంతమని తెలుసుకున్నాడు
అనంతమే గానీ అందేదని అర్థమైంది
అందడమే కాదు, పిలిస్తే వచ్చి
అంతరంగమూ అవుతుందని
బోధపడింది

శతాబ్దాల నాటిది కదా
మట్టి పాతదే అనుకున్నాడు
రానున్న కాలాలకూ ఇది నెలవు కదా
ఎప్పటికప్పుడు ఇది కొత్తది కూడా
అనుకున్నాడు
మట్టి ఒకటే

అతను తిరిగి తిరిగీ
అలసిపోయి
చెట్టునీడకొచ్చాడు
చెట్టు కూడా నిల్చున్న మట్టే కదా!
కింద మట్టి పైన మట్టీ
నడుమ అతను

'జీవితమేంటి' అతను ప్రశ్నించుకున్నాడు
'మట్టితో సహవాసం'
ఇంకా ఆలోచించాడు
మట్టిని మినహాయిస్తే
ఏ శ్వాసా మిగలదని అర్థమైంది
చేతుల్ని చూసుకున్నాడు
మట్టి మట్టి!
పరవశించాడు
జన్మ ధన్యమైందనుకున్నాడు
ఇక చాలన్నట్లు విశ్రమించాడు
నేల్లో నేలై పోయాడు
ఇపుడతను మట్టే!
అదే మట్టి మీద మరో కొత్త పసివాడు
అంబాడ్డం మొదలెట్టాడు

# భూమ్మీదకి



మేము వూరిని సమీపిస్తుండగానే తెల్సింది తాతయ్యని శ్మశానానికి తీసుకెళ్ళిపోయారు. సూర్యాస్తమయంలోగా దహనం జరిగిపోవాలి కాబట్టి అప్పటి వరకూ ఉంచి తీసుకెళ్ళిపోయారు. అమ్మా వాళ్ళని యింటికి వెళ్లిపొమ్మని చెప్పి నేను శ్మశానం వైపు వెళ్ళాను. ఆ సన్నటి పుంతలో మెత్తటి మట్టి మీద నడుస్తుంటే చిన్నప్పటి జ్ఞాపకాలు...

**అద్దేపల్లి ప్రభు**

గుడివాడ నుంచి బందరు వెళ్ళే రోడ్డులో పెద తుమ్మిడి దగ్గర బస్సు దిగి పోయి అక్కడ నుంచి సుమారు రెండు, మూడు కిలోమీటర్లు నడిచివెళ్ళాలి మా తాత వూరికి. చినతుమ్మిడి దాని పేరు. పెద్ద కాలువ మీద వంతెన్ని దాటి రెండు ఫర్లాంగులు నడిస్తే బాట ప్రక్కన గ్రామ దేవత గుడి ఉంటుంది. చిన్న బొమ్మలాంటి గుడి అది. చుట్టూ నాలుగు గోడలు... శంకువులాగా పైకి మూసేసి దాని మీద సిమెంట్‌తోనే కలశంలాగా చెక్కారు. లోపల విగ్రహం ఏమీ లేదు. ఒక రాయి. దానికి పసుపు, కుంకుమ పూసి ఉంచుతారు. బయట నల్లటి రాయి ఉంటుంది. ఊరికి వచ్చే వాళ్లందరూ ఆ గుడి దగ్గర ఆగి దణ్ణం పెట్టుకుని వెళ్తారు. దాని చుట్టూ జిల్లేడు మొక్కలు, చిన్న చిన్న తుమ్మ మొక్కలూ తుప్పల్లా పెరిగి ఉంటాయి. దారికి అటూ యిటూ పొడుగూతా అలాంటి మొక్కలే. పంట కాలువ అవతల పొలాలు. కాలువ గట్ల మీద మామిడి, తాటి... సపోటా లాంటి చెట్లు ఉన్నాయి.

చిన్నతనంలో జిల్లేడు మొగ్గల్ని టప్ టప్ మని పేల్చుకుంటూ వెళ్ళేవాళ్లం. ఊరికి తిరిగే మలుపులో కాలవ పక్కనే ఒక కోతి బొమ్మ ఉంది. కోతి వెనుక కాళ్ళు మడిచి కూర్చుని ముందు కాళ్లు నిటారుగా ఉంచుకొని దారిన వచ్చే వాళ్లని చూస్తున్నట్లు ఉంటుంది. సిమెంట్‌తో చేసిన బొమ్మ దానికి కళ్ళుగా నల్లటి గోళీలని పెట్టారు. మేం అల్లంత దూరం నించే దాన్ని చూసి కోతి బొమ్మ అని అరుచుకుంటూ పరుగెత్తి దాని దగ్గరికి వెళ్ళి ముద్దాడేవాళ్ళం. ఎప్పుడో ఎవరో పొరపాటున ఒక కోతిని చంపాడట. ఆ మహా పాపానికి ప్రాయశ్చిత్తంగా ఈ బొమ్మని కట్టించాడు. ఆ బొమ్మ యిప్పటికీ ఆలాగే ఉంది. రంగు అంతా వూడిపోయినా ఎక్కడా పగుళ్ళు మాత్రం లేవు.

ఇందాకా ఆ బొమ్మని దూరం నించి చూసినప్పుడు ఎందుకో ఒకలాంటి ఉద్వేగం గుండెల్లో కలిగింది. చిన్నప్పటిలాగే దాన్ని ముద్దుపెట్టుకున్నా. ఎన్నాళ్లయిందో ఆ వూరు వచ్చి!... యిప్పుడు పెద్ద కాల్వ దాటగానే ఉన్న పొలాలన్నీ చేపల చెరువులై పోయాయి. వాటి మీద సన్నటి వలలు వేలాడుతున్నాయి. అక్కడ్నించి అటు యిటూ యిళ్ళు లేచి పోయాయి. జిల్లేడు మొక్కలు లేవు. మట్టి పుంత కాస్తా తార్రోడ్డుగా మారింది. త్వరలోనే సిమెంట్ రోడ్డుగా మారుతుంది.

ఘాటైన పురుగుమందు వాసనకి కళ్లు, ముక్కు మండుతుండటంతో కర్చీఫ్‌తో ముక్కు మూసుకుంటూ నడిచాను. శ్మశానం ఎంత యిరుగ్గా ఉందో! మామయ్య... ఇంకా కొంతమంది అప్పుడే స్నానాలు చేశేసారు. కాష్ఠం ఆరిపోయివుంది. ఇంచుమించు

వాళ్లందరూ బయలుదేరిపోవడానికి సిద్ధంగా వున్నారు. మామయ్య నన్ను చూశాడు. కళ్లతోనే నిశ్శబ్దంగా పలకరించాడు. నేను ఓ పక్కగా నిలబడ్డాను.

చిన్నతనంలో అస్తమానూ ఇక్కడికి వచ్చేవాళ్ళం. పదిమంది పిల్లలం చేరి గుట్టలాగా వున్న ప్రాంతం వెనుక కూర్చుని చూస్తుండే వాళ్ళం. అప్పట్లో ఇది చాలా విశాలంగా ఉండేది. రుద్రభూమి! పశువుల కళేబరాల్ని యిక్కడ పడేసేవాళ్లు. అలా చూస్తుండేవాళ్లం. ఆకాశంలో ఒక పక్షి గుండ్రంగా ఎగిరి రెండు గిరికీలు కొట్టి రయ్యిమని వచ్చి చచ్చిపడున్న గేదె మీద వాలింది. రాబందు! ఎంత పెద్దగా ఉందో... పసుపచ్చని దాని ముక్కు చివర వొంకర తిరిగి కిందికి వుంది. మెడమీద ఈకలేం లేనట్టు తెల్లగా ఉంది. మళ్ళీ రెక్కలూ... పక్షి అంతా ముదురు బూడిదరంగు... రాకుమారుడికి సాయం చేసిన గండభేరుండం... దాన్ని చూస్తే తెలీని భయం... కానీ అది అయస్కాంతం. అది రెక్కల్ని దెయ్యంలాగా బారుగా సాచి ముక్కుతో కళేబరాన్ని పొడిచింది. అంతట్లోనే ఆకాశంలో పెద్ద గుంపుగా రాబందులు ప్రత్యక్షమయ్యాయి. పదులు వందల సంఖ్యతో రాబందులు కళేబరం మీద వాలి దాన్ని పొడుచుకు తినడం మొదలుపెట్టాయి. వెగటు... వికారం... నీచు... అదోలాంటి వాసన కమ్ముకుంది. అవి టకటకమని పొడిచి తినేస్తుంటే మేం మాటా పలుకూ లేకుండా ఊపిరి కూడా తీయకుండా చూస్తుండి పోయేవాళ్లం. మమ్మల్ని చూస్తే అవి మీద పడతాయేమో అని హడలిపోయేవాళ్లం. కాని చూడకుండా మాత్రం ఉండేవాళ్లం కాదు.



మారిపోవడం అనేది సహజం కావడానికి అసహజం కావడానికీ మధ్య చాలా తేడా వుంది. మనం ఇష్టపడనిదీ, ప్రేమించనిదీ అయిన మార్పు బలవంతాన వూళ్లలోకి దిగిపోయింది. అదేమిటి? ఎందుకూ... అని తెలుసుకునేలోగానే మనుషుల్ని వశీకరణ చేసేసింది. అంతా ఒక మందు జల్లినట్టయిపోయింది. బజార్లో ప్లాస్టిక్ గుండె దొరికితే ఉన్న గుండెల్ని వూడపీక్కుని ప్లాస్టిక్ గుండెని పెట్టేసుకుంటాం. ఎందుకు... ఏమిటి... అనే దానికి అవకాశం లేదు. అది నాగరికత... మానవ జీవితం చేరాల్సిన గమ్యం. అటువైపు వెళ్ళకపోవడం అంటే వెనకబడిపోవడం. మనం వెనకపడకూడదు. ముందుపడిపోవాలి.... అంతే...

యిప్పుడు ఎక్కడా రాబందులు లేవు. వాటికి ఈ భూగోళం మీద చోటు లేదు. అవే ఏంటి? చిలకలు... పిచ్చుకలు... గోరికలు... కొంగలు... పాలపిట్టలు... కోయిళ్లు ... ఒకటేమిటి వందల రకాల పిట్టలు... వేటికీ చోటు లేదు. ఏ పక్షి పొలాల మీద ఎగరగలదు? పల్లెల్లో ఉండగలదు? ఒక సారెప్పుడో తాతయ్యని అడిగాను కూడా "తాతయ్యా... యిక్కడ యింతకుముందు గోలగోలగా తెగ పిచ్చుకలుండేవి కదా... యిప్పుడేంటి ఎక్కడా పిచ్చుకలే కనబడ్డం లేదు" అని.

"పిచ్చుకలా..." అని నిస్తేజంగా చూశాడు. "అవుంటే ఏంటి? ఛస్తే ఏంటి? ఈ పురుగు మందుల ధాటికి మనుషులే చచ్చూరుకుంటున్నారు. పిట్టలో లెక్కా..." అన్నాడు.

అదంతా అలా సహజంగా జరిగిపోయింది. పెద్ద పరిణామం గానీ, కాలం గానీ ఏమీ లేదు. ఇంగ్లీషు సినిమాలో గుళ్ళ గొలుసు పిస్తోలుతో ధమధమమని పేల్చేయడం... తరువాత నిశ్శబ్దం... శవాలు.. మధ్య నడుస్తున్న మనిషి... అంతా మూడు సన్నివేశాలు. కాలం ఏమీ లేదు. అలా జరిగిపోతుంది. అంతే.. పక్షుల్లేవు... పురుగుల్లేవు.. పాముల్లేవు... మొక్కల్లేవు... ఎక్కడ చూసినా మనుషులే.... అమ్మడం... కొనడం... అమ్మడం.. కొనడం... ఈ మహాయంత్రంలో నలిగి నలిగి మనుషులు ఒకరికొకరు క్లోనుల్లా అయిపోయారు.

ఇంటి దగ్గర టెంటు వేసుంది. పదో పదిహేనో కుర్చీలు...వాటిల్లో మా తాతయ్య కూతుళ్లు... ఇంకా దూరపు బంధువులు కూర్చొని మాట్లాడుకుంటున్నారు. వెళ్లిపోదల్చుకున్న వాళ్లు బ్యాగుల్ని తగిలించుకొని వెళ్ళిపోతున్నారు. చీకటి పడిపోయింది. కరెంట్ లేదు. అరుగు మీద ఒక మూలగా లాంతరు వెలుగుతోంది.

"పల్లెటూళ్లో కొస్తే యిదే బాధ కరెంట్ సరిగా ఉండి చావదు. సీరియల్సన్నీ మిస్సయిపోతున్నాం..." అంటోంది ఒక కూతురు.

ఆ వెంటనే వాడిలాగా, యిదిలాగా అంటూ ఆ పాత్రల్ని గురించి మాట్లాడటం మొదలుపెట్టారు. బాగా సన్నిహిత వ్యక్తుల్ని గురించి చెప్పుకుంటున్నట్టే ఉందది.

ఈ వూరి గురించి నాకు అనుభవాలు మొదలైన సమయంలో కరెంట్ లేదు. రాత్రివేళ రెండు పెట్రోమాక్స్ లైట్లని వెలిగించి పెట్టేవారు. అవి గుయ్....మంటూ చేసే శబ్దం యిప్పటికీ గుర్తే. సూర్యాస్తమయం కాగానే భోజనాలు చేసేసి బయట మంచాలు వేసుకొని కూర్చునేవాళ్ళం. పాటలు.. కథలు.... కబుర్లు... అలా పొద్దుపోయేవరకు ఒక ఉత్సవం... చాన్నాళ్ళ క్రితం ఈ వూరికి కరెంట్ వచ్చిందని విన్నప్పుడు ఆనందంతో పాటు కించిత్ బాధ కూడా అనిపించింది. ఆ అనుభూతికి వింతపడుతూ తాతయ్యతో చెప్పాను. "కరెంట్ కూడా లేని కుగ్రామంగా ఈ వూరుండి పోవాలేట్రా... సౌకర్యాలన్నీ మీకుగానీ మాకుండకూడదా ఏంటి?" అన్నాడు. నిజమే... పట్నంలో ఉండేవాళ్ళకి పల్లె ఒక ఆటవిడుపు. అది నాలుగు రోజుల జ్ఞాపకం. కాని యిక్కడ జీవించేవాళ్ళు!

కానీ యిక్కడ పట్నానికి ఒక క్లోను తయారవుతోంది. అచ్చంగా పట్టణపు మనుషుల్లాంటి మనుషుల్ని యిక్కడ పోత పోస్తున్నారు. ఒక సుదీర్ఘకాలం తరువాత ఓసారి నేనీ వూరికి వస్తే తాతయ్య కావలించుకోలేదు. సరికదా అప్పుడు టీవీకి అంటుకుపోయున్నాడు. ఓసారి తలతిప్పి చూసి 'ఏరోయ్... యిదేనా రావటం' అని మళ్ళీ టీవీలోకి దూరాడు.

అప్పటికి ఆయనకి ఎనభయ్యేళ్ళు దాటినై. వ్యవసాయం కొడుకులు చూస్తున్నారు. న్యాయంగా ఆయన ఊర్లో పెద్దమనిషిగా ఉండి గ్రామాన్ని నడిపించాలి. ఎప్పుడూ విసుగెత్తించేలా మాట్లాడేవాడు. ఇప్పుడవేమీ లేవు. నిద్రపోని సమయం మినహా అంతా టీవీనే. కరెంట్ తీసేసిన సమయంలో కరెంట్ వాళ్లని అమ్మనా బూతులు తిడతాడు. వస్తువుల్ని కొనడం అనే వ్యామోహం నాగరికతగా మారి గ్రామాల్లోకి చేరింది. ఒక ఫ్రిజ్.. కలర్ టివి... సోఫాలు... దివాన్లు... డైనింగ్ టేబుల్ వగైరా... ఇవన్నీ... అవసరంతో నిమిత్తం లేని నాగరికత ఆనవాళ్లు.... మనుషుల మానానికీ అవమానానికి ప్రతీకలు. వీటితో పాటే ఆ ఒంటరితనం కూడా గ్రామాలలోకి వచ్చేసింది. తలుపులు మూసుకోవడం... సంబంధాలు తగ్గించుకోవడం... ఏకాకిగా జీవించడం...

కానీ యిదంతా అభివృద్ధి... మామయ్య పిల్లలు ఇంగ్లీషు మీడియంలో చదివారు. కొడుకు ఇంజనీరింగ్ చదువుతున్నాడు. వాళ్ళ మొహాలు చూస్తే పొరపాటున దారి తప్పి ఇక్కడ పుట్టినట్టుంటాయి. గమ్మున చదువు పూర్తి చేసి అమెరికా పోవాలి. సొంతూరికి పోవాలనే తహతహలాంటిదేదో వాళ్ళ దగ్గర కనిపిస్తుంది.

ఒకసారి ఉదయం వరండాలో కూర్చొని తాతయ్యతో మాట్లాడుతూ "తాతయ్యా... యిక్కడ వేపచెట్లు... అక్కడేమో గానుగచెట్టూ యిలా డాబా మీదకి వాలి సపోటా చెట్టూ... ఆ గోడ దగ్గర నాలుగైదు కొబ్బరి చెట్లూ ఉండేవి కదా... వాటినెందుకు నరికేశారు" అన్నా.

ఆయన యిలాంటి ప్రస్తావనల్ని ఎందుకో యిష్టపడేవాడు కాదు.

"ట్రాక్టర్ లోపలికి రావాలంటే అవద్దు కదరా... అందుకని కొట్టవతలపడేశారు. "కాస్సేపు వూరుకొని" ఎప్పటి చెట్లవి?... మా తాత కాలం నాటివి. మా తాత పెంచాడు. నాన్న పెంచాడు. నేను పెంచాను... మంచి గాలీ... నీడా... పిట్టలూ... భలే ఉండేదిలే... అయినా యిప్పుడు ఫాన్లున్నై కదా... స్విచ్చి నొక్కితే గాలి.. " అన్నాడు. నేనేదో అనబోయాను. కానీ ఆ సంభాషణ యిష్టం లేనట్టు వెళ్లిపోయాడు.



కరెంట్ వచ్చింది. కానీ లోవోల్టేజి. ఆ వెల్తురులోనే పనులు చేసుకోవడానికి కొంతమంది యింట్లోకి వెళ్లారు. బయట నుంచి సన్నగా, పొడుగ్గా ఉన్న వ్యక్తి ఒకాయన వచ్చాడు. గబుక్కున చూడగానే వావిలాల గోపాలకృష్ణయ్య గుర్తొస్తారు. కమిలిపోయినట్టున్న శరీరం. ఆయన టెంటు మధ్యలోకి వెళ్లి జనాంతికంగా.... "నిండు జీవితం గడిపాడు నారాయణ (మా తాత పేరు) నాకు తెల్సి ఆయనెప్పుడు దుఃఖపడగా చూడలేదు. కానీ చివర్రోజుల్లో బెంగగా ఉండేవాడు. మహాజ్ఞాని ఆయన... దాత... ఈ అరుగు మీద ఎన్ని వేల మందికి భోయనాలు పెట్టాడో... చెయ్యెత్తి దణ్ణం పెట్టాల్సినోడు... అలాంటి వ్యక్తి చివర్లో దుఃఖంగా ఉండేవాడు. ఎందుకో... ఏంటో... మనెవరికీ తెలియదు..."

అంతా నిశ్శబ్దమైపోయారు. అతన్ని గుర్తుపట్టాను. అతను మా తాత దగ్గరే వుండేవాడు. ఆధునిక భాషలో పర్సనల్ సెక్రటరీ. కొంతమంది ఎకసెక్కంగా అనే పేరు పెద్ద పాలేరు. కానీ ఆయనంటే అందరికీ మాష్టార్ని చూసినట్టుండే భయం. బాబాయ్ అనే వారతన్ని.

"పుష్పక విమానం వచ్చింది. నారాయణని దేవతలు సాదరంగా అందులో కూర్చోపెట్టారు. అది మబ్బుల్లోకి పోవడం నేను చూశాను. కాని నాకోటే అంతుపట్టలేదు. నారాయణ ముఖం వెలిగి లేదు. ఏ బెంగ... ఆయన్ని వెంటాడుతుందో మరి..." అంటున్నాడు.

ఇంతలో మా అత్తయ్య 'బాబాయ్ గారూ' అంటూ...

అనడంతో లోపలికి వెళ్ళాడు.

టెంటులోకి మళ్ళీ గాలొచ్చింది.

ఒక బంధువు నవ్వుతూ అన్నాడు. "ఈ బాబాయ్ మావగారికి భక్తుడు. అలా వదిలేస్తే తెల్లార్లూ మాట్లాడుతూనే ఉంటాడు. కానీ... భీష్మాచార్యుడిలాంటి వాడు మావగారు. ఆయనకి దుఃఖమేంటి? అన్ని రుణాల్ని నిశ్శంకగా తీర్చుకొని దైవత్వం సిద్ధించుకొని వెళ్లారు మామగారు... ఆయనకి దుఃఖం... " అంటూ నవ్వాడు.

తాతయ్య బెంగ... దుఃఖం నాక్కొంచెం తెలుసు.

మాట్లాడకుండా... వాదించకుండా... బోధించకుండా.... ఏదో ఒకటి చేయకుండా ఉండటం తాతయ్యకి చేతకాదు. అతడు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నవాడు.

"క్విట్ఇండియా టైమురా తాతా అది. మా క్లాసు పిల్లలం అందరం స్కూళ్లు బాయ్‌కాట్ చేసి హర్తాళ్‌లో పాల్గొన్నాం. పెద్ద వూరేగింపు... పోలీసులు వచ్చేస్తారు. గుర్రాలతో తొక్కించి.... లాఠీలు పట్టుకొని బాదేశారు. మేమంతా పరుగులు... పట్టుకొని జైలులో పడేశారు..." అంటూ చెప్పేవాడు.

ఈయన యిలా తిరగడం చూసి వాళ్ళ నాన్న హడలిపోయాట్ట. వదిలేస్తే ఏమైపోతాడో అని పిలుచుకొని తీసుకొచ్చి పెళ్లి చేసేశాడు. అయినా సరే ఈయన చలించలేదు. పట్టాభి సీతారామయ్య, అడవి బాపిరాజు లాంటి వాళ్లతో తిరిగేవాడు.

కాకినాడలో గాంధీగారి మీటింగ్‌కి వెళ్లాట్ట. 1947 ఆగస్టు నెల చివరి కొచ్చేసరికి తనకి చేయడానికి పనేమీ లేకుండా పోయిందంటాడు. యింక పల్లెకి తిరిగొచ్చేశాడు. తండ్రి యిచ్చిన పాతికెకరాల పొలాన్ని వ్యవసాయం చేసుకుంటూ స్థిరపడిపోయాడు. ఇంట్లో పదిమంది వరకూ పాలేరుల ఉండేవాళ్లు. ఎదురుగా గొడ్ల సావిడి.... అందులో నాలుగైదు పాడిగేదెలు... నాలుగు జతల ఎద్దులు... దూడలు... వాటిని మేపడానికి కుర్రోడు... ఏడాది పొడుగునా వచ్చిపోతుండే చుట్టాలు... అలా గడిపాడు తాతయ్య... పొలాల మీద ఎగిరే వందల రకాల పక్షులు... చెట్లూ... మనుషులూ... వాటి మధ్య జీవించాడు.

ముందుసారి వచ్చినప్పుడు వూరంతా తిరిగాను. ఇంచుమించు ఐదారు ఇళ్లు పాడుబడిపోయి వున్నాయి. వాళ్లు పొలాన్ని అమ్మేసి పోయారట. వూళ్లో ఉంటానికెవరూ లేరు. పొలాలనన్నింటినీ పెద్ద పెద్ద వ్యాపారస్తులు కొనేస్తున్నారు. వాళ్లకి వూరుతో గానీ... జనంతో గానీ ఎలాంటి సంబంధం లేదు. పొలాన్ని తవ్వించి చేపలు.. రొయ్యల చెరువులు చేసేశారు. వాటిని చూట్టానికి గుమస్తాలని... కూలీలనీ పెట్టుకున్నారు.

అలా తిరుక్కుంటూ గుడి దగ్గర కెళ్లాను. గుడి నిర్మానుష్యంగా ఉంది. కానీ చాలా సంపన్నంగా ఉంది. గుడి మీద రెండు స్పీకర్లలోంచి సినిమా పాటలు కర్ణకఠోరంగా వినిపిస్తున్నాయి. ఇక్కడ ఎర్రగన్నేరు చెట్టుండేది కదా అనుకుంటూ తలెత్తి గోపురం మీదకి చూశాను. అక్కడంతా ఖాళీ. టపటప కొట్టుకుంటూ పావురాలు లేవు. గుడి లోపలంతా తెల్లని పాలరాళ్లు. ఎందుకో అది దేవుడి గుళ్లా కాక మనిషి గుడిలా అనిపించింది.

బయటకొచ్చాను... నడుస్తుండగా... "ఎవరండి బాబు" అనడంతో తిరిగి చూశాను. రంగన్న. పూర్వం మా తాతయ్య దగ్గర బుడ్డోడిగా – పాలేరుగా ఉండేవాడు.

"రంగన్న కదా... బాగున్నావా..." అడిగాను.

అతను దగ్గరకొచ్చి ముఖంలోకి చూసి "ఆc.. మీరాండీ... ఎప్పుడొచ్చారు" అన్నాడు.

అలా నడుస్తున్నాం.

"చాలా కాలమైపోయింది మీరొచ్చి... పిల్లలా..." అన్నాడు.

సమాధానం చెప్పి

"ఇప్పుడెవరి దగ్గర" అనడిగాను.

"అబ్బే నేనీ ఊళ్లో ఉంటం లేదండి... బెజవాడలో ఉంటున్నా. మా అమ్మ యిక్కడే ఉండిపోయింది. చూసిపోదామని వచ్చా" అన్నాడు.

"అదేం యిక్కడ పొలం ఉంది కదా"

"ఏ పొలం లెద్దురు... మునుపులా లేదు కదా... ఆ కాసింత చెక్కని అమ్మేసాను. ఈ వూళ్లో ఉండి చేసేదేముందని వెళ్లిపోయాను. జట్టు పన్లో ఉన్నాలెండి. మాయమ్మే వూరిడిసి రానంది."

'మునుపులా లేదు' అందరికీ తెలుస్తోంది యిది. ఆ రాత్రి కరెంట్ పోయిన సమయంలో అడిగాను తాతయ్యని.

"నేను కాటికి కాలు చాచుకొని కూర్చోనున్న వాణ్ణిరా తాతా... నన్నడిగి ఏం లాభం? నిజమే చెట్లూ చేమలు, పక్షులు, మనుషులు అన్నా యిష్టమే.

కానీ లోకం మారిపోయింది. నేను వ్యవసాయం చేసే రోజుల్లో ఎకరానికి పండేదెంత? యిప్పుడు పండేదెంత? పెరిగిపోలా... ఇదంతా ఎలా వచ్చింది?" అన్నాడు.



"నిజమే కాని అప్పుడు ఎవరూ పల్లెల్లో బతకలేక వూళ్లు విడిచిపోలేదు.

ఇప్పుడు? ఊరిడిచి పోతే గానీ బతకలేమంటున్నారు. మరి ఈ సమస్య ఎలా పరిష్కారమవుతుంది?"

నవ్వాడు తాతయ్య. నవ్వి లేచి దగ్గరికొచ్చి నా గడ్డం పట్టుకొని కళ్లలోకి చూసి

"మీ కుర్రాళ్లతో వచ్చిన చిక్కిదే... ఒక సమస్య ఉంటే దానికి పరిష్కారం కావాలంటారు" అని కాసేపు ఆగి బయటికి చూస్తూ

"అక్కర్లేదు... పరిష్కారం అక్కర్లేదు. అది అలవాటై పోతుంది. మంతోపాటే జీవిస్తుంది. అది అదే. మనం మనమే... దట్సాల్...

అన్నాడు.

చాలాసేపు ఏమీ మాట్లాడలేదు.

ఎప్పటికో అన్నాడు.

"కాని బాధగానే ఉంటుందిలే. భూములన్నీ మెల్లమెల్లగా డబ్బులున్న వాళ్ల చేతుల్లోకి పోతున్నై. వ్యవసాయం చేయడం కన్నా వడ్డీకీయడం లాభం అనేవాళ్లు తయారయ్యారు. ఇప్పుడు చూడూ... మీ మావయ్య ఇంటర్ చదివి ఆపేసి వ్యవసాయంలోకి వచ్చేశాడు. మంచి రైతు వాడి పిల్లాడు ఇంజనీరై పోతాడు. అమెరికా వెళ్లిపోతాడు. పెద్ద మామయ్య వాటాని ఆల్రెడీ అమ్మేశాడు. అది చెరువై పోయింది. వాడి పొలం ఏమవుతుంది? వీడి కొడుకు యిందులోకి రాడు. ఆడపిల్లలకి పెళ్లయి వెళ్ళిపోతారు. కుటుంబం వూరు విడిచి వెళ్ళిపోతుంది. ఎంతమంది పోలేదలా... అమ్మేస్తారు... పొలాలు కాస్తా కాగితాల కట్టలైపోతాయి... కానీ ఏం చేస్తాం! మార్పు ఇది... మన కుర్రాళ్ళు కోరుకున్న జీవితం ఇది... అంతే" అన్నాడు చేతుల్ని వూపుతూ.... ఆయన గొంతు సన్నగా కంపించడం నేను గుర్తు పట్టాను. అది నన్ను నిశ్చేష్టుణ్ణి చేసింది.

మా తాతయ్య బాధ... బెంగ... యిది. కాని యిది వాస్తవం. ఇంకో నాలుగైదేళ్లలో జరుగుతుంది. మా మామయ్య కొడుకు... వాడి పేరు ప్రశాంత్. ఇంజనీరింగ్ ఫస్టియర్‌లో ఉన్నాడు. అదవడంతోనే తాతయ్య దుఃఖం వాస్తవం అవుతుంది.

× × ×

ప్రశాంత్ వాళ్ల అత్త కూతురు శైలజ ఈడైన వాళ్లూ... వరసైన వాళ్లూ... వాళ్ళ పెళ్లిని మా మామయ్య – పిన్ని ఎప్పుడో నిశ్చయించేశారు. వాళ్లు కూడా యిష్టపడ్డారు. కాబట్టి చదువైపోగానే పెళ్ళి చేసేడమే.. అనుకున్నారు.

కానీ – ఆ పెళ్లి అయ్యేలా లేదనీ... శైలజ... పిన్నీ యిష్టపడ్డం లేదని తెలిసింది. కారణం మా తాతయ్య దెయ్యం ప్రశాంత్‌ని పూనిందట! ఈ విషయం గురించి మా అమ్మని తుమ్మిడి రమ్మనడంతో తీసుకుని నేనూ బయలుదేరాను.

'అమెరికా వెళ్లి స్థిరపడిపోవలసిన ఇంజనీరు ఇండియాలో ఉండిపోవడమే కాదు. ఊళ్లో ఉండి వ్యవసాయం చేస్తాడంట. ఇదేవన్నా మతుండి మాట్లాడే మాటేనా... ఇంతోటి దానికి అన్ని లక్షలు పోసి ఇంజనీరింగెందుకు చదవడం! ఇలా పల్లెటూళ్లో బురద పిసుక్కునే వాడికి నా కూతుర్నెలా యిస్తాను! అని శైలజ వాళ్లమ్మ.

'నిజమే మరి... అయినా నాకు చదువబ్బక కదా ఈ వ్యవసాయంలోకి దిగాను. నీకేం ఖర్మరా.... మామయ్య.

ఇలా అందరూ ప్రశాంత్ మీద దాడికి దిగారు.

'అసలీ ఆలోచనెలా వచ్చిందిరా నీకు? నీతోటి కుర్రాళ్ళందరూ గొప్ప గొప్ప వాళ్లయి లక్షలూ కోట్లూ సంపాదిస్తుంటే నీకీ పిచ్చెలా పట్టింది' అని మా అమ్మ.

ప్రశాంత్ పేరుకు తగ్గట్లే ప్రశాంతంగా అన్నీ విన్నాడు. విని

"నా అమెరికాలు గిమెరికాలు వెళ్ళటం యిష్టం లేదు. అందుకని వెళ్లను" అన్నాడు.

"అదే... ఎందుకంటున్నారు?... దేశభక్తా..." అన్నాడు మామయ్య.

ప్రశాంత్ ఏమీ అన్లేదు.

"ఒకవేళ దేశభక్తే అయినా అక్కడికి వెళ్ళడానికేమిటి ఇబ్బంది? డబ్బు సంపాదించి దేశానికీ... ఈ వూరికీ కూడా ఏదైనా చేయొచ్చు కదా... ఎంతమందలా చేయడం లేదు?" పిన్ని.

చిన్నగా నవ్వుతూ అన్నాడు ప్రశాంత్

"దేశభక్తి... అలాంటి పెద్ద మాటలేమీ వాడక్కర్లేదత్తయ్యా... మనం అమెరికా వెళ్లి ఈ దేశాన్నుద్ధరించేంత దుస్థితిలో దేశంగానీ, వూరుగానీ లేవు. డబ్బుల కోసం అమెరికా వెళ్లి దానికి దేశభక్తి పేరు... నేను ఈ వూళ్లోనే ఉండాలనుకుంటున్నాను. వ్యవసాయం చేయాలనుకుంటున్నాను. అది నా కోరిక అంతే."

"నాన్న పూనాడ్రా వాడికి... అదే మొండితనం... అదే పిచ్చ" అంది ఆగ్రహంగా పిన్ని.

"పోనీ అసలలా ఎందుకనుకుంటున్నావ్ అది చెప్పు" మామయ్య.

"నాకు చిన్నప్పట్నించీ ఇదే యిష్టం నాన్నా.... చదువంటారా? చదువుకోమా?

ఇష్టమైంది చదివాను"

"మరా చదువుకి సార్థకత ఏదిరా? నువ్ చదివిందేమో కంప్యూటర్ కోర్సు....

చేస్తానంటున్నది వ్యవసాయం... ఏమన్నా పొంతనుందా?"

"లేదనుకో.... కానీ నష్టమేముంది?"

"నష్టమా.... నీ చదువుకి పదిహేను లక్షలు తగలేశాం... అదంతా నష్టం కాదా?"

"దాందేముంది డబ్బులు సంపాదిస్తాం.. ఎక్కడైతే ఏంటి?"

"అదుగో ఈ పిచ్చే వద్దనేది... అయినా అన్నయ్య వాడీ వూళ్లోనే ఉంటానంటే

నా కూతుర్ని మాత్రం చచ్చినా ఇవ్వను. ఈ పల్లెటూళ్లో మగ్గిపోవడానికి నా కూతురేం గతిలేంది కాదు. అది హోటల్ మేనేజ్‌మెంట్ చదివింది... ఊ.... అంటే బ్రహ్మాండమైన సంబంధం తేగల్ను... అంది పిన్ని.

"పల్లెటూళ్ళో మగ్గిపోయేదే ముందత్తయ్యా.... ఇక్కడా టీవీలున్నై... ఫ్రిజ్జులున్నై... కార్లున్నై.... మేడలున్నాయి... కూకట్‌పల్లి నుంచి కోఠీ కెంత దూరమో యిక్కణ్ణుంచి పట్నానికీ అంత దూరం. పెద్ద తేడా ఏముంది! పోనీ పొల్యూషనా... యిక్కడా పురుగుమందుల పొల్యూషనూ... చేపల చెరువుల పొల్యూషన్... అన్నీ వున్నై..." అన్నాడు కొంచెం వ్యంగ్యంగా. అని శైలజతో. "శైలూ... నేను సీరియస్‌గానే అంటున్నాను. అర్బన్ లైఫ్‌కీ రూరల్ లైఫ్‌కీ నువ్వూహించుకునేంత తేడా ఏమీ లేదు. మనసు పుట్టినప్పుడల్లా ఎక్కడికైనా వెళ్లచ్చు. కమ్యూనికేషన్స్. ట్రాన్స్‌పోర్టేషన్లు అన్నీ అందుబాటులోనే ఉన్నై. ఏంటి ప్రాబ్లెం?"



శైలజ ఏమీ మాట్లాడలేదు.

"అలా కాదురా పోనీ అమెరికా వెళ్లొద్దు... కానీ ఏదన్నా బాంబే... ఢిల్లీలాంటి చోటైతే నీకో గుర్తింపు ఉంటుంది. పల్లెటూళ్లో ఏంటి?" మామయ్య.

"అడిగావు కాబట్టి చెపుతున్నా నాన్నా... నేను ఈ వూళ్లో వుండి నువు చేసిన పద్ధతిలో వ్యవసాయం చేద్దామని కాదు. ఎరువులూ, పురుగుమందులూ చెత్తా చెదారం వేసి ప్రకృతి ఆహారాన్ని బయో ప్రొడక్ట్ చేశారు. దాన్నిండా ఫెస్టిసైడ్ అవశేషాలు... మనుషులు తినడానికి కాకుండా మార్కెట్లో అమ్మడానికి చేశారు వ్యవసాయం. నేను అలా చేయను. ఎరువులు, పురుగు మందులు లేకుండా పండించాలని అనుకుంటున్నా... అది నా ఆశయం" అన్నాడు.

అందరూ వాణ్ణి పిచ్చోడిని చూసినట్టు చూశారు.

మామయ్య అనేశాడు "నీకేమన్నా పిచ్చా... వెర్రా...."

"మనుష్యులు తినడానికి... అనేసరికి పిచ్చా... వెర్రా... ఏం చెప్పను" అన్నాడు వాడు.

"అదికాదురా యిప్పుడు మనుషులు కాక గొడ్లు తింటున్నాయా..."

"తింటున్నారు... తినక తప్పదు కదా! కాని దీనివల్ల ఎన్ని నష్టాలు నాన్నా... పురుగుమందుల ధాటికి నేలలో జీవులు నశించాయి. ఆకాశంలో పక్షులు చచ్చూరుకున్నాయి. జల్లుతూ జల్లుతూ మనుషులే చస్తున్నారు. చెట్లని నరికేశారు. ఎద్దులు నాశనమైపోయాయి. ఇలా ఎందుకు జరగాలి? కోతల మిషన్లొస్తున్నై... నూర్పిళ్ళ మిషన్లు... హెలికాప్టర్‌లలో మందులు జల్లే వ్యవసాయం... మనుషుల్ని జీవించడానికేనా... పక్షులూ... పశువులు అదృశ్యమై పోయినట్టు మనుషులు అదృశ్యమైపోతారా? క్రమంగా... సహజంగా... నీకు గుర్తుందా నాన్నా... ట్రాక్టరు కొన్నప్పుడు ఇంట్లో వేపచెట్టు... సపోటా... గన్నేరు... మామిడి... చెట్లన్నీ నరికించేశావు. నిజానికి పక్కనింకో గేటు పెట్టించి అట్నించి ట్రాక్టర్ని లోపలికి తీసుకురావచ్చు. కానీ నువ్వేం లెక్కేశావ్? ఆ చెట్లు నరికి వాటిని అమ్మి ఆ డబ్బుతో అక్కడ సిమెంట్ షెడ్డు వేయిస్తే ఖర్చు లేకపోగా లాభసాటిగా వుంటుందని నిజమే లాభసాటే. కాని చెట్లు ఉండాలనుకోలేదు. లాభమే ఉండాలనుకున్నావ్. ఆ చెట్ల మీద చిలకలు, పిచ్చుకలు పోయాయి. అవి ఉండాలనుకోలేదు. అసలు ఆ దృష్టే లేదు. లాభమా కాదా... లాభమా కాదా... లాభం కన్నా జీవితం ముఖ్యం. అందుకు నువ్వు పిచ్చోడన్నా, వెర్రోడన్నా అదే చేస్తాను. "ఉద్రేకంతో వాడి గొంతు కంపించింది. ముఖం అంతా కందగడ్డలా తయారైంది. కాసేపు ఆ ఉద్రేకాన్ని అణచుకొని.. కాని యింకా సన్నగా కంపిస్తున్న స్వరంతోనే శైలజతో అన్నాడు.

"శైలూ... నువ్వు నన్ను ప్రేమించావనుకుంటున్నాను. నా కంప్యూటర్ చదువునీ నేను వెళ్తానని నువ్వు మీరు అనుకున్న అమెరికాని ప్రేమిస్తే..." అని భుజాలెగరేసి.

"అయినా ఈ విషయాలు నీకు కొత్త కాదు. నేను అమెరికా వెళ్ళననీ, వ్యవసాయం చేస్తానని... యివన్నీ నీతో చాలాసార్లన్నాను. కానీ అవన్నీ సరదా కంటున్నానని నువ్వనుకున్నవ్. కాని ఇది నిజం. మీ అమ్మన్నట్టు నీకు అమెరికా కావాలంటే ఎవర్నయినా పెళ్ళి చేసుకోవచ్చు. కాని ప్రశాంత్ కావాలంటే ప్రశాంత్ నే పెళ్ళి చేసుకోవాలి... నీ యిష్టం."

*

---

## గది

### తంగెళ్ళపల్లి కనకాచారి



రాలిన ఆకులో, కదిలే కొమ్మలో
రెటీనాపై కదలాడ్తూనే వుంటాయి
వెనక్కి తన్నుకెళ్ళే దృశ్యాల్లా ప్రమాణంలోలా!
ఖండాలుగా ముక్కలైన రోజులో
పెదాల చివర దొర్లే పదాలూ అంతే!
అన్నీ విత్తనాలే, అంతా ప్రాణమే
దేహక్షేత్రంలో చొచ్చుకెళ్ళి మొలకెత్తుతాయి
వ్యూహాలు లేవు...
యుద్ధం జరుగుతూనే వుంటుంది
రెక్కలు తొడగక గది ఇరుకుల్లో
ఆత్మలు ఘోషిస్తూనే వుంటాయి

ఆత్మల్ని అణచిపెట్టి
గాజు కళ్ళల్లో ఏ భావమూ లేక
బుర్రని ఖాళీ చేసి మాటలు నాలుక చివర
విరిగిపడ్తుంటాయి...

ఆయుధాల్ని పదును పెడ్తూ...
ఇటుకల్ని పేర్చి
గుమ్మాల్ని కౌగిలించుకున్నపుడు
దృశ్యాలూ ఇంతే!
సమ్మేళనంలోనూ మూలకాలు
స్వభావాల్ని వీడనట్లు
ఉబుసుపోక మాటల్లోనూ
మనసు వ్యూహాలు నగ్నంగా నర్తిస్తాయి!
ఖైదీగా గదిని ప్రేమిస్తే
చరిత్రకు అందని బతుకులే మిగుల్తాయి!!

# ఇటీవలి తెలుగు కవిత్వం

**ప్రక్రియ ఏదైనా తెలుగు కవిత్వం నిత్య సజీవనంగా జ్వలిస్తుందని, అయితే ఇటీవల కొత్తగా కవిత్వ రంగం మీదికొచ్చిన కొత్త కవులను ఉద్దేశించి నందిని సిద్ధారెడ్డి, 'అలవోకగా రాయడం ఆరోగ్యకరమేనా?' అని మంచి ఆలోచనత్మాకమైన ప్రశ్నను మన ముందుంచారు. మరొక ప్రక్క గుడిపాటి మన కవులు నిరక్షరాస్యులేనా అని ఆసక్తికరమైన చర్చకు తెర లేపాడు. కవి కావాలన్న తపనలో ఇలాంటివి తప్పవు. నిగ్రహించుకున్న వాళ్ళు నిలబడతారు. లేనివాళ్ళను కాలమే జల్లెడ పడుతుంది.**

**శిఖామణి**

"తెలుగు భాషకు ప్రాచీన భాష హోదా" కల్పించాలని భాషాభిమానులూ, స్వచ్ఛంద సంస్థలు, విశ్వవిద్యాలయాలు ఒక పక్క ఉద్యమిస్తుండగా, తెలుగు భాష పట్ల దేశీయులలో అభిమానం ఆందోళన కలిగించే స్థాయిలో సన్నగిల్లుతోందనీ, ఇది యిలాగే కొనసాగితే తెలుగులో రాబోయే తరం రచయితలూ, పాఠకులు కూడా కనుమరుగై పోతారని భాషా విశ్లేషకులు హెచ్చరిస్తున్న నేపథ్యంలో సాహితీ స్రవంతి గోదావరి సాహిత్యశాల పేరుతో రాజమండ్రిలో నిర్వహిస్తున్న ఈ వర్క్‌షాపు చాలా ప్రాధాన్యతను సంతరించుకుంది.

తెలుగు భాష గురించి, దాని సాహిత్య భవిష్యత్తు గురించి మేధావులలో ఆందోళన ఒక పక్క మరీ అంత ఆందోళన చెందనవసరం లేదని తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలలో సాహిత్య గ్రంథాలు పుంఖానుపుంఖాలుగా వెలువడుతుండటం ఆరోగ్యకర పరిణామం. ఈ సందర్భంలో ఇటీవలి కవిత్వం గురించి విహంగ వీక్షణంగా చూడటం!

ఇటీవల దళిత, స్త్రీవాద ఉద్యమాలు కాస్త వెనకపట్టిన నేపథ్యంలో ముస్లింవాద సాహిత్యం, ప్రపంచీకరణ వ్యతిరేక సాహిత్యం, తెలంగాణా సాహిత్యం రంగం మీదకు వచ్చాయి. ఇటీవలి కాలంలో ముస్లింవాద సాహిత్యకారులు రెండు సాహిత్య గోష్ఠులను నిర్వహించి ముస్లిం వాద కవిత్వం, కథ, తత్వం మొదలైన అంశాల మీద గ్రంథాలను వెలువరించారు. షాజహానా నఖాబ్, స్కైబాబా జగ్ నౌకీ రాత్, ఖాజా "ముస్లిం వాద తాత్వికత, సిద్ధాంతం - సాహిత్యం షమీ ఉల్లా "మైనార్టీ కవిత్వం - తాత్విక నేపథ్యం, వతన్‌లాంటి కథా సంపుటాలు, అలావా వంటి ముస్లిం సంస్కృతి కవిత్వం తెలుగులో ముస్లింవాద చైతన్యాన్నీ తెలియచేస్తున్నాయి. 'ఇస్లాంవాదం' పేరుతో కరీముల్లా మరొక శిబిరాన్ని ప్రారంభించి 'సాయిబు' వంటి దీర్ఘకవితా, ఖిబ్లా వంటి సంకలనాలను వెలువరించాడు. ఇస్లాంవాదం ముస్లింవాదం మధ్య వాడిగా వేడిగా జరిగిన చర్చ ఖాజా వ్యాసంతో తారాస్థాయికి చేరింది. ''మతానికి సాయిబునైనా కులానికి దళితుణ్ణని నిర్ధారిస్తున్నాను" అని ఫత్వాలో ప్రకటించిన ఖాజా ఇటీవల తన సహచరి గురించి రాసిన ''వెన్నెల్లో మాలపిల్ల'' కవిత దళిత ముస్లింవాదాల దగ్గరితనానికి ప్రతీక. "ఏటి అగ్రహారాల ఓటి మాటల ముందు ఈ మాలపిల్ల / కంకరగుంట కంచుగంటై / ఖంగున నోరు విప్పినప్పుడు/ అంబేద్కర్ హాళ్లతో పాటు / ఆనం కళా కేంద్రాల విభూది నొసళ్ళు / ఆశ్చర్యాల పీఠముళ్ళు వేసుకున్నాయి" అని నేలను చీల్చుకొచ్చిన మొలకలాంటి ఆ పిల్ల ప్రతిభను ఆవిష్కరిస్తాడు. ప్రపంచీకరణ మబ్బులు తెలుగు సాహిత్యాన్ని పూర్తిగా కమ్మేశాయి. ఆ మబ్బులను విడగొట్టడానికి సీనియర్ కవుల నుండి నిన్న మొన్న కలం పట్టిన కవుల వరకూ తమ ప్రయత్నం తాము చేస్తూనే వున్నారు. ఇటీవలి కాలంలో ప్రపంచీకరణ దుష్ప్రభావాలను అత్యంత శక్తివంతంగా ఆవిష్కరించిన కవీ, ప్రపంచీకరణ వ్యతిరేక సాహిత్యానికి ఉద్యమ రూపం కల్పిస్తున్న కవి డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు. ఆయన ఇటీవలి కవితా సంపుటి 'పొగచూరిన ఆకాశం'లోని ప్రతీ కవితా ఆ నేపథ్యం నుండి వెలువడిందే! 'నా దేశంలోనే నే పరదేశిని' కవితలో 'వాడు చెట్టు కింద నించి నేలని లాగేస్తున్నాడు / వేళ్ళు కోసెయ్యడానికి కత్తిని ఝుళిపిస్తున్నాడు అని హెచ్చరిస్తున్నాడు.

ప్రపంచీకరణ వల్ల పోగొట్టుకున్న, పోగొట్టుకుంటున్న ప్రతీ సందర్భాన్ని, అనుభూతినీ, వస్తువునీ ఒక గొప్ప నాస్టాల్జియా పలికించడం ఈ కవిత్వంలోని గొప్పతనం. అది రేకు పెట్టో లేదా సందుకో కావచ్చు. విసనకర్రలు కావచ్చు, బైపాస్ రోడ్డు కావచ్చు. పునరావాసం కావచ్చు. "మెల్లగా దింపండి సందుక సొట్టపడేను / చదువంటారా అది నా అనుభవాల రాశి" అంటూ 'రేకుపెట్టె' గురించి డాక్టర్ ఎన్. గోపి తలపోస్తారు. నిజమే మనిషి పల్లె నుండి పట్నం దాకా జరిగిన ఈ పరిణామ క్రమంలో ఆ తాటాకు పెట్టె, ఆ రేకు పెట్టె, ఆ చెక్క భోషాణం పెట్టె ఎన్ని మార్పులకు గురైందో. ఇదే వస్తువు తీసుకుని అన్నవరం దేవేందర్, మసన చెన్నప్పలు సందుక పేర్లతో కవితలు వెలువరించారు. కలల కల్లోల మేఘం కవి నారాయణస్వామి ఆ మధ్య హఠాత్తుగా అమెరికా నుండి ఎగిరి వచ్చి 'సందుక' పేరుతో తన కవితల పుస్తకాన్ని ఆవిష్కరించుకుని వెళ్ళాడు. పల్లెల్లో కూడా ఎ.సి.లు, కూలర్లు, ఫ్యానులు వచ్చేసిన కాలం. ఇక తాటాకు విసనకర్రల గురించి చెప్పాలా? ఇదిగో అలాంటి విస్మృత వస్తువును తీసుకొని కవిత్వాన్ని పండించాడు. ఎండ్లూరి సుధాకర్ విసనకర్ర కవితలో "అన్నం ఆరాలన్నా! పొగరుబోతు నాన్నల పొగల సెగల చల్లారాలన్నా / ఎంతకీ ఏడుపాపని ఎండాకాలపు బిడ్డ / హాయిగా బజ్జోవాలన్నా/ చల్లనిగాలి మందు బిళ్లలు ఈ విసనకర్రలే" అంటాడు. అలాంటివి పెద్ద బంగ్లాలో ఖరీదయిన నగర జీవితాల్లో చూద్దామన్న చిన్న విసనకర్ర కనబడదు అని ఆవేదన చెందేవాడు. ఇది వేద భూమి కాదు నాగభూమి అని నాగమ్మ ప్రతీ వన కులగీతలో నిరూపించారు.

ప్రకృతిని తాత్వికంగా వ్యాఖ్యానిస్తున్నాడు కత్తి భూపాలరావు. అభివృద్ధి పేరుతో ప్రాజెక్టులు వస్తాయి. ప్రాజెక్టుల వలన ఆవాస ప్రాంతాలు ముంపుకు గురవుతాయి. వారికి పునరావాసం కల్పించాలి! గత యాభై ఏళ్ళుగా ఇంకా పూర్తి కాని పునరావాస పురాగాథలు ఎన్నో. అటువంటి దయనీయ స్థితికి కవిత్వ రూపం ఇచ్చాడు 'పునరావాసం' కవితలో అరసవిల్లి కృష్ణ. ఈ వాక్యాలు చూడండి. "1969 మే నెల మొదటివారం / నానమ్మ పంచాతిలో నులక పేనుతుంది / సాయంకాలం వేళ / నాన్న కన్నీటి స్వరంతో చెబుతున్నాడు / గోస్తనీ నదిపై కొత్త బ్రిడ్జికి సర్వే జరుగుతుందని / అమ్మ వంటింట్లో అగ్గి రాజేస్తోంది / రెండవ తరగతి తెలుగు

వాచకంలోని / అందమైన ఇంటి వంక ఆశ్చర్యంగా చూస్తున్నాడు / నాలుగు హృదయాలు దుఃఖ సవ్వడి వినిపిస్తోంది" అక్కడి నుండి కవి 2006 పునరావాసం వరకూ వస్తాడు. పొలం పోగొట్టుకుని, ఇల్లు పోగొట్టుకుని రోజు కూలీలుగా మారిన దైన్యాన్ని చెబుతుందీ కవిత.

హైకూ కవిగా ప్రఖ్యాతి గాంచిన బి.వి.వి. ప్రసాద్ తన సరికొత్త కవితా సంపుటి "నేనే ఈ క్షణం"లో 'మహిమ' గురించి రాస్తూ "మానవాళిని ప్రేమించి మనిషి కలగంటాడు / ఏదైనా మహిమ వలన మానవ జీవితం మరింత కాంతివంతం కావాలని / అతనికి యుద్ధం ఒక మహిమ / విప్లవం ఒక మహిమ / సంస్కరణ ఒక మహిమ. ఉద్యమ జీవితం నుండి కవిగా ఎదిగి వచ్చి ఇటీవలే 'నలుదిక్కుల నుంచీ రండి' అని పిలుస్తున్న జె. గౌతమ్. "కనుపాపల్ని కాల్చేస్తూ కవి వస్తున్న కాలం / పక్కటెముకల్నీ విరిచి పరిహసిస్తున్న పాలన / స్వర్ణోత్సవ సంబరాల్లో మా నెత్తుటి శవలే తోరణాలు / మళ్ళీ మళ్ళీ అడుగుతున్నాం మాకొక దేశమంటూ వుందా!'' అని ప్రశ్నిస్తున్నాడు. ఒక జననం ఒక మరణంలో గుడిహాళం రఘునాథం అవును, రాయాలి అంటున్నాడు. "ఒక బ్రహ్మరాక్షసి చిన్న గ్రామ దేవతను కబళించినందుకు తైల వ్యాపారం కోసం మానవతకు తిలలు వదిలినందుకు, అధికారానికి జెండాలు జెండాలు పోట్లాడుకుంటున్నందుకు / జగత్తుకు విపత్తు / రావాలి అంటాడు. కిటికీ తెరిచిన తర్వాత, ఒక పాత పుస్తకంలో కొత్త జీవితం ప్రారంభిస్తానంటాడు రామచంద్రమౌళి. '

జీవితం ఒక ఉద్యమం'గా జీవిస్తున్న డాక్టర్ ఎస్.వి. సత్యనారాయణ "ప్రతీ మట్టి రేణువులో నా రక్త కణాల ప్రతిధ్వనులున్న" ఆ గోడల్ని కూలగొట్టిందంటు న్నాడు. అవి తన అనుభవాల జాడలుగా, మూలాల మేడలుగా అభివర్ణిస్తాడు. కాలంతో కలిసి నడిచి అవిశ్రాంత కవి డాక్టర్ సి. నారాయణరెడ్డి తనతో కలిసి నడిచే కలాన్ని తుదిదాకా విడిచిపెట్టేది లేదంటున్నారు. పీపుల్స్ వార్ రాష్ట్ర కార్యదర్శి మాధవ్ ఎన్‌కౌంటర్ తరువాత కె. శివారెడ్డిగారు రాసిన 'విరిగి పోకుండా' కవితలో విరిగిపోకుండా నిలబడాల్సిన సమయము ఇదే / నాలుగడుగులు ముందుకు వేయాల్సిన సమయము ఇదే / జమ్మిచెట్టు మీంచి ఆయుధాలు దించాల్సిన సమయమూ ఇదే" అని ఉద్యమం తలవంచకూడదని ఆకాంక్షిస్తారు.

చెట్టు కవి ఇస్మాయిల్ మరణం ఎందరి చేత కవితలు రాయించింది. దేవీప్రియ తన 'చేప చిలుక'లో చివరికి చెట్టు కూడా ఎగిరిపోవలసిందే అంటూ "గొంతు పోగొట్టు కున్నాక మీరు / పంచవన్నెల రామచిలకలాగే కనిపించినారు / చిట్టచివరి పాదంలో కూడా మీకు / చిటారుకొమ్మలాగే ఊగిపోయారు. అని ఇస్మాయిల్ నిలువెత్తు వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించారు. స్త్రీవాద కవిత్వంలో దళిత దృక్కోణాన్ని ప్రథమంగా ఎత్తి చూపిన చల్లపల్లి స్వరూపరాణి 'మంకెనపూవు' వారసత్వం ఇంకా శతపత్రాలుగా విచ్చుకోవాల్సిన అవసరమూ వుంది. డాక్టర్ రూప్‌కుమార్ దచ్చీకొర్ తన 'స్వప్న శబ్దం'లో యాది మర్చితి బిడ్డా యాడుంది తెలంగాణా" అని ప్రశ్నిస్తూ చెర్వు గట్టు మీద పాలపిట్ట యాడుంది / బతుకమ్మ సొగసులకు తెల్లపోయి యాడుంది/ పిల్లదాని పెండ్లికి 'ఐరేని' యాడుంది అని ప్రశ్నిస్తూ తెలంగాణా మట్టిలోన మన బతుకు నాడుదాం / మన భాష, మన యాస, మన ఆస్తి, మన అస్థిత్వం, నిలుపుదాం అని ప్రతినబూనుతాడు. పలవరింత, కలవరింత, మహా పులకరింత తెలంగాణా అని తాదాత్మ్యం ప్రకటిస్తున్నాడు ముండ్లకర్రలో జో.గే. ఇన్ని సంఘర్షణల మధ్య తెలుగు కవి మానవ సంబంధాలను మర్చిపోలేదు. శిలాలోలిత తన సహచరుడు యాకూబ్ గురించి "సుక్క పొద్దు" కవితలో "నాజీ కవులు, సజీవ కవులు, సహజీవనము అతడే అని రాస్తే దాట్ల దేవదానం రాజు తోడు దీపం కవితలో అరికి ముగ్గెట్టిన అంతరంగం ఆమెది, కాలంలో సాగే ఏకాంతపు తోడు ఆమె అంటాడు. గొడుగులు బాగు చేసే వాణ్ణి చూసి "విరిగిపోయిన ఈ మనుషుల్ని, వికలమైపోయిన ఈ మనుషుల్నీ బాగుచేసేవాడు కూడా ఒకడుంటే ఎంత బాగుండునో కదా'' అని ఆశపడతాడు. శిఖామణి నల్లగేటూ నందివర్ధనం చెట్టు సంపుటిలో ఇన్నాళ్ళు కవిత్వ నేపథ్యంగా వుండిపోయిన ఎ. అరుణ మౌనమూ మాట్లాడుతుంది, పాటల చెట్టు, గుప్పెడు గింజలు కావ్యాలతో కవిగా ముందుకొచ్చాడు.

అందరి కవుల రచనలను ఈ పరిధిలో ప్రస్తావించడం కుదరదు కనుక ప్రస్తావనకు రాని కవులకు వేడికోలు. తెలుగులో ప్రముఖ దినపత్రికలన్నీ కవిత్వాన్ని ఆదరిస్తూనే వున్నాయి. అరుణతార, భూమిక, పత్రిక, చినుకు, నేటి నిజం, నడుస్తున్న చరిత్ర, చైతన్య కవిత వంటి పత్రికలు కవిత్వాన్ని విరివిగా ప్రచురిస్తున్నాయి. కవులు సొంతంగా సంపుటాలు వెలువరిస్తున్నాయి. మత్తడి, పొక్కిలి వంటి తెలంగాణా కవిత్వం, వెంటాడే కలాలు, నల్ల మూక్డు వంటి బహుజన, దళిత సంపుటాలు, జనకవనం, కలాలు – గళాలు, గోదారి వంటి సంకలనాలు వెలువడు తున్నాయి. ఎక్స్‌రే పత్రిక రజతోత్సవాల సందర్భంగా 'జీవనోత్సాహం' పేరుతో పాతిక సంవత్సరాల అవార్డు కవితల సంకలనం ప్రచురించింది. రావి రంగారావు వెయ్యి నూటపదహార్ల పేరుతో మినీ కవితా సంకలనం తెచ్చారు. అశోక్‌కుమార్ శతఘ్ని పేరుతో సంకలనం తెస్తున్నారు. ఎస్వీ పెన్నాల సంపాదకత్వంలో విశాలాంధ్రవారి బృహత్ సంకలనం రాబోతోంది. మరొక ప్రక్క నానీలు యిబ్బడి ముబ్బడిగా దిగుమతి అవుతూనే వున్నాయి. ఫ్రీ వర్స్ ఫ్రంట్, తెలుగు విశ్వవిద్యాలయం రంజని కుందుర్తి ఆటా, సుశీలా నారాయణరెడ్డి ట్రస్టు, సాహితీ గౌతమి, సృహదయ సాహితీ, ఉమ్మడిశెట్టి, గరికపాటి, శాంతినారాయణ వంటి వారు కవిత్వానికి అవార్డు లిచ్చి ప్రోత్సహిస్తున్నారు. తెలుగు పద్యమూ మధ్యలో నేనున్నానంటూ అప్పుడప్పుడు ముందుకొస్తోంది. సంప్రదాయాభిమానులు పద్యం మీద ఈగ వాలనీయడం లేదు.

ప్రక్రియ ఏదైనా తెలుగు కవిత్వం నిత్య సజీవనంగా జ్వలిస్తుందనడానికి పై మాటలు చాలు. అయితే ఇటీవల కొత్తగా కవిత్వ రంగం మీదికొచ్చిన కొత్త కవులను ఉద్దేశించి నందిని సిద్దారెడ్డి, 'అలవోకగా రాయడం ఆరోగ్యకరమేనా?' అని మంచి ఆలోచనత్మాకమైన ప్రశ్నను మన ముందుంచారు. మరొక ప్రక్క గుడిపాటి మన కవులు నిరక్షరాస్యులేనా అని ఆసక్తికరమైన చర్చకు తెర లేపాడు. కవి కావాలన్న తపనలో ఇలాంటివి తప్పవు. నిగ్రహించుకున్న వాళ్ళు నిలబడతారు. లేనివాళ్ళను కాలమే జల్లెడ పడుతుంది. ఎన్. అరుణ, సుమతీ నరేంద్ర, రేణుక అయోల, కనుమూరి జాన్‌హైడ్, శైలజా మిత్ర, జె. సుభద్ర, ఎల్.కె. సుధాకర్, బెల్లి యాదయ్య, తుమ్మల దేవరావ్, తుల్లిమల్లి విల్సన్ సుధాకర్, సంపతి సోమయ్య, అన్వర్, నూటెంక రవీంద్ర, కారం శంకర్, సూర్య ప్రసాదరావు, కడలి రాధాకృష్ణ, వై. శ్రీరాములు, మంచాల శ్రీనివాసులు, పాలపర్తి జ్యోతిష్మతి, సంగెనేని రవీంద్ర, సబ్బని లక్ష్మీనారాయణ, కోయి కోటేశ్వరరావు, కత్తుల కిశోర్‌కుమార్, ఇలా చెప్పుకు పోతుంటే ఈ జాబితా అనంతం. ఎన్ని ఉద్యమాలు నడిచినా – ఎన్ని వైరుధ్యాలు వున్నా తెలుగు కవిత చిరంజీవి.

**(సెప్టెంబర్ 2, 3 తేదీలలో సాహితీ స్రవంతి రాజమండ్రిలో నిర్వహించిన 'గోదావరి సాహిత్యశాల'లో సమర్పించిన ప్రసంగ వ్యాసం)**

# మరో యజ్ఞం కోసం...



'యజ్ఞం' కథకు నేపథ్యం శ్రీకాకుళం జిల్లా! కథ రాసిన ఐదు సంవత్సరాల తర్వాత అక్కడి గిరిజన, రైతాంగ ఉద్యమం సాయుధ తిరుగుబాటుగా ప్రజ్వరిల్లింది. ఇది వేరొక "యజ్ఞం"లా నేటికీ కొనసాగుతోంది. ఈ చరిత్రను అక్షరబద్ధం గావిస్తూ 2001లో "యజ్ఞం తర్వాత..." కథగా మలిచింది అట్టాడ అప్పల్నాయుడు.

యజ్ఞం కథలోని పాత్రలు యజ్ఞం తర్వాత ఏమైనాయి? ఈనాడు వేల సంఖ్యలో ఆత్మహత్యలకు పాల్పడవలసిన దురవస్థను కల్పించిన మార్కెట్టికానమీ యొక్క ఆర్థిక పరిణామాలు, "పులుల మందను పుల్లలతో పొడిచే రాజకీయ ఉద్యమాలు... మరింత రక్తం... మరెన్నో త్యాగాలు... వాటి ఫలితాలు పర్యవసానాలు. ఇవీ "అప్పల్నాయుడి" కథాంశాలు.

**దివి కుమార్**

**ప్రయోక్త :** ఈ సభకు విచ్చేసిన సాహితీ ప్రియులందరికీ నమస్కారాలు.

తెలుగు సాహిత్య చరిత్రలో కాళీపట్నం రామారావు మాస్టారు, 1964లో రచించిన "యజ్ఞం" కథకున్న విశిష్టత, ప్రాముఖ్యత మీకు తెలుసు. ఆ కథలో నాయక ప్రతినాయకుల్లాంటి రెండు ముఖ్య పాత్రలున్నాయి.

**మొదటి పాత్ర :** అప్పల్రాముడు. పేద రైతు. హరిజనుడు. ఆహార ధాన్యాల పంటల ఉత్పత్తి నొదిలి వ్యాపార పంటలకు రైతాంగం మళ్ళిన ఫలితంగా మార్కెట్ జూదంలో వారు ఘోరంగా ఓడిపోయారు. అప్పులపాలై భూమిని కోల్పోయి పాలేరుగా దిగజారిపోయే సామాజిక క్రమాన్ని 'యజ్ఞం' కథలో వివరించే పాత్రే అప్పల్రాముడు.

**రెండవ పాత్ర :** శ్రీరాములు నాయుడు. ఈయన స్వాతంత్ర్యానంతర పరిపాలకులలో ఉత్తములకు ప్రతీక. గాంధేయవాది పంచాయతీ సర్పంచిగా గ్రామభ్యుదయమనే 'యజ్ఞం' శ్రీరాములునాయుడు చేస్తే... అందులో సమిధలైపోయింది పేద, బడుగు వర్గాలు. ఆ 'యజ్ఞ' ఫలాల్ని మెక్కింది భూస్వామ్య, నూతన సంపన్నవర్గాలు.

**జ్ఞాపకం పెట్టుకోవలసిన మరొకపాత్ర :** అప్పల్రాముని ఆఖరి కొడుకు సీతారాముడు. శ్రీరాములు నాయుని రూపంలో పాలకవర్గాలు చేసిన 'యజ్ఞం' వల్ల, భవిష్యత్తరాల పేద రైతాంగపు జీవితం బీభత్సమై మరణమే శరణ్యంగా మారిపోతుందని సీతారాముని పాత్ర ద్వారా ఎంతో నాటకీయ హెచ్చరికతో ముగుస్తుందీ "యజ్ఞం" కథ.

కానీ జీవితం అనంతంగా సాగుతూనే ఉంది. 'యజ్ఞం' కథకు నేపథ్యం శ్రీకాకుళం జిల్లా! కథ రాసిన ఐదు సంవత్సరాల తర్వాత అక్కడి గిరిజన, రైతాంగ ఉద్యమం సాయుధ తిరుగుబాటుగా ప్రజ్వరిల్లింది. ఇది వేరొక "యజ్ఞం"లా నేటికీ కొనసాగుతోంది. ఈ చరిత్రను అక్షరబద్ధం గావిస్తూ 2001లో "యజ్ఞం తర్వాత..." కథగా మలిచింది అట్టాడ అప్పల్నాయుడు.

యజ్ఞం కథలోని పాత్రలు యజ్ఞం తర్వాత ఏమైనాయి? ఈనాడు వేల సంఖ్యలో ఆత్మహత్యలకు పాల్పడవలసిన దురవస్థను కల్పించిన మార్కెట్టికానమీ యొక్క ఆర్థిక పరిణామాలు, "పులుల మందను పుల్లలతో పొడిచే రాజకీయ ఉద్యమాలు... మరింత రక్తం... మరెన్నో త్యాగాలు... వాటి ఫలితాలు పర్యవసానాలు. ఇవీ "అప్పల్నాయుడి" కథాంశాలు.

ఇక ఈ దృశ్య సన్నివేశం విషయానికొస్తే... ఒక రచయిత తన పాత్రను సజీవం చేసి మన ముందుకు తీసుకువస్తే ఆ రచయితతో అతని పాత్ర యొక్క సంభాషణ ఎలా ఉంటుంది? సాహితీ లోకం తనను అర్థం చేసుకొన్న తీరుపై ఆ పాత్ర ప్రతిస్పందన ఎలా ఉంటుంది? రెండు కథల్లోనూ కొనసాగిన పాత్రయిన శ్రీరాములు నాయుడూ, ఆ పాత్ర తొలి సృష్టికర్త కాళీపట్నం రామారావు మాస్టారు సంభాషించటమెలా వుంటుంది. ఈ ఊహకు దృశ్యరూపమే మీరు చూడబోయే ప్రదర్శన! యజ్ఞం కథ : దానిపై జరిగిన చర్చ నేపథ్యం నుండి "యజ్ఞం తర్వాత..." కథపై చర్చనాశిస్తూ "మరో యజ్ఞం కోసం..." అనే సాహిత్య రూపకం మీ ముందు ప్రదర్శిస్తున్నాం.

(స్టేజి మీద 70 ఏళ్ళకు పైబడిన, జుట్టూ, మీసాలు తెల్లబడిన శ్రీరాములు నాయుడు పాత మంచం మీద పడుకునో లేక కుర్చీలో కూర్చునో నిద్రపోతూ వుంటాడు. చేతిలో "కథా యజ్ఞం" పుస్తకం ఉండాలి.

బయట నుండి రామారావు మాస్టారు వస్తారు. సంచిలో అప్పల్నాయుడి కొత్త కథల పుస్తకం ఉంటుంది)

**మాస్టారు :** శ్రీరాములు నాయుడూ... ఇదిగో నాయుడూ నిన్నే... ఎంత కాలమయ్యా ఈ నిద్ర... అసలిది ఉత్త నిద్రేనా లేక శాశ్వత నిద్రా... ఎన్నిసార్లీ సుందరపాలెం చుట్టూ ఆలోచనా యాత్రలు చేసినా నిద్రే... నిద్ర... అది నిద్రో, మౌనమో, సమాధి స్థితో అర్థం కాదు. ఈ శ్రీరాములు నాయుడ్ని ఎట్లా లేపాలబ్బా? (సంచిలో నుండి పుస్తకం తీసి... అట్టను ప్రేక్షకులకు చూపి, శ్రీ.నా. ముఖం ముందు ఆడించేసరికి శ్రీరాములు నాయుడు కళ్ళు నులుపుకుంటూ నిద్రలేచి వళ్ళు విదుల్చుకొని)

**శ్రీ.నా. :** అబ్బ ఎంత నిద్ర పట్టిందీ? ఎవరూ? ఎవరండీ మీరు...

**మాస్టారు :** నన్నే మర్చిపోయావా శ్రీరాములు నాయుడూ? నీకొక వ్యక్తిత్వాన్నీ, గుర్తింపునీ, గౌరవాన్నీ యిచ్చినవాడ్ని. నీకు జన్మనిచ్చిన

వాడినయ్యా! కాళీపట్నం రామారావు మాష్టార్ని!

**శ్రీ.నా.** : నమస్కారం మాస్టారు! నిద్రమత్తులో గ్రహించలేకపోయాను. రామాయణంలో ఊర్మిళది 14 సంవత్సరాల నిద్రయితే నాకు 20 సంవత్సరాలుగా నిద్రే నిద్ర. అడవిలో సీతమ్మ వారిని ఆ వాల్మీకి ఆదుకున్నట్లు తమరు స్వయంగా మా యింటికొచ్చి మరీ నిద్రలేపారు. మీ రుణం తీర్చుకోలేను మాష్టారు!

**మాష్టారు** : నేను కాదయ్యా నిన్ను నిద్ర లేపింది... మా శిష్యుడు... అప్పల్నాయుడు... ఆనాడు నువు యజ్ఞం చేశావు. తర్వాత జరిగిన వేరొక యజ్ఞం గురించి అప్పల్నాయుడు రాశాడు... నిన్ను నిద్రలేపాడు.

**శ్రీ.నా.** : అయ్యా! ఎందుకు మళ్ళీ బతికించినట్టు? అయినా మీ రచయితలకు అదొక సరదా అనుకుంటా... మమ్మల్ని సృష్టించడం మీకొక క్రీడ. మీ యిష్టం వచ్చినట్టు మెలికలు, మలుపులు తిప్పి పాత్రల్ని ఆడిస్తారు. మీకంటే కనబడని ఆ దేవుడే నయం. ప్రాణం పోసి పక్కకు తప్పుకుంటాడు... మీరట్టాకాదు... మమ్మల్ని కీలుబొమ్మల్ని చేసి ఆడిస్తారు... వద్దు మాష్టారు... నాకీ పునర్జన్మా వద్దు... మీ బొమ్మలాటా వద్దు... మా నిద్ర మమ్మల్ని పోనివ్వండి... (కుర్చీలో కెళ్ళి కూచుండిపోతాడు).

**మాష్టారు** : ఆగవయ్యా శ్రీరాములు నాయుడూ! చూడు.

రచయితంటే ఎవరను కుంటున్నావ్? సామాజిక చరిత్రకారుడయ్యా! జీవిత సత్యాలను, సౌందర్యాలను ఆవిష్కరించి, మానవ సంబంధాల చిక్కుముడుల్ని అర్థం చేయించి అర్థవంతమైన ఆలోచనలను రేకెత్తించి మూడోకంటిని తెరిపించే సూత్రాల్నీ, సులువుల్నీ నేర్పే తాత్వికుడయ్యా! రచయితలు మనో ప్రపంచ నిర్మాతలు. మరణించిన వారిని కూడా బతికించగల పునః సృష్టికర్తలు... ఇదిగో శ్రీరాములు నాయుడూ! నీ ప్రాణం, ఈ యజ్ఞం తర్వాత... కథలో కొచ్చింది. నిద్రమత్తు వదిలించుకుని ఈ లోకంలోకి రా!

**శ్రీ.నా.** : మాస్టారూ... నిద్రపోయావు. నిద్రపోయావు. అంటున్నారే గాని ఒక్క క్షణమన్నా ప్రశాంతంగా నిద్రపోనిచ్చారండీ నన్ను? అన్నీ భయంకరమైన పీడకలలే. యజ్ఞగుండంలో నేను వంపుతున్నది నెయ్యి కాదు. నెత్తురు... మానవ రక్తం... అందులో సమిధలు పసిపిల్లల తలలు, మొండాలు. ప్రయోగం చేతకాని శాస్త్రజ్ఞుడు ప్రయోగశాలనే భస్మం చేసినట్లు... ఎంతో సుందరంగా తీర్చిదిద్దుదామనుకున్న సుందరపాలెంలో జరిగిందేమిటి? గాంధీ కంపెనీ వారి అహింసా మార్కు నెయ్యి వేస్తే దగ్ధ యాగం జరిగిందేమిటి?

**మాష్టారు** : ఇదిగో శ్రీరాములు నాయుడూ! భవిష్యత్ పరిణామాల భయంకర స్వరూపాన్ని ఈ సమాజపు మొహం మీద గుద్ది చెప్పటానికి... ఒక్క పసిబాలుడ్ని నేను చంపించిన మాట నిజమే! కలిమి లేముల్ని కాపాడి పెంచి పోషించే ఈ వ్యవస్థ వల్ల భవిష్యత్తరాల జీవితం రక్తంలో పొర్లాడే తలలు, మొండాల్లా వుంటుందనీ హత్యలూ, ఆత్మహత్యల మయమవుతుందనీ చెప్పటానికే అలా చేశాను. బాహ్య సత్యానికి అంతః సత్యానికీ గల తేడాను గ్రహించలేని కొందరు నిన్ను, నన్ను కూడా అపార్థం చేసుకున్నారు.

**శ్రీ.నా.** : మాస్టారూ నన్ను మాత్రం, మీరు ఎన్నిసార్లు చంపలేదు? నేను చేసిన యజ్ఞమంతా కలిగిన వారి కండలు ఇంకా బలిపించటానికేనని అప్పల్నాయుడు తేల్చేసినపుడు నేను మొదటిసారి చచ్చిపోయాను. ఆ అప్పల్రాముడి కొడుకు సీతారాముడు, భూమి అమ్మక పత్రంపై సంతకం పెట్టకుండా, తన 3 ఏళ్ళ కొడుకుని చంపి, తెగిన తలను మొండాన్ని రక్తధారలతో నేలమీద దబ్బున వదేసినపుడు బిక్కచచ్చిపోయాను... నన్ను సరిగా అర్థం చేసుకోలేని సాహితీ విమర్శకులు కొందరు నేను కపటిననీ, మోసగాడిననీ తమ కలాలతో నా గుండెల్లో పొడిచిన ప్రతిసారీ చస్తూ... బతుకుతూనే ఉన్నాను.

**మాష్టారు** : నీది సామాజిక యజ్ఞమైతే మాది పెరుగును చిలికి వెన్నను తీసే సాహితీ యజ్ఞం... కథా యజ్ఞం.

**శ్రీ.నా.** : మాస్టారూ! నేను గాంధీయిజాన్ని నిజాయితీగా నమ్మాను. దాన్ని పాటించడానికే ప్రయత్నించాను గానీ నటించడానికి కాదు. ఆనాటికి నేను నమ్మిన గాంధీయిజం సంపన్నులను కాపాడటానికి నేను వేసుకున్న ముసుగు అనుకున్న కొందరు విమర్శకులు నా నిజాయితీలో నిజం లేదని తేల్చారు. ఏవేవో గీతలు గీశారు. రాతలు రాశారు. పదే పదే నాపై దాడి చేశారు. సరే! జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు యజ్ఞం తర్వాత కథ రాసినాయన మీ శిష్యుడంటున్నారే... ఆయన పేరేంటి?... అప్పల్నాయుడు... ఆ మహానుభావుడేం రాశారో?

**మాష్టారు** : ఏది రాసినా 20 ఏళ్ళ నుండి నిద్రకుబడ్డ నిన్ను లేపాడా లేదా? నిన్ను ప్రత్యేకంగా విమర్శించలేదుగానీ... విశ్లేషించాడు... విడమరిచి ఇలా చెప్పాడు (పుస్తకం తెరిచి చేతికిస్తాడు).

"శ్రీరాములు నాయుడు ఆర్థికాతీత రాజకీయాలుంటాయనుకున్నాడు. అప్పల్రాముడు రాజకీయాతీత జీవితం వుంటుందనుకున్నాడు. ఇద్దరివీ ఇరుపక్షాలకు చెందిన రెండు అమాయక అజ్ఞాన జీవితాలు."

**శ్రీ.నా.** : మాస్టారూ... అప్పల్రాముడి కుటుంబం చీకి చిరుగుల పాలవటానికి నా కీర్తికండూతి కూడా ఒక కారణమే. అప్పల్రాముడికి ఒక్కసారైన క్షమాపణ చెప్పాలనుంది మాస్టారూ... నిద్రపోయిన నిన్ను లేపినట్టే... అప్పల్రాముడ్ని ఒక్కసారి పిలిపించండి. క్షమాపణ చెప్పుకుంటాను.

**మస్టారు** : (నవ్వి) క్షమాపణా! కథను రబ్బరు ముక్కలా మెలికలు తిప్పటానికి యిది టి.వి. సీరియల్ కాదు నాయనా! తన వెలుపల వున్న జీవిత గమనాన్నీ, గమ్యాన్నీ రచయిత సున్నితంగా అనుసరించాల్సిందేగాని, తన మనోవికారాలన్నీ పాత్రలపై రుద్దే హక్కు... అధికారం అతనికి లేవు.

ఇక క్షమాపణలంటావా? క్షమాపణలతో చరిత్ర దిద్దుబాటు కాదు... అంటున్నాడు మన అప్పల్నాయుడు.

**శ్రీ.నా.** : మాస్టారూ! ఇన్ని రాసిన వాళ్ళు క్షమాపణ చెప్పుకునే అవకాశం యిప్పించలేరా మాస్టారూ?

# సమర్పణ

డాక్టర్ దేవరాజు మహారాజు

ప్రాతఃకాలంలో పక్షుల కిలకిలా రవాలు విను
అవి ఎవరి కోసమూ ప్రత్యేకంగా పాడటం లేదు
ఎవరైనా వింటున్నారా లేదా అనేది కూడా అవి పట్టించుకోవు
ఊరకే పాడతాయి అది తమ బాధ్యత అయినట్లు
తమ దగ్గరున్నది రాళ్ళకు చెట్లకు మనుషులకు పంచుతాయి
ఈ స్తబ్ధ ప్రపంచాన్ని ఓ శబ్దంతో నిద్రలేపుతాయి
బదులుగా అవేమీ కోరుకోవు
చల్లగాలి, పూలు, నదులు, సముద్రాలు
భూమి, చెట్లు వర్షం ఆకాశం
ప్రకృతిలోని ఏ భాగమైనా సరే
ఇవ్వడం తప్ప ఆశించడం వాటికి చేతకాదు
ఈ భూమి మీద సంచరించే ఒకే ఒక ప్రాణి మానవుడికి మాత్రం
ఆశించడం తప్ప మనస్ఫూర్తిగా ఇవ్వడం ఏమాత్రం వీలుకాదు
మేధస్సుతో, హృదయంతో తన ప్రతి అవయవంతో
వాడు వ్యాపారం చేయగలడు
ప్రతి దాన్నీ డాలరుగా అనువదించగల మహా అనువాదకుడు
అయితేనేం అన్నీ ఉండి ఏమీ లేని నిత్య నూతన యాచకుడు
బస్సుల్లో, విమానాల్లో అన్ని మతాల పుణ్యక్షేత్రాల్లో
గుంపులు గుంపులుగా బడా ఛోటా వ్యాపారస్తులే కదా?
ఈతాకు వేసి తాటాకు లాగాలనుకునే వాళ్ళే కదా?
ఎర చూపి, గాలాలు విసిరే వాళ్ళే కదా?
ఏమీ ఆశించని వాడికి ఏ ఆర్భాటమూ ఉండదు
ఒక నిశ్చల ప్రపంచం తప్ప ఒక స్వార్థ రహిత సమర్పణం తప్ప
కాలానికి ప్రకృతికి, సమాజానికి ఒక ధ్యేయానికి
తనను తాను అర్పించుకునే వాడు మాత్రమే
తనను తాను అంకితం చేసుకునే వాడు మాత్రమే
అజేయంగా నిలబడతాడు!
మానవత్వానికి ఉదాహరణ అవుతాడు

---

**మాస్టారు** : లేదు! నగకు అతుకు పెట్టాలన్నా దాన్ని పుటం పెట్టాల్సిందే... చరిత్రకు పుట మొక్కటే చాలదు కొత్త చరిత్రను సృష్టించటమే దానికి పరిష్కారమని అప్పల్నాయుడు చెపుతున్నాడు. క్షమాపణలు, కన్నీళ్ళు చరిత్ర సృష్టికి సాటిరావు. పాత పొరపాట్లు తిరిగి చేయకుండా ఉండటానికీ గత అనుభవాల నుండి నేర్చుకోవటానికే చరిత్ర కావాలి. చరిత్ర కావాలి.

**శ్రీ.నా.** : నీ మాదుగా చరిత్ర నడిచి వెళ్ళిపోయింది. దాన్ని ఆపే ఓపికా... నడిపే వయస్సూ యిప్పుడు నాకు లేవు. అప్పుడు నేనొక తరహా యజ్ఞం చేశాను...

**మాస్టారు** : ఔనౌను... నీ యజ్ఞం ఫలితంగా అప్పల్రాముడి కొడుకు సీతారాముడు, కొడుకుని చంపుకున్న హంతకుడై విశాఖ జైలుపాలయి, అక్కడ నక్సలైట్‌గా మారాడు. జైలుగోడలు దాటి బయటికొచ్చి తన తరహా యజ్ఞంలో ఎన్‌కౌంటరై పోయాడు.

అప్పల్రాముని మనుమడు చిన అప్పల్రాముడు పినతండ్రి బాటలోనే సాగుతూ తమదైన యజ్ఞాన్ని కొనసాగిస్తున్నాడు.

నీవీ, వారివీ వేర్వేరు తరహాల యజ్ఞాలే అయినా రెండూ ప్రజల కొరకే జరిగాయి.

**శ్రీ.నా.** : నిజమే కానీ మాస్టారూ! చేయ కూడనివి కొన్ని జరిగాయి. జరగవలసినవి కొన్ని చేయలేదు. నిన్న విత్తనాలు చల్లి ఈ రోజే నారు పీకాలనుకోకూడదు. అన్నప్రాసనరోజే ఆవకాయ తినిపించకూడదు. పులుల మందను పుల్లలతో పొడవకూడదు.

దూరదృష్టిలేని త్యాగ కృషి వల్ల నూర్చిన పంటంతా, విత్తనాలకన్నాడా మిగలకుండా, ఒక్క అకాలవర్షానికే సమర్పించుకున్నట్టయింది.

**కా.రా. (మాస్టారు)** : ఇదిగో శ్రీరాములు నాయుడూ! ప్రకృతితో సంఘర్షణ వ్యవసాయమైతే, సామాజిక సంఘర్షణ యొక్క అత్యున్నత రూపమే విప్లవం. వ్యవసాయాన్ని లోతుగా అధ్యయనం చేస్తే విప్లవాన్ని అర్థం చేసుకోవటం సులువవుతుందనుకుంటా...

**శ్రీ.నా.** : మాస్టారూ! కొడవలి పుచ్చుకున్నవాడల్లా వ్యవసాయదారుడు కానట్టే, తుపాకీ ఎత్తటమే విప్లవం కాదు. అదును - పదును, కాడీ - మేడీ, పురుగూ - పుట్రా, పలుగూ - పారా... ఎన్ని సర్దుకుంటే వ్యవసాయమవుతుంది. అయినా వ్యవసాయమంటే పంట కంటే కలుపునెక్కువ పెంచటమూ కాదు. కలుపుని ఏరివేయటం పేరుతో పైరుని తొక్కివేయటమూ కాదు. ఇవన్నీ ప్రజల జీవిత స్వానుభవాలు.

**కా.రా.** : శ్రీరాములు నాయుడూ! నువ్వు అసలు విషయాన్ని సరిగా ఆలకించినట్టు లేదు. నేనేమన్నాను... మీమీ తరహాల యజ్ఞాలు వేర్వేరే అయినా... రెండూ... ప్రజల కొరకు... ప్రజల తరఫున మాత్రమే జరిగాయన్నాను. అంటే... ప్రజల చేత ప్రజల నిర్ణయాలతో అవి జరుగలేదు. వారినందుకు నిరంతరం సంసిద్ధుల్ని చేయలేదు. ప్రజల యొక్క జీవిత స్పృహను, సామాజిక చైతన్యం స్థాయికి, ప్రజా సంఘర్షణను క్రమంగా ప్రజా విప్లవం వైపుకి మెట్టుమెట్టుగా అభివృద్ధిపరచలేదు. ఇదీ నా అభిప్రాయం. అర్థమైందా?

**శ్రీ.నా.** : కాలేదు మాస్టారూ! మేము చేసిన రెండు రకాల యజ్ఞాలూ ప్రజల కొరకు, ప్రజల తరఫున జరిగాయన్నప్పుడు అర్థం కాలేదు గానీ... ప్రజల చేత, ప్రజల నిర్ణయాలతో జరగలేదన్నప్పుడు మాత్రమే అర్థమయింది మాస్టారూ! నిజమే ప్రజల కంటే మేము గొప్ప వాళ్ళమనుకున్నాం. ప్రజల అనుభవాల నుండి నేర్చుకోకుండా... మా ఆవేశాలూ, ఆలోచనలూ వారిపై రుద్దాం. బహుశా ఇదే మా లోపం... మా లోపం ఇదేననిపిస్తోంది. అందుకే మరో యజ్ఞం.

**కా.రా.** : సరైన యజ్ఞం!

**శ్రీ.నా.** : ప్రజా యజ్ఞం! అవసరమనిపిస్తోంది.

**ఇరువురూ** : అవసరమనిపిస్తోంది... అవసరమనిపిస్తోంది (నిష్క్రమిస్తారు).

# 'దృక్కోణాలు' కోణమానిని




కాల్పనిక వచన సాహిత్యంలో సర్వజ్ఞత్వ కథనమే అనాదిగా బలంగా వుంది. తర్వాత రచయిత ఆత్మాశ్రయంగా 'నేను' అంటూ కథ చెప్పటం మొదలైంది. ఆ తర్వాత విభిన్న పాత్రలు వరుసగా కథ చెప్పటం ద్వారా కథను క్రమోన్మీలనం చేయటం అన్న పద్ధతిని రచయితలు ప్రవేశపెట్టారు. ఇందులో ఒకటికి మించిన ఆత్మాశ్రయ కథనాలుంటాయి. కథకుడు మారినప్పుడల్లా 'కోణం' కూడా మారే అవకాశం ఉంటుంది. ఒక లక్ష్యం మీద అన్ని వైపుల నుంచి వెలుతురు ప్రసరించడంతో వస్తు స్వరూపం పూర్తిగా వెల్లడయ్యే అవకాశం ఉంది. 'దృక్కోణాలు' ఈ తరహా నవల.

**- అమ్మంగి వేణుగోపాల్**

అంపశయ్య నవీన్ నవల 'దృక్కోణాలు' (2005) ఒక సత్యాన్ని ప్రతిపాదించే ప్రయోగాత్మక నవల. జరిగి పోయిన ఒక వాస్తవిక సంఘటనను తిరిగి చెప్పేటప్పుడు వ్యక్తులు తమ తమ దృక్కోణాలను, స్వార్ధవైఖరులను జతచేసి చెప్తుంటారన్నది ఒక సత్యం. ఒక కాల్పనిక సంఘటనను చెప్తున్నప్పుడు, వివిధ పాత్రలు తమ దృక్కోణాలను, స్వార్థ వైఖరులను కథనం చేసిన తీరును రచయిత 'దృక్కోణాలు' నవలలో చిత్రించారు.

కాల్పనిక వచన సాహిత్యంలో సర్వజ్ఞత్వ కథనమే అనాదిగా బలంగా వుంది. తర్వాత రచయిత ఆత్మాశ్రయంగా 'నేను' అంటూ కథ చెప్పటం మొదలైంది. ఆ తర్వాత విభిన్న పాత్రలు వరుసగా కథ చెప్పటం ద్వారా కథను క్రమోన్మీలనం చేయటం అన్న పద్ధతిని రచయితలు ప్రవేశపెట్టారు. ఇందులో ఒకటికి మించిన ఆత్మాశ్రయ కథనాలుంటాయి. కథకుడు మారినప్పుడల్లా 'కోణం' కూడా మారే అవకాశం ఉంటుంది. ఒక లక్ష్యం మీద అన్ని వైపుల నుంచి వెలుతురు ప్రసరించడంతో వస్తు స్వరూపం పూర్తిగా వెల్లడయ్యే అవకాశం ఉంది. 'దృక్కోణాలు' ఈ తరహా నవల.

నవలలోని ప్రధాన సంఘటనను రచయిత ముందే చెప్పేస్తాడు. పాలమ్ముకునే వివాహిత యువతి రాజమ్మను నకిలీ దంతవైద్యుడు సాంబమూర్తి రేప్ చేశాడన్నది ప్రధాన సంఘటన. ఇది జరిగిందని కొందరు, జరిగి వుండకపోవచ్చని కొందరు భావించడంతో రేప్‌కు గురైన స్త్రీ పట్ల, రేప్ చేయకున్నా చేశాడన్న ముద్ర పడ్డ పురుషుడి పట్ల పాఠకుడికి సమానమైన సానుభూతి కలుగుతుంది. ఈ సంఘటన 'జరిగిన వెంటనే చెలరేగిన హింస, పత్రికల్లో వచ్చిన కథనాలు పరిస్థితి తీవ్రతను బహిర్గతం చేయడంతో ఒక నిజ నిర్ధారణ కమిటీ విచారణకు వచ్చింది. ఆ కమిటీ ముందు - శోధన్ అనే పత్రికా విలేకరి, నిందితుడు నకిలీ దంతవైద్యుడు సాంబమూర్తి, రాజమ్మ, పోలీసు ఇన్‌స్పెక్టర్, మరో పాలమ్ముకునే మహిళ పోచమ్మ, ఫెమినిస్టు ఫోరం సెక్రటరీ భారతీదేవి, దంతవైద్యుడు వెంకటేశ్వరరావు, రాజకీయ నాయకుడు సోమలింగం తమ తమ స్టేట్‌మెంట్లిస్తారు.

పురుషాధిక్యతలో లైంగిక అత్యాచారాలకు గురవుతున్న స్త్రీల ప్రతినిధిగా రాజవ్వ పాత్రకు, పరిస్థితుల ప్రాబల్యం వల్ల నేరస్తుడన్న ముద్రపడ్డ సాంబమూర్తి పాత్రకు మధ్య రచయిత సమతుల్యత సాధించగలిగాడు. క్రమంగా అసలు రేప్ జరిగిందా? లేదా? అన్న ప్రశ్న తలెత్తుతుంది. ఈ సంశయలాభం ఎవరిది? అన్నది పాఠకులు ఎవరి కథనాన్ని నమ్ముతారన్న దానిమీద ఆధారపడి వుంది. ఇక్కడ కూడా మనో వైజ్ఞానిక ధోరణి ప్రాముఖ్యం వహిస్తుంది.

పత్రికా విలేకరి శోధనకు సత్యాసత్యాల పట్టింపు లేదు. తాను విలేకరిగా వృద్ధిలోకి రావడానికి, 'ఖమ్మం టైమ్స్' పత్రికను నిచ్చెనగా వాడుకుంటున్న వృత్తి నిపుణుడు. 'యువతి మానభంగం' అన్న వార్తకు సెన్సేషన్ జోడించి తన వృత్తి నైపుణ్యాన్ని ప్రదర్శించాడు.

సాంబమూర్తి తానొక నకిలీ డెంటిస్టునని అంగీకరించాడు. నిజానికి చట్టరీత్యా శిక్ష పడవలసిన అంశం ఇది. కాని, చేయని నేరానికి తనను బలిచేస్తున్నారని అంటాడు. తానొక స్త్రీలోలుణ్ణని అంగీకరించాడు. రాధ అనే అమ్మాయినే కాకుండా మరికొందరు యువతులను కూడా తన అందంతో, మాట తీరుతో ఆకర్షించి, వాళ్ళ అంగీకారంతో లైంగిక సంబంధాలు ఏర్పరచుకున్నానని తన స్టేట్‌మెంట్‌లో అంగీకరించాడు.

వైద్యంలో భాగంగా రాజమ్మ పాడైపోయిన పన్ను దగ్గర సాంబమూర్తి ఆమె ఇష్టానికి విరుద్ధంగా మత్తు సూది ఇవ్వటం, ఆ మత్తు దిగిపోతున్న దశలో పైట సవరిస్తూ ఆమెకు కనిపించడం అనుమానానికి తావిచ్చింది. తనను సాంబమూర్తి బలాత్కారం చేశాడని ఆ క్షణంలో అనుకోవటంలో ఏమీ కుట్రబుద్ధి లేదు. ఒకదానివెంట ఒకటిగా వేగంగా జరిగిపోయిన ఘటనలు, ఆమె ఆ తర్వాత తనదే పొరపాటు అని తెలుసుకున్నా దాన్ని బయటపెట్టడానికి వీలులేని పరిస్థితిలోకి నెట్టాయి.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ అశోక్‌రావు తన స్టేట్‌మెంట్‌లో సాంబమూర్తి రాజమ్మను రేప్ చేయలేదనే స్పష్టం చేశాడు. సాంబమూర్తికి అందమైన అమ్మాయిలంటే బలహీనత వుందనడానికి ఆధారాలు చెప్తూనే, రాజమ్మ

# ప్రాణకళేబరం



**ఈతకోట సుబ్బారావు**

లంగరెత్తిందంటే
పడవ ప్రయాణం మొదలైందనే కదా
పడవని జడం అనకండి!
చిగురు గాలి తాకిందంటే
వొళ్ళంతా పులకింతై
కొమ్మా కొమ్మా రెమ్మా రెమ్మా
అమ్మోరి పూనికై పోతుంది
చెట్టుని జడం అనకండి!
జనసంచారం లేని దారుల్లో
వొంటరి ఎడారుల్లో
'కో' అంటే 'కో' అంటూ బదులిచ్చే
కొండల్ని జడం అనకండి!
సమాధుల పైన
రంగు జెండాలై ఎగిరే పూలమొక్కలకి
ప్రాణదానం చేస్తున్న
మృతచిహ్నాలూ జడమేనా?
గాలి తెమ్మెరలపైన పయనించే పాటలు
వెలుతురు తెరలై ప్రవహించే దృశ్యాలు
గగన చైతన్య ప్రతీకలు
ఆకాశం జడమెట్లైతది?
వేణువు కాలేకపోయినా
వెదురు వెదురుగా మిగల్లేదు -
దాహంగా మారకపోయినా
మేఘం ఆవిరి నాదైతే కాలేదు
ఇక్కడ ప్రభావాల్ని గురించి కాదు
స్పందనల్ని గూర్చి మాట్లాడండి
అశ్రు ప్రవాహాల గూర్చి చర్చించండి
గుండె వెతలక్కర్లేదు
ఆత్మ కేకల్ని అవలోకించండి
పచ్చి గాయాల మాంసపు మైదానాల గుండా
రక్తపు మరకల పైన్నుంచి
అపరిచిత కళేబరాల్లా వెళ్ళిపోతున్న
నడిచే శవాల గురించి విశ్లేషించండి!

---

వంటి స్త్రీల పట్ల మోజు వుందదన్నది ఆయన వాదం.

ఆ సంఘటనా స్థలంలో వున్న పోచమ్మ అనే పాలమ్ముకునే స్త్రీ రాజమ్మ మాటలు విశ్వసించి, గట్టిగా అరిచి శాంతి భద్రతల పరిస్థితిని సృష్టించినా, ఆ తర్వాత "రాజమ్మ డబ్బుల కోసమే గా పోరగాన్ని నాశనం చేసింద"నే నిర్ధారణకు వచ్చింది.

స్త్రీవాది, క్రిమినల్ లాయర్ భారతీదేవి రేప్ జరిగిందనీ, సాంబమూర్తికి శిక్ష తప్పదని నమ్మకంగా తన స్టేట్‌మెంట్‌లో చెప్పింది.

మరో దంతవైద్యుడు వెంకటేశ్వరరావుకు సాంబమూర్తి అంటే అసూయ. నకిలీ డాక్టరై వుండి, తనకంటే ఎక్కువ సంపాదిస్తున్నాడన్నది ఇందుకు కారణం. ఈయన బయటపెట్టిన రహస్యం - సాంబమూర్తి నపుంసకుడని! రేప్ చేసే అవకాశం లేదని.

రేప్ చేసిన స్థితి నుంచి, చేసే అవకాశం లేని స్థితికి ఇతివృత్తం క్రమోన్మీలనం చెందడం గమనించవచ్చు. సాంబమూర్తి పట్ల తీవ్ర వ్యతిరేక భావాలున్న పోలీస్ అధికారి, డాక్టర్ వెంకటేశ్వరరావు ఇందుకు దోహదం చేశారు.

చిట్టచివరి స్టేట్‌మెంటిచ్చిన సోమలింగం రాజకీయ నాయకుడు. "గిరంత అప్పొజిషన్ పార్టీ వోళ్ళు చేపిస్తున్న లొల్లి" అంటూ ఒక్కమాటలో సాంబమూర్తి అమాయకుడని తేల్చేశాడు. నదులన్నీ సముద్రంలో కలిసినట్లు, స్టేట్‌మెంట్లన్నీ రాజకీయంలో కలిసి నిజానిజాలను తేల్చుకున్నాయి.

నలిగిన బాటలో కాక నవీన పంథాలో నడిచిన ప్రయోగాత్మక నవల 'దృక్కోణాలు'. ప్రయోగం మోజులో సత్యాన్ని బలిపెట్టే ప్రమాదం కూడా వుంటుంది. నవీన్ సత్యాన్ని మరింత వెలుగులోకి తేవటానికి ప్రయోగాన్ని ఆశ్రయించారు. వ్యక్తులలోని ద్వంద్వ ప్రవృత్తిని, బతకనేర్చిన తత్వాన్ని ఆవిష్కరించడంలో కృతకృత్యులయ్యారు.

(అయితే ఇందుకు 'రేప్' వంటి ఘటనను గాక మరేదైన అంశాన్ని తీసుకోవడం ఇంకా సముచితంగా వుండేది. నేటికాలంలో స్త్రీలపై పెరుగుతున్న అత్యాచారాల నేపథ్యంలో సామాజిక స్పృహ గల పాఠకులకు ఈ అభిప్రాయం కలగకుండా వుండదు)

ఈ నవలకు అనుబంధంగా 'సుజిత' అన్న కథానిక కూడా వుంది. ప్రపంచీకరణ నేపథ్యంలో మార్పుకు లోనవుతున్న స్త్రీ పురుష సంబంధాలకు సంబంధించిన కథానిక ఇది. పెళ్ళి చేసుకోకుండానే కలిసి జీవిస్తున్న యువతీ యువకుల సంఖ్య నగర ప్రాంతాల్లో పెరిగిపోతున్న నేపథ్యంలో వచ్చిన కథానిక కూడా. యువతి విదేశానికి వృత్తి విద్యను పూర్తి చేయడానికి వెళ్ళి, అక్కడా మరో యువకునితో లైంగిక సంబంధం పెట్టుకొని, తిరిగి దేశానికి వస్తుంది. తన పాత మిత్రునితో ఈ విషయం దాపరికం లేకుండా చెప్పేస్తుంది. కొంత మానసిక సంఘర్షణ తర్వాత అతడు ఆమెతో సహజీవనాన్ని అంగీకరిస్తాడు.

లైంగిక అవసరాలు, ప్రేమ అన్న అంశాల పట్ల యువకుడు సంప్రదాయ స్త్రీ మాదిరిగా, యువతి ఆధునిక పురుషుడిలాగా స్పందిస్తారు. భౌతికమైన ఎల్లలు దాటటం, ఆర్థిక స్వేచ్ఛ, కొత్త సంస్కారాన్ని అలవరచుకోవటం - అన్నవి స్త్రీ పురుషుల జీవన శైలిని మార్పుకు లోను చేస్తున్నాయి. రేపటి పరిస్థితులకు అనువుగా జీవించటానికి సిద్ధంగా వున్నంత కాలం మానసిక సమస్యలు పెద్దగా ఉత్పన్నం కాకపోవచ్చు. సామాజిక సమస్యలను ధనస్వామ్యం ఎట్లాగూ పరిష్కరిస్తుంది.

ఒక్క మాటలో చలం బతికి వుంటే రాసివుండే కథానిక 'సుజిత'.

**('దృక్కోణాలు' నవల, అంపశయ్య నవీన్, వెల : రూ. 150/-, ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, ఆర్య సమాజ్ మందిర్ ఎదురుగా, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్-500 027)**

# ఉప్పొంగిన సాహితీ గోదారి



సాహిత్యశాల గౌరవ అధ్యక్షోపన్యాసం చేస్తున్న ప్రభుత్వ ప్రత్యేక న్యాయవాది అప్పారి సత్యప్రసాద్
వేదికపై ద్వా.నా. శాస్త్రి, మేడిపల్లి రవికుమార్, జ్వాలాముఖి, అద్దేపల్లి, తెలకపల్లి రవి,
కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, తల్లావఝ్ఝల పతంజలి శాస్త్రి, పతివాద సూర్యనారాయణ

గోదావరి తీరాన సాహితీ కెరటం ఉప్పొంగింది. కవుల, కళలకు చైతన్య స్ఫూర్తిని కలిగించే అవకాశాన్ని కల్పించింది సాహితీ స్రవంతి. కొత్తగా కవిత్వాన్ని అక్షరీకరించే ఔత్సాహిక కవులతో పాటు, అనుభవజ్ఞులను, మేధావులను ఒకచోటికి చేర్చింది. ముక్తకంఠంతో ప్రపంచీకరణ వికృతాలను ఎండగట్టడానికి సాహిత్యశాల కార్యక్రమం దోహదపడింది.

కార్యాచరణశీలి, తెలుగు సాహిత్య వైతాళికులు కందుకూరి వీరేశలింగానికి నివాళులర్పించి, సాహితీ సేద్యంలో అంతరాల దొంతరలను పెకిలించి అక్షరానికి అంతం లేదన్న దళిత కుసుమం కుసుమ ధర్మన్న పోరాట స్ఫూర్తిని ఆవాహన చేసుకుంది గోదావరి సాహిత్యశాల.

సెప్టెంబర్ 2 ఉదయం జరిగిన ప్రారంభ సభలో కవి, ఆహ్వానసంఘాధ్యక్షులు అద్దేపల్లి రామ్మోహనరావు అధ్యక్షోపన్యాసం సాహితీప్రియులను ఆకట్టుకుంది. ప్రముఖ కవి, సాహితీ విమర్శకులు జ్వాలాముఖి చేసిన ప్రారంభ ప్రసంగంలో ఒక ప్రక్క ప్రపంచీకరణ, మరోపక్క మతోన్మాదం వంటివి సమాజాన్ని పట్టిపీడిస్తున్న వైనాన్ని వివరిస్తూ సమాజంలో మార్పుకు సాహిత్యకారుల పాత్రను తేటతెల్లం చేశారు. ఔత్సాహిక సాహిత్యకారులకు స్ఫూర్తిదాయకమైన ప్రసంగాన్నిచ్చారు. ఈ సందర్భంగా ప్రచురించిన 'గోదారి' కవితా సంకలనాన్ని ప్రభుత్వ ప్రత్యేక న్యాయవాది, ఆహ్వానసంఘ గౌరవాధ్యక్షులు అప్పారి సత్యప్రసాద్ ఆవిష్కరించారు. ఇందులోని కవితలను చక్కగా విశ్లేషిస్తూ అభినందించారు. తెలుగు భాషను కాపాడుకోవాలని కోరారు. అంతకుముందు చిత్ర ప్రదర్శనను శ్రీమతి భారతలక్ష్మి, పుస్తక ప్రదర్శననను సన్నిధానం నరసింహశర్మ ప్రారంభించారు. కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, తల్లావఝ్ఝల పతంజలి శాస్త్రి, పతివాద సూర్యనారాయణ తదితరులు సందేశాలిచ్చారు.

### కవిత్వ చర్చ

తొలి సమావేశంలో కవిత్వంపై చర్చ జరిగింది. వివిధ తరగతుల అస్తిత్వ ప్రకటనకు అక్షరాల గొంతుకే కవిత్వమని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆచార్యులు డాక్టర్ మేడిపల్లి రవికుమార్ పేర్కొన్నారు. ప్రపంచీకరణ దుష్ఫలితాలు తీవ్రమవుతున్న కొద్దీ దాని పర్యవసానాలు వివరిస్తూ, దుర్విధానాలను ప్రతిఘటిస్తూ విస్తృతంగా కవిత్వం వెలువడుతోందని చెప్పారు. 'సమకాలీన కవిత్వం' అనే అంశంపై ఆయన మాట్లాడారు. తెలుగు కవిత్వానిది తొలి నుంచీ చైతన్యపూరితమైన ప్రస్థానమని అన్నారు. ఈ సందర్భంగా ఇటీవలి పలు కవితలను ప్రస్తావించారు. కొత్తగా వినిపిస్తున్న నవకవుల స్వరాలు తీవ్రంగా, సందర్భోచితంగా ఉంటున్నాయని, సమాజంలో అన్యాయానికి, వివక్షకు గురవుతున్న అన్ని తరగతుల స్థితిగతులనూ ప్రతిధ్వనిస్తున్నాయని చెప్పారు. కవిత్వం అనేది హోదా కోసమో, కాలక్షేపం కోసమో కాదని, సమాజ అభ్యుదయానికి దోహదపడే సృజనాత్మక ప్రక్రియ అని పేర్కొన్నారు. ఇప్పుడొస్తున్న కవిత్వం ఎక్కువ భాగం కాలక్షేపం కోసం కాకుండా, సామాజిక చైతన్యానికి దోహదపడేదిగా ఉండటం హర్షణీయమన్నారు. గోదావరి జిల్లాల నుంచి సీరియస్ కవిత్వం రాదని కొందరు భావిస్తారని, కానీ అది వాస్తవం కాదని అన్నారు. ఇక్కడి నుంచి సమకాలీన అంశాలపై ఎప్పటికప్పుడు ఉత్తమ కవిత్వం వచ్చిందని సోదాహరణంగా వివరించారు.

తెలుగు విశ్వవిద్యాలయం అధ్యాపకులు శిఖామణి మాట్లాడుతూ, వర్తమాన కవిత్వం అన్ని తరగతుల స్థితిగతులనూ ప్రతిభావంతంగా ప్రతిఫలిస్తుందన్నారు. ప్రపంచంలో ఏ మూల ఏ పరిణామం చోటుచేసుకున్నా దానిపై ప్రతిస్పందించే లక్షణం తెలుగు నేలకు తొలి నుంచీ ఉందని చెప్పారు. ప్రముఖ సాహితీ విమర్శకులు ద్వా.నా. శాస్త్రి 'సాహిత్య సమీక్షలు' అంశంపై మాట్లాడుతూ, దినపత్రికల్లో సాహిత్య సమీక్షలకు తగిన ప్రాధాన్యం ఉండటం లేదని అన్నారు (వీరి ప్రసంగాలు మరోచోట చూడవచ్చు).

ఈ సమావేశంలోనే అద్దేపల్లికి సప్తతి అభినందన సత్కారం జరిగింది. వల్లభాపురం జనార్దన సత్కారం నిర్వహించారు. మండవ సుబ్బారావు ప్రభృతులు పాల్గొన్నారు.

### తెలుగు కథ వికాసం

అనంతరం జరిగిన కథా చర్చకు జాతశ్రీ అధ్యక్షత వహించారు. కథా రచయిత జి.ఎస్. చలం మాట్లాడుతూ, రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల నుంచీ మంచి కథలు వస్తున్నాయని, అస్తిత్వాన్ని ప్రతిఫలించే కథలు విస్తృతంగా వెలువడుతున్నాయని అన్నారు. పదిహేనేళ్ళ కాలంలో వ్యవసాయ రంగంలో నెలకొన్న సంక్షోభాన్ని అన్ని ప్రాంతాల రచయితలూ ప్రతిభావంతంగా చిత్రీకరించారని చెప్పారు. ఆయా ప్రాంతాల నిర్దిష్టతలను జోడిస్తూ, రైతు ఎదుర్కొంటున్న అనేక సమస్యలపై చక్కని కథలు రాశారని సోదాహరణంగా వివరించారు. కథయినా, కవిత్వమైనా ఆయా కాలాల్లోని పరిణామాలను, వాటి విభిన్న కోణాలను నిశితంగా పరిశీలించి, ప్రతిఫలించాలని, ఆ కర్తవ్యాన్ని నేటి సాహిత్యం నెరవేర్చుతోందని పేర్కొన్నారు. ఇంకా కథా రచయితలు యాళ్ళ అచ్యుతరామయ్య, కె. వరలక్ష్మి సమకాలీన కథా సాహిత్యంపై మాట్లాడారు. తెలుగునాట తొలి కథ దిద్దుబాటు నుంచి నేటివరకూ సమాజ అభ్యుదయానికి, చైతన్యానికి దోహదపడే కథలే వచ్చాయని, ఇదే ఒరవడి భవిష్యత్తులోనూ కొనసాగుతుందని పేర్కొన్నారు.

### మీడియా - సాహిత్యం

సెప్టెంబర్ 3 ఉదయం మీడియా - సాహిత్యం అనే అంశంపై చర్చాగోష్టి జరిగింది. ఈ కార్యక్రమానికి ప్రజాశక్తి సహాయ సంపాదకులు ఎస్. వెంకట్రావు అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా ప్రింట్ మీడియాకి, సాహిత్యానికి మధ్య ఉన్న సంబంధాన్ని ఆయన వివరించారు. సుదీర్ఘకాలంగా ఉన్న ప్రింట్ మీడియాకు ఎలక్ట్రానిక్ మీడియా తోడయిందన్నారు. జాతీయోద్యమంలో లాభాపేక్ష లేకుండా లక్ష్యం కోసం ఆనాడు పత్రికలు పనిచేశాయని గుర్తు చేశారు. 80వ దశకం తర్వాత పత్రికా రంగంలో మార్పులు చోటుచేసుకున్నాయని అన్నారు. అనంతరం మీడియా స్వరూపమే మారిపోయిందని ఆవేదన వ్యక్తం చేశారు. ఎలక్ట్రానిక్ మీడియా రాకతోనే వ్యాపార ధోరణితో ముందుకు వచ్చిందన్నారు. ఒకపక్క సాహిత్యాన్ని చదివే వారి సంఖ్య పెరుగుతున్నా సాహిత్యాన్ని అభివృద్ధి చేసే ప్రక్రియ తగ్గుతుందన్నారు. మానవుని హృదయ స్పందనలను మీడియాలో చోటు చేసుకోవని తేలిపోయిన నేపథ్యంలో సాహిత్యాన్ని మరింతగా అభివృద్ధి చేసే దిశలో ఔత్సాహిక సాహిత్యకారులు ముందుకు సాగాలని ఆయన కోరారు. ఇంటర్‌నెట్ వంటి ఆధునిక సాంకేతిక ప్రక్రియలను ఉపయోగించుకోవాలన్నారు.

ప్రయోజనం సాధించేలా బాల సాహిత్యాన్ని పెంపొందించాలని అవార్డు గ్రహీత, సీనియర్ రచయిత్రి డి. సుజాతాదేవి చెప్పారు. విద్యార్థి దశలోనే ప్రకృతి ఎడల, సమాజంలోని వనరులను ఏ విధంగా వినియోగించుకోవాలనే స్ఫూర్తినిచ్చేలా సాహిత్యాన్ని రూపొందించాలని ఆమె కోరారు. ప్రపంచీకరణ మానవుల మధ్య దూరాన్ని పెంచుతుందని, మానవుడికి ఇష్టమున్నా, లేకున్నా విదేశీ విష సంస్కృతి చొచ్చుకు వస్తుందని సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి అన్నారు. ఈ నేపథ్యంలో సామాజిక చైతన్యాన్ని పెంపొందించేలా రచనలు రావాలని కోరారు.

ఈ సందర్భంగా శ్రీ వత్స తీసుకొచ్చిన నగర శోభ కవితా సంపుటిని, అలాగే అల తీసుకొచ్చిన దీర్ఘ కవిత సంపుటిని, అల



గోదారి కవితా సంకలనం ఆవిష్కరణ దృశ్యం

రచించిన 'మట్టి చెట్టు-పిట్ట బజినిక' కావ్యాన్ని కవి అద్దేపల్లి రామ్మోహనరావు ఆవిష్కరించారు.

### జనకవనం

అనంతరం జనకవనం కార్యక్రమం కవి యాసలపు సూర్యారావు, జి.సుబ్బారావు, దాట్ల దేవదానంరాజుల అధ్యక్షతన జరిగింది. సుమారు 70 మంది కవులు వివిధ అంశాలపై కవితలను చదివారు. వారి కవిత్వం సాహిత్యశాల లక్ష్యానికి, స్ఫూర్తికి ప్రతిబింబంగా నిలిచింది. సాహిత్యశాల ఆదివారం మధ్యాహ్నం 3.30 గంటలకు ముగిశాక కూడా పలు ప్రాంతాల నుంచి కవులు, సాహితీ అభిమానులు తరలి రావడం ఈ కార్యక్రమానికి లభించిన ఆదరణకు, ప్రతిస్పందనకు నిదర్శనం.

### ముగిసిన గోదావరి సాహితీశాల

చల్లని గోదావరి తీరాన రెండు రోజుల పాటు జరిగిన సాహితీ స్రవంతి గోదావరి సాహిత్యశాల సృజనకారుల్లో కొత్త స్ఫూర్తిని రగిలించింది. వివిధ ప్రక్రియలు, వివిధ ప్రాంతాలు, వివిధ వయస్సుల రచయితలు, రచయిత్రులు ఒకే వేదికపై అభిప్రాయాలు పంచుకునే అవకాశం ఈ సందర్భంగా కలిగింది. సాహిత్యశాల కార్యక్రమం ఆద్యంతం ఉత్సాహపూరితంగా సాగింది. ఏ సమయంలోనూ 140మందికి తక్కువ కాకుండా సమావేశంలో కూర్చున్నారు. ఈ కార్యక్రమానికి ఇప్పుడిప్పుడే సాహిత్య రంగ ప్రవేశం చేస్తున్న యువతీ యువకుల నుంచి తలపండిన సీనియర్ రచయితల వరకూ పాల్గొనడం విశేషం. ఈ కార్యక్రమం ప్రధానంగా ఉభయ గోదావరి జిల్లాలకు ఉద్దేశించిందే అయినప్పటికీ పత్రికల్లో సమాచారం తెలుసుకొని, 8 జిల్లాల నుంచి రచయితలు ఎంతో ఆసక్తిగా హాజరయ్యారు.

తెలకపల్లి రవి సమన్వయకర్తగా వ్యవహరించారు. నండూరి దత్తు కార్యదర్శిగా, సత్యాజీ కోశాధికారిగా ఆహ్వానం సంఘం చక్కటి ఏర్పాటు చేసింది.

సాహిత్యశాల సందర్భంగా ఏర్పాటు చేసిన బుక్ ఎగ్జిబిషన్, సాహితీ ప్రముఖుల ఫొటోల ప్రదర్శన ప్రతినిధులనే గాక ఇతర ఆసక్తిపరులనూ అమితంగా ఆకట్టుకున్నాయి. కొన్ని పాఠశాలల విద్యార్థులు ప్రత్యేకంగా వచ్చి ఎంతో ఆసక్తితో కవుల వివరాలను తెలుసుకోవడం ముచ్చటగొలిపింది. ఈ రెండు రోజులు అన్ని తెలుగు పత్రికలు చక్కటి వార్తా కథనాలు ప్రచురించి ప్రోత్సాహించాయి.

# గ్రామీణ జీవన విధ్వంసాల చిత్రిక జాతశ్రీ 'చలివేంద్రం'




కటుకోజ్వల ఆనందాచారి

కథా నవలా రచయితగా గత మూడు దశాబ్దాల అనుభవం వున్నవారు జాతశ్రీ. మొదట 'సింగరేణి మండుతోంది', 'వెదురు పొదలు నినదించాయి', 'బలిపశువు' మొదలైన నవలలు అనేక బహుమతులు గెలుచుకున్నాయి. ఆ తర్వాత ఎన్నో ఉత్తమ కథలను రాసి ఆంధ్రదేశంలో ప్రసిద్ధ కథా రచయితగా పేరు తెచ్చుకున్నారు. వారి నవలల్లోగానీ, కథలలో గానీ సమాజంలోని అట్టడుగు ప్రజల జీవన చిత్రాలనేకం వస్తువుగా చేసుకుని చిత్రించారు. 'చలివేంద్రం' పేరుతో వేసిన కథా సంకలనంలో నూతనంగా సమాజంలో వచ్చిన మార్పుల ఫలితంగా వివిధ వర్గాల ప్రజల జీవన సంక్షోభాలను, మనస్తత్వాలను, మానవ సంబంధాలలో వచ్చిన మార్పులను హృద్యంగా చెప్పారు. ఈ సమాజంలోనే ఇంకా మానవీయ స్పర్శను కలిగి వున్న వ్యక్తుల ప్రభావాలను కూడా కథలుగా మలిచారు.

"చలివేంద్రం" కథా సంకలనంలో పదిహేను కథలున్నాయి. చివరి రెండు 'అంకురం', 'వ్యూఫైండర్' పాఠకులకు కొన్ని ఉదాహరణలు, పోలికలు చెబుతూ సంఘంలో రావలసిన మార్పు కోసం ఉద్వేగభరితంగా ప్రబోధిస్తారు. ఈ సంకలనంలో దెబ్బయిల నుండి రాసిన కథల నుండి నేటి వరకూ రాసినవి వున్నాయి. అయితే అన్నీ కూడా నేటి కాలానికి అన్వయింపుగానే స్పందన కలిగిస్తాయి.

జాతశ్రీ గారు ఎంచుకునే కథాంశానికి సంబంధించిన వాతావరణ చిత్రణ కోసం ఆయా వృత్తుల వారిని, ప్రాంతాలను అధ్యయనం చేసి ఆ భాషనే వాడుతూ సన్నివేశాన్ని నడిపిస్తారు. శైలి, శిల్పం పండించడంలో అందెవేసిన చేయి ఆయనది.

మన దేశ ప్రజలు అత్యధికంగా గ్రామీణ ఆర్థిక వ్యవస్థపై ఆధారపడి జీవిస్తున్నారు. ఈ గ్రామీణ వ్యవస్థ నేడు సంక్షోభంలో పడింది. గ్రామాలపై ఆధారపడి జీవిస్తున్న లక్షలాది మంది చేతివృత్తులవారు, వివిధ జీవన వృత్తులీడుస్తున్న వారూ ఈ సంక్షోభ ఫలితానికి బలైపోతున్నారు. అంతేకాకుండా వృత్తుల జీవనంతో పాటుగా కొనసాగుతున్న సంస్కృతి సంప్రదాయాలూ, కళలు అడుగంటిపోతున్నాయి. మొత్తంగా గ్రామీణ జీవనమే మారిపోయి మానవ సంబంధాలలో పెద్ద మార్పులు తెచ్చింది.

ఊరంటే ఒక చెరువు, చెరువు గట్టునున్న చింతచెట్లు, పచ్చని పొలాలు, పొలాల్లో పనిచేసే రైతులు, నాట్లేసే స్త్రీలు, ఒక గుడి, ఒక బడి, ఎగురుతున్న పక్షులు, ఆటలాడే పిల్లలు, నాగళ్ళు చేసే వడ్రంగులు, పలుగూ, పారా తయారుచేసే కొలిమి మంటల సెగలు, కుమ్మరి చక్రాలు, సాలెల మగ్గాలు, చెప్పులు కుట్టే సాయిబు, గంగిరెద్దులు, దొమ్మరి ఫీట్లు, తోలుబొమ్మలు, తాటిచెట్లు లొట్లు, హరిదాసులు ఇంకా... ఇంకా...

ఇపుడు ఊరు రూపుమారింది. ప్రపంచమే ఒక వూరుగా మారింది. మారిన వూర్లలో ప్రజల జీవన వృత్తులు ఏ విధంగా దెబ్బతింటున్నదీ, ఫలితంగా వాటిపై ఆధారపడిన జనులు ఏ విధమైన స్థితికి నెట్టబడుతున్నారు. ఎలాంటి ఆలోచనలు చేస్తున్నారు, వారి బ్రతుకు చిత్రం ఎలా మారింది మొదలైన అనేక కోణాలను సూటిగా చెబుతాయి జాతశ్రీ కథలు.

'చలివేంద్రం'లో గ్రామీణ ప్రాంతాలలో వివిధ వృత్తులు జీవనంగా వున్న వారి బ్రతుకులు ఎలా మారుతున్నాయో అద్దం పడతాయి కొన్ని కథలు. మొదటి కథ 'చలివేంద్రం'లో కుమ్మరి బ్రతుకుల గురించి ఒక సంఘటన రూపంలో వివరిస్తుంది.

"ప్... జనవెట్టనో, ఏవో... వంటల్లేక, వనుల్లేక, తిండి కరువై తల్లడిల్లుతున్రు. మనకి నల్లమట్టి తోలే కాపోళ్ళు బసవయ్య లేడూ, బండెద్దులకి మేత లేక, పోయిన సంతల ఎద్దుల్ని బేరానికి పెట్టిండు. సంతల నను వాటేసుకుని బోరునేడ్చిండు. నా చిన్నప్పటి నుండి మనకి మట్టి తోలందాయే! యింకెవర్ననన్నా సూసుకో ఎంకన్నా "అంటే నాకు సుత కళ్ళ నీళ్ళాగలే". "పొలాలున్నోళ్ళే ఊర్ల పొంటి పోతున్రు గాదూ... నీకు దెల్వదా?" "కూటికి రానిదీ కుమ్మరోడి బతుకని పెద్దలు ఊరికే అనరె!" అనే మాటలు వారి దీన రాగాల్ని వినిపిస్తాయి. మైత్రీ సంఘాలు పెట్టి, ప్రజలకు దగ్గరవ్వాలని చేసే ప్రయత్నాలేవీ పోలీసు లక్షణాల్నీ, బుద్ధుల్ని మార్చలేదని కథ నిరూపిస్తుంది.

అదేవిధంగా 'అంతర్ముఖం కథలో గౌడ వృత్తిదారుల జీవితాల్ని, ఆ వృత్తిలోని విధానం – దాని సూక్ష్మ పరిశీలన మన కళ్ళకు కట్టినట్లుగా చిత్రిస్తుంది. కోకాకోలా, పెప్సీ, థమ్సప్, బీరు పల్లె పల్లెకూ వచ్చి కల్లు గిరాకీ తగ్గించాయని చెబుతూనే, కొత్త ఆలోచనలతో డబ్బు సంపాదన అతి వేగంగా చేయాలని చదువుకున్న కొడుకు కువైట్ వెళ్ళి లక్షలు సంపాదించాలన్న ఆలోచనకు యాభైవేల అప్పు దొరకక తాటి చెట్టుపై నుండి పడి లక్ష రూపాయల ఎక్స్‌గ్రేషియా కోసం తన ప్రాణాలను వదులుకున్న మల్లేశం పాత్ర చిత్రణ గుండెల్ని కరిగిస్తుంది. అలాగే 'ముళ్ళ పొద' కథ. మోచీ పని నుండి పాపయ్య... సైకిలు రిపేరులోకి దిగటానికి కారణాలను చెబుతూ



# మన్నించకే మనసా!

ఎం.ఆర్. అరుణకుమారి

నీ వ్యక్తిత్వం కనకమని భ్రమసి
స్నేహం చేదతో ఆత్మీయతను తోడుకొని
మనసారా, తనివితీరా నింపేసుకోవాలని ఆశపడ్డా!
గుండె పుండయినపుడే తెలిసింది
నీ ప్రేమ ఇత్తడని! అనురాగ ఓజోన్ పొరకు చిల్లుపడిందని!
నీ మాటల దీప కళికలకు
ఆకర్షింపబడి ఆహుతైపోయిన శలభాన్ని నేనని!
తుషారమంత 'స్వచ్ఛత' అపాత్రదానమై పోయిందని!
నీ స్మృతులు ఎప్పటికీ ఆరని పచ్చి గాయాలు
వర్ణనాతీతమని మురిసిన అనుబంధం
అపరిచిత మధుర స్వప్నమవుతుందని కలనైనా అనుకోలేదు
నిన్ను నమ్మి పరవశించిన మనసు
దగాపడ్డ దుఃఖభారంతో వివశమవడం
నిన్ను చూసి పరవళ్ళు తొక్కిన రక్తం
నాళాల్ని చించుకొని కన్నీళ్ళుగా రూపాంతరం చెందటం
విశ్వాసాన్ని దగ్ధం చేసిన ఘాతుకపు కిరాతకమేగా!
అపూర్వ సమాగమం – అనివార్య వియోగమైంది
నువ్వు – మనిషి రూపంలో వున్న వల్లకాడు!
ఆత్మను స్వార్థం గొయ్యిలో పాతేసినపుడు
ఆత్మీయత మానవతలేని మనోకోర్టులో ఐ.పి. పెట్టినపుడు
నా కళ్ళల్లో పూచిన అపురూప కుసుమాలు – 'కన్నీళ్ళు'
ఐతే – ఈ కన్నీళ్ళు
బలహీనతకు చిహ్నాలు కావు – ఓటమికి గుర్తులూ కావు
మనసుల్ని కెలికే ఆటవికతకు సంతాప సూచకాలు!
ఇదా – గాయం చేసిన వారికి నెప్పిని గురించి చెప్పి ఏం లాభం?
నెమలి "మాంసము" గాని,
"మనసు" ఏ వేటగానికీ ముద్దు కాదు గదా!
నాకు తెలుసు
గాయపడ్డ ఆత్మాభిమానానికి 'మందు' – ఆత్మ స్థైర్యమేనని!
నీకు తెలీదు
ఎద బరువు తీర్చే అశ్రు సింధువు మోయటం
ఎంత పెద్ద శిక్షో – నీకర్థమయ్యే రోజొకటి వస్తుందని!
గతం శిలువ మోసే ఏ మనసూ నిన్ను క్షమించే జీసస్ కాబోదని!

---

"కంపెనీ వాళ్ళు వాయిదా పద్ధతిలో సైకిళ్ళిచ్చేక నడిచ్చేవాడు అరుదైపోయాడు. దానికి తోడు మాయదారి హవాయి చెప్పులొచ్చాయి. కార్మికులకు బూట్లిచ్చారు. అంతటితో బతుకు బండి ఇరుసుకు తారు కరువైంది. బ్రతుకు చిదుగుల మంటగా అనుభవించసాగాడు. కాలంతో పాటు నేనూ మారాలని సైకిల్ రిపేరు చేస్తుండగా ఉన్నట్టుండి డాంబరు రోడ్డు రావడంతో పావయ్య జీవనం దుర్భరమయింది. పంచర్లు పడటం తక్కువైంది. రహస్యంగా సీలతో సైకిళ్ళను పొడిచేందుకు ఒక కుర్రాణ్ణి పెట్టి దొరికిపోయాడు. పరిస్థితులు ఎలాంటి ఆలోచనలు కలిగిస్తాయో చూపించారు. అలాగే 'జీబ్రా' కథలో ఉపాధ్యాయ వృత్తిలో "ఎప్పుడూ ట్రాన్స్‌ఫర్లూ, యింక్రిమెంట్లూ, జీవోలూ, యూనియన్ గొడవలూ... వారికి వృత్తిపరంగా విద్యార్థులూ, జీవితపరంగా భార్యలూ చిట్టచివరి అంశాలు" అంటూ వ్యంగ్యంగా చిత్రించారు.

'కొలమానం' కథలో కోయ ప్రజల జీవనం కళ్ళకు కట్టినట్లు చూపిస్తూ, అటవీ వుత్పత్తులపై బ్రతికే వారిపై ఫారెస్టు అధికారుల అధికారాన్ని ఎలా వుపయోగిస్తారో తెలుపుతుంది.

ఇక 'నిప్పుల నీడ' కథలో కొందరు మనుష్యులలో వుండే హింసను, పైశాచికత్వాన్ని చూస్తూ ఆనందించే గుణాన్ని, మానసిక పరిస్థితిని చూపించారు. అలాగే 'లబ్ధి' అనే కథలో కూడా మానసిక విశ్లేషణ ప్రధానంగా కనపడుతుంది. జీవితం కంటే డబ్బే ప్రధానం అనుకునే తత్వం గల వ్యక్తుల గురించి విశ్లేషించారు. 'ముక్తాయింపు'లో బొగ్గు గని కార్మికులు పడుతున్న శ్రమను, ఈ ప్రాంతాలలో వడ్డీల పేరుతో కార్మికుల అవసరాలను ఆసరా చేసుకుని కాబూలీవాలాల్లా ఎంతో పీడించుకునేది చూపిస్తూనే కార్మికుల గుండెల్లో వుండే తిరుగుబాటు తత్వాన్ని ఆవిష్కరిస్తారు. 'దాహం'లో తల్లీ కొడుకుల మధ్య వచ్చే తగాదా కోడలుతో పంచాయతీ, ఇంట్లో తిండి గిన్నెపై పెత్తనం ఎవరిదుండాలనే దానిపై పంచాయతీ నడిపిన తీరు నేటికీ అందరి ఇళ్ళలోనూ కొనసాగుతున్న సమస్య.

'విధ్వంసం' కథలో గ్రామాల్లో దొమ్మరోళ్ళు ఆటలాడి సర్కస్ చేసి బ్రతికే వాళ్ళుగా జీవనం సాగించేవారు. ఇప్పుడు గ్రామాల్లో టీవీలు వచ్చి వారి ఆటలేవీ సాగడం లేదు. అనాదిగా అందులో బ్రతుకుతున్న వారి జీవన చిత్రాన్ని చక్కగా చూపించారు. "విద్దెలు అడుగంటినయ్, కూల్నాలికి పోతున్రు, పందుల్ని సాకుతున్రు, దొంగతనాలు మరిగిన్రు, సంచారాలు మానేసి వూరు నికరం చేసికున్రు. ఆడోళ్ళు 'ఎంకటసానులై' పోతున్రు... ఎందునా సుకంలేక ముసలీ ముతకా ఆకలికి నవిసీ నవిసీ చచ్చోళ్ళు చస్తున్రు. ఏందో అంతా మాయ పొరగమ్మినట్టుంది. కాటిపాపలు కంటికి కనపట్టంలే. ఫకీర్లు, పడిగిలోళ్ళు, భాగోతులు, బాల సంతులు, సాధనాలాడే మాష్టీనోళ్ళు ఒగ్గు కతలు జెప్పేటోళ్ళు, పిచ్చకుంట్లోళ్ళు, బుర్రకతలు చెప్పే శారదలు, బుడబుక్కలోళ్ళు, ఏవయిన్రో... ఆ ఆటలూ పాటలూ ఏవయినయో? 'ధ్వంసమైనా బాగ్దాద్‌లా వుంది" గ్రామీణ సాంస్కృతిక జీవనం అంటూ 'విధ్వంసాన్ని' చూపెట్టారు.

కోడి తన పిల్లల్ని కాపాడుకోవడం కోసం కాకిపై ఎలా తల్లి కోడి విరుచుకు పడుతుందో అలాగే పందులు తమ పిల్లల్ని కాపాడుకోవడం కోసం, కుక్కలు, చీమలు ఎంత తిరుగుబాటును వాటి ఉనికి కోసం సహజంగా ప్రయత్నిస్తున్నాయో అదే విధంగా ఉనికిని కోల్పోతూ దోపిడీలకు గురవుతున్న జనం అప్రమత్తమవ్వాలని 'అంకురం'లో ఉదాహరణలతో వివరిస్తారు.

చివరగా దోచుకునే వాళ్ళు ఉన్నా సమాజంలో తిరగబడేవాళ్ళు వుంటారు. కారణాలు తెలుసుకున్నపుడు తిరగబడకుండా వారిని ఆపడం ఎవరి వల్లా కాదు. రచయితగా ఇది చెప్పటం నా బాధ్యతంటూ 'వ్యూఫైండర్'లో వివరిస్తారు.

మొత్తంగా ప్రపంచీకరణ ఫలితంగా విధ్వంసమవుతున్న జీవనాలు, మానవ సంబంధాలు, వృత్తులు, వ్యక్తిత్వాలు చిత్రించిన సంకలనంగా చలివేంద్రం మన ముందుంటుంది.



# సంవిధాన, సంభాషణా స్రష్ట

డాక్టర్ మంతెన సూర్యనారాయణరాజు

నవరసాల్లోనూ హాస్యరసాన్ని పండించటం చాలా కష్టం. అటువంటి హాస్యరసాన్ని తన లేఖిని ద్వారా తెలుగు వెండి తెరకు అందించిన హాస్య బ్రహ్మ డి.వి. నరసరాజు. విజయవాడలో మాతా మహుల ఇంట జన్మించి హిందూ హైస్కూల్లోను, గుంటూరు హిందూ కాలేజీలోను, మద్రాసు లయోలా కాలేజీలోనూ విద్యనభ్యసించారు. కలిగిన కుటుంబం నుంచి రావడం వల్ల లలిత కళల పట్ల, అందునా నాటకాది సాహిత్యం పట్ల అభిమానాన్ని పెంచుకున్నారు. 'నాటకం' అనే నాటకాన్ని, వీలునామా అనే మరో నాటకాన్ని వ్రాసి ఆనాటి నుండీ ఆఖరి ఊపిరి వదిలేదాకా రచననే తన వృత్తిగా చేసుకుని అలుపెరుగని రచయితగా పరిణితి చెందారు.

ఆనాడు ఆయన 'నాటకాన్ని' చూసిన పెద్దలు కె.వి. రెడ్డి మద్రాసు రమ్మని ఆహ్వానించారు. నరసరాజు నాటక ప్రదర్శన ఏర్పాటు చేసిన వ్యక్తి గుడివాడకు చెందిన కాజ వెంకట్రామయ్య. 1951లో మద్రాసు వెళ్ళి పెద్దమనుషులు, దొంగరాముడు చిత్రాలకు స్క్రిప్టు రైటర్‌గా పనిచేశారు. రెండో చిత్రం తీసింది అన్నపూర్ణా సంస్థ. నరసరాజుగారు పనిచేసిన ఈ రెండు చిత్రాలకూ కె.వి. రెడ్డి దర్శకత్వం వహించారు. పెద్ద మనుషులు చిత్రం 1954లో విడుదలై ఘన విజయం సాధించింది. స్వాతంత్ర్యానంతర భారతంలో 'పెద్ద మనుషులు' అన్నమాట అర్థం మారిందని ఆనాడే చెప్పింది. 1955లో నిర్మించిన దొంగరాముడు చిత్ర నిర్మాతలు దుక్కిపాటి మధుసూదనరావు, అక్కినేని నాగేశ్వరరావు. ఆ చిత్రం కూడా బంపర్ హిట్ అవడంతో నరసరాజు వెనుదిరిగి చూసింది లేదు. చిత్ర సంభాషణల కర్తగా చెన్నైలో నివాస మేర్పరచుకున్నారు.

మొదటి చిత్రం పెద్ద మనుషులైతే, చివరి చిత్రం పి. భానుమతి 'అసాధ్యురాలు'. సంవత్సరం 1994. కారు దిద్దిన కాపురం అనే చిత్రానికి ఆయన దర్శకత్వం కూడా చేశారు. దాన్ని రామోజీ రావు నిర్మించారు. అదీ విజయం సాధించింది. రాజుగారి నాటికలు గురించి చెప్పాల్సొస్తే వాపస్, ఆత్మహత్య, ఈ ఇల్లు అమ్మబడును, స్వర్గసీమ, కోడిపుంజులు, అంతర్వాణి, ప్రేమ పక్షులు వంటి ఇంకా కొన్ని లఘు నాటికలు. రేడియో కోసం రాసినవైతే 'బస్తీలో బహు కుటుంబీకుడు' మొదలైనవి. ఆ రోజుల్లో 'వాపస్' నాటిక ప్రదర్శించని విద్యాసంస్థ ఉండేది కాదంటే అందులో కొంచెం కూడా అతిశయోక్తి లేదు. సినిమా సంభాషణల విషయానికొస్తే ఆయన బాణీ ఆయనదే. అనుకరింపరాని, ప్రత్యేకత గలది. మాటలనే ఈటెల్ని గుచ్చగల దిట్ట. హాస్యరసస్ఫోరకమైన డైలాగులు రాసి ఎటువంటి మొండి మనిషినైనా నవ్వించగల నేర్పు ఆయన కలానికి పుష్కలంగా ఉంది.

ఆయన లేఖిని నుంచి వెలువడ్డ గుండమ్మ కథ చిత్రం గురించి ఎంతైనా వ్రాయొచ్చు. 'ఇదిగో గుండత్తా! ఈ గంటన్న మాటింటే నా బొచ్చెలో రాయే! అలాగే యమగోల. నిజానికి గుండమ్మ చిత్రానికి మూలం కన్నడంలో వచ్చిన 'మనతుంబెదహెణ్ణు' అందులో గుండమ్మకు మగడుంటాడు. ఆ పాత్రకు ప్రాధాన్యం లేదని చక్రపాణిగారు దానిని తీసివేయించారు. ఇక్కడో విషయం చెప్పుకోవాలి. చక్రపాణి ప్రభావం రాజుగారి మీద అదే రచయితగా కొంత ఉండొచ్చునని పెద్దలంటూ వుండేవారు. ఆయన ముక్కు సూటి మనిషే! ఈయనా ముక్కు సూటి మనిషే!

నాగిరెడ్డి, చక్రపాణి, బి.ఎన్. రెడ్డి, పింగళి తదితరులతో విజయ వాహినిలో తన జ్ఞాపకాలు ఆయన ఆసక్తికరంగా రాశారు.

యమగోల, రాము, రాముడు – భీముడు, కోడలు దిద్దిన కాపురం, లేత మనసులు, రంగుల రాట్నం, నాదీ ఆడజన్మే, భక్తప్రహ్లాద యిలా ఏ చిత్రం గురించి సంభాషణాపరంగా ఎంత చెప్పుకున్నా తక్కువే అనిపిస్తుంది. రసాభాస కాకుండా అన్ని రసాల్నీ సమపాళ్ళలో పోషించగల రచనా ప్రావీణ్యం ఆయన కలానిది. వారు పనిచేసిన చిత్రాల్లో ఆయన స్వంత కథలు తక్కువేనని చెప్పాలి. ఎక్కువ అనువాదాలు, అనుసరణలు, వేరే రచయితకు తాను సంభాషణలు అందించడం ఎక్కువగా జరిగినట్లు ఆయనే చెప్పేవారు. అయితే స్క్రీన్‌ప్లేలో ప్రత్యేకత వుండేది.

నలుగుర్నీ నవ్విస్తూ మాట్లాడటం, సీరియస్ విషయాన్ని నవ్వుతూ చెప్పడం ఆయనకు బాగా తెలిసిన అంశం. రచయితగా నాటకాలు రాస్తున్నప్పుడు, నటుడుగా నటిస్తున్నప్పుడు ఆయన

# ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం



ప్రముఖ రచయిత, విమర్శకుడు తెలుగు విశ్వవిద్యాలయం మాజీ ఉపాధ్యక్షులు డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం ఆగష్టు 15వ తేదీ హైదరాబాదులో కన్నుమూశారు. ఆయన కొంతకాలంగా అస్వస్థులుగా వున్నారు. 1935 సెప్టెంబరు 10న జన్మించారు. విద్యార్థి దశ నుంచే కళా సాహిత్య కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేవారు. తర్వాతి కాలంలో నలభై గ్రంధాల వరకూ రచించారు. అందులో కవితలు, సమీక్షలు, వ్యాసాలు వగైరాలన్ని వున్నాయి. సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు అన్న శీర్షికన ఆంధ్ర ప్రభలో మంచి వ్యాసాలు రాశారు. తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో మహాభారత వ్యాఖ్యానాన్ని ప్రకటించారు. ఆయన రచించిన వీర రసం గ్రంధానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు, 'తెలుగు సాహిత్యంపై ఆంగ్లభాషా ప్రభావం' అన్న గ్రంధానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు చాలా కాలం కిందటే లభించాయి. తను స్వయంగా జీవీఎస్ అవార్డు ఏర్పాటు చేసి సాహిత్య కారులకు అందిస్తూ వచ్చారు.

ప్రసిద్ధ సాహిత్య సంస్థ యువ భారతిలో ఆయన దీర్ఘ కాలం పాటు కీలక పాత్ర వహించారు. తెలుగు అధ్యాపకులుగా నలభై ఏళ్ల పాటు సేవలందించారు. నవ్య సంప్రదాయవాదిగా, వక్తగా సభా వ్యాఖ్యాతగా, విశ్వ విద్యాలయాధిపతిగా అనేక రూపాలలో జన ప్రియుడైన సహృదయ సాహిత్యకారుడు. ప్రస్థానం పత్రికకు అనేక రూపాల్లో సహకరించేవారు.

జీవీఎస్ మృతి పట్ల పలువురు సాహితీ మిత్రులు, పెద్దలూ ప్రగాఢ సంతాపం తెలిపారు. హైదరాబాదులో సంతాప సభ జరిగింది.

---

ఎం.ఎన్. రాయ్ రచనలను ఆరాధించాడు. అంతేకాదు రాయ్‌ని కలిసి మాట్లాడారు. రాయిస్టు అనుయాయి ఆయన. నాగిరెడ్డిగారి మాటల్లో చెప్పాల్సొస్తే నరసరాజు మోస్ట్ ఫెసిమిస్ట్. క్రమశిక్షణకు మారుపేరున్నూ. అవే కళ్ళు, పూజాఫలం, రాజమకుటం, చుట్టాలున్నారు జాగ్రత్త, మూగనోము, చిట్టి చెల్లెలు వంటి చిత్రాలెన్నో ఆయన రాసిన సంభాషణలకు మైలురాళ్ళుగా నిలిచి పోయాయి.

ఆయన ఎక్కువ కుటుంబ కథా చిత్రాలకు సంభాషణలు అందించారు. అలాగని పాంటసీ, పౌరాణిక, చారిత్రక చిత్రాలకు అందించలేదని కాదు. వాటిలో రేణుకాదేవి మహోత్సవం (పౌరాణికం), రాణి చెన్నమ్మ (చారిత్రకం), వీరపాండ్యకట్ట బ్రహ్మన (చారిత్రకం), కర్ణ, భక్త ప్రహ్లాద (పౌరాణికాలు) ఇలా ఎన్నో చిత్రాలున్నాయి. శతాధిక చిత్రాలకు సంభాషణలు అందించారు. నిర్మాతలు మెచ్చిన రచయిత కూడా డి.వి.ఎన్. రాజు. బి. నాగిరెడ్డి, ఎ.వి. మెయ్యప్ప చెట్టియార్, ఎన్.టి. రామారావు, బి.ఆర్. పంతులు (పద్మినీ పిక్చర్స్), భానుమతి, సావిత్రి, ఎస్.వి. రంగారావు, రామోజీరావు, డి. రామానాయుడు, పుట్టన్న వంటి వారు ఆయనంటే ఎంతగానో అభిమానించే వ్యక్తులు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందంటారు. కానీ కలం పట్టగానే హాస్యరసం చిప్పిల్లే సంభాషణలు కూర్చి, చిత్ర పరిశ్రమను సుసంపన్నం చేశారు. మంచి కథ సిన్మాకు ఒక ఎత్తయితే, సమయోచిత, సందర్భోచిత సంభాషణలు మరో ఎత్తు. తెలుగు సంస్కృత భూయిష్టమైన సమాసాల్ని పలకాలంటే ఎస్.వి. రంగారావు అని. ఆయనకు సాటైన వ్యక్తి ఆయనే అని. రాజుగారు నాతో ఒక్కసారి అన్నట్లు గుర్తు. ఆ చిత్రం భక్తప్రహ్లాద. అందులో రంగారావు హిరణ్యకశిపుడుగా జీవించారంటే నమ్మాలి మరి. ఎం.వి.ఎం. వారు తమిళంలో 'నానుం ఒరు పెణ్' అనే సిన్మా తీశారు. దాన్ని ఎ.వి.ఎం. రంగారావు భాగస్తులుగా కలిసి 'నాదీ ఆడజన్మే' చిత్రంగా రీమేక్ చేశారు.

ఈనాడు పత్రికలో 500 – 600 వారాల పాటు 'అక్షింతలు' అనే 'కాలం' ఎంతో హాస్యరసస్ఫోరకంగా రాజకీయాలను వ్యంగ్యంగా చురకలంటిస్తూ విమర్శించడం మనం ఎరుగుదుం. ఎందరో రచయితలు పుడుతున్నారు. కలాలు పడుతున్నారు. కొందరే అంటే ఒక ఆత్రేయ, పింగళి, సముద్రాల, సదాశివబ్రహ్మం, ముళ్ళపూడి వెంకటరమణ, జంధ్యాల వంటి వారు తెలుగు చిత్రరంగం ఉన్నన్నాళ్ళూ చిరంజీవులే. అదే విధంగా డి.వి. నరసరాజు కూడా భౌతికంగా మన మధ్య లేకపోయినా తానందించిన సంభాషణల ద్వారా చిరకాలం గుర్తుండిపోతారు. వారికిదే అక్షరాంజలి.

(రచయిత నరసరాజు నాటకాలపై పరిశోధన చేశారు)

# శతపత్రకారుడు 'గడియారం'



**ఇంద్రకంటి వేంకటేశ్వర్లు**

దక్షిణ కాశి అలంపురం గుండె ఛిద్రమయింది. అలుపెరుగని శ్రామికుడు, విద్యన్మూర్తి – తెలంగాణా, రాయలసీమ సంస్కృతుల వారధి – గడియారం రామకృష్ణ శర్మ తమ 87వ ఏట 2006 జూలై 25న కన్నుమూశారు. ఒక సంచార విజ్ఞాన సర్వస్వం, ఒక నిరంతర జ్ఞాన ప్రసారం స్తంభించింది. ఆ జీవితం విస్తృతి అక్షరాల చట్రంలో ఇమడనంత అపారం. ఎక్కడో అనంతపురం జిల్లాలో జన్మించిన గడియారం వారు కుటుంబ కారణాల దృష్ట్యా అలంపురం ఆలయం చేరారు. అక్కడే చివరి వరకు వున్నారు. దేవాలయ శిల్పాలకు సంబంధించిన జ్ఞానం కావాలి కాబట్టి దేవాలయ శిల్పశాస్త్రం ఇక్నోగ్రఫీని అధ్యయనం చేశారు. ఆ శాస్త్ర గ్రంథాలకై ఆంగ్లభాషను అధ్యయనం చేశారు. ఆ శాసనాలు ఎక్కువగా కన్నడ భాషలో ఉన్నందున వారు విధిగా కన్నడ భాషను మధించవలసి వచ్చింది. ఆ మధనం వారు కన్నడంలో రన్న మహాకవి రచించిన "గదాయుద్ధ" ను తెలుగు పద్యకావ్యంగా అనువదించడం, దానికి రాష్ట్ర ప్రభుత్వం ఉత్తమ అనువాద పురస్కారం లభించడం దాకా సాగింది. ఇక అలంపురమే వారి సర్వస్వం కావడంతో అక్కడ నిజాం పాలనలో సాగుతున్న అరాచకాలను, అణచివేతలను అడ్డుకోవడానికి వారిలో నిద్రాణంగా వున్న ఆ యోధ స్ఫూర్తి జాగృతం కావడం, నిజాం వ్యతిరేక పోరాటాలలో పాల్గొనడం, తదాదిగా కాంగ్రెస్‌లూ అనుబంధం, అందులో బాధ్యతలు ఏర్పడ్డాయి.

వేలూరి శివరామశాస్త్రి శిష్యరికం వల్ల వారిలో కులమతాల పట్టింపులు అధిగమించారు. "అప్పుడు మాల మాదిగలను ఎవరూ ఇళ్ళలోనికి రానిచ్చేవారు కాదు. నేను వారిని కార్యకర్తలుగా తీసుకొని మా ఇంట్లో కూచోబెట్టుకుంటున్నాను. తక్కిన యువ కార్యకర్తలకు ఇది నచ్చకపోయినా తరువాత పరిస్థితులను గ్రహించి రాజీపడినారు అని ఆయన కథలో రాశారు. 1941లో మహబూబ్‌నగర్‌జిల్లా ఆంధ్ర మహాసభలు దేవరకద్ర స్టేషన్ దగ్గరలో ఉండే బంద్రపల్లెలో జరిగాయి. ఆ సభలకు అగ్ర నాయకులు మందుముల రామచంద్రరావు, రావి నారాయణరెడ్డి మరికొందరు వచ్చినారు. ఆ సభలలో అందరికీ సహపంక్తి భోజనం. హరిజనసేవా సంఘం వలంటీర్లు నీళ్ళు వడ్డించేవారు." (శతపత్రము – 52). ఇది 65 సంవత్సరాల క్రితం ఒక మారుమూల గ్రామంలో జరిగిన సంఘటన.

అంటరానితనం, స్త్రీల పట్ల వివక్షలకు వ్యతిరేకంగా ముందుండి పోరాటాలు నడిపారు. అలంపురం, ఆ పరిసర ప్రాంతాలలో దళితులకు దేవాలయ ప్రవేశం కల్పించారు. తను స్వయంగా ఒక బాల వితంతువును వివాహమాడి, 60 సంవత్సరాలు పొరపొచ్చాలు లేని దాంపత్య జీవితం సాగించారు. తను చేసిన ఈ పనికి కుల సంఘం బహిష్కరించినా జంకలేదు. తన కుమారులు కులాంతర వివాహాలు చేసుకున్నా, "మీరు చేసింది శాస్త్ర విరుద్ధం కాదు. ఆచార విరుద్ధం మాత్రమే. నేను శాస్త్రాన్ని మాత్రమే గౌరవిస్తాను. కనుక మీరు నా ఇంటికి రావచ్చు. నా కోడళ్ళు, నా వియ్యంకులకు కూడా స్వాగతం. అయితే మీ అమ్మ ఆచారం పట్ల విశ్వాసం వుంది. భర్తగా ఆమె విశ్వాసాలను గౌరవించడం నా విధి. అందువల్ల ఆమె పూజామందిరంలోకి మాత్రం మిమ్ములను అనుమతించను. మిగతా అన్ని విధాలా మీరు నా కుటుంబ సభ్యులే" అని చెప్పి, కొన్ని వందల కుటుంబాలకు పరిష్కారం లేని జటిల సమస్యగా పరిణమించిన అంశానికి అతి సులువైన పరిష్కారం చూపిన మానవీయులు.

గడియారం రామకృష్ణ శర్మ దాదాపు మూడు దశాబ్దాలు ఆంధ్ర సారస్వత పరిషత్ కార్యదర్శిగా, సాహిత్య అకాడమీ సభ్యులుగా 'సుజాత' సహిత్య పత్రిక సంపాదకులుగా ఆంధ్ర సాహిత్యానికి చేసిన సేవ అమూల్యం. సాహిత్య అకాడమీ కొరకు "కేయూర బాహు చరిత్ర", "సింహాసన ద్వాత్రింశిక" కావ్యాలను పరిష్కరించి చక్కటి పీఠికలతో వెలయించారు. పరిషత్ ద్వారా తెలుగులో విశారద పరీక్షలు, పండిత శిక్షణా కళాశాల నిర్వహించారు. వాటికి ప్రభుత్వ గుర్తింపును సాధించారు. ఆ యోగ్యతల ద్వారా కొన్ని వందల మంది తెలుగు పండితులుగా నియామకాలు పొందగలిగారు. పరిషత్‌కు సుమారు 5000 విలువైన గ్రంథాలతో ఒక అపురూప గ్రంథాలయాన్ని సమకూర్చారు. నాటి ముఖ్యమంత్రి స్థాయి వ్యక్తి పరిషత్‌ను చీల్చి నిర్వీర్యం చేసి, తమ జేబు సంస్థగా వాడుకోవడానికి చేసిన ప్రయత్నాలను, వాటిని తాము ఎదుర్కొని, పరిషత్ నిర్వీర్యం కాకుండా కాపాడిన విధానాన్ని వారు తమ ఆత్మకథలోనే విపులంగా వివరించారు (స్వీయ చరిత్ర – పుటలు 120, 121). 1953లో పరిషత్ సప్తమ వార్షికోత్సవ సభలను అలంపురంలో అపూర్వంగా నిర్వహించటం ద్వారా వారు ఆంధ్రదేశంలోని కవి పండితులందరి గౌరవానికి పాత్రులయ్యారు. అయితే, మల్లంపల్లి సోమశేఖరశర్మపట్ల అవ్యాజ గౌరవం వల్ల కావచ్చు, సురవరం ప్రతాపరెడ్డి సాన్నిహిత్యం వల్ల కావచ్చు గడియారం వారికి సాహిత్యం పట్ల కంటె చరిత్ర పరిశోధనపై



## డాక్టర్ హరీష్ కన్నుమూత

ఖమ్మం పట్నంలో ప్రముఖ వైద్యులు, ప్రగతిశీలవాది, సాహిత్య మిత్రులు డాక్టర్ కె. హరీష్ అనారోగ్యంతో ఇటీవల కన్నుమూశారు. వయస్సు 64 సంవత్సరాలు. ఆయన మంచి విమర్శకుడు కూడా. ఎంతోమంది రచయితల వెనక నిలిచి మంచి పుస్తకాలు వెలువడటానికి సహకరించిన సహృదయులు. సాహితీ స్రవంతికి ప్రారంభం నుంచి అండగా వున్న శ్రేయోభిలాషి. 2006 ఫిబ్రవరిలో ఖమ్మంలో పెద్ద ఎత్తున జరిగిన 'కార్యశాల' ఆహ్వాన సంఘాధ్యక్షులు. అనారోగ్యంతో వున్నా అభిమానంగా పాల్గొన్నారు. ఆయన మృతి సాహితీ స్రవంతికి పెద్ద వెలితి.

ఆయనకు 'ప్రస్థానం' జోహారులర్పిస్తోంది. కుటుంబ సభ్యులకు ప్రగాఢ సంతాపం తెల్పుతున్నది.

---

మక్కువ అధికం. వారి సాహిత్య వ్యాసాలు, ప్రసంగాలు సైతం" నాటి చారిత్రక నేపథ్యం - సాంఘిక పరిస్థితులు"తో ప్రారంభం అవుతాయి. అలంపురం, ఆ పరిసర ప్రాంతాలన్నింటినీ శోధించి, లభించిన అనేక శిలా తామ్ర శాసనాలను పరిష్కరించి ప్రచురించారు. వారు ప్రచురించిన "వినయాదిత్యుని పల్లెపాటి తామ్ర శాసనము" శాసన పరిశోధనకు ఒక గీటురాయి. చరిత్రకు సంబంధించి, సాహిత్యానికి సంబంధించి, ధర్మానికి సంబంధించి మొత్తం 40కి పైగా గ్రంథాలు ప్రచురించారు. శ్రీ మాధవ విద్యారణ్య చరిత్ర కన్నడంలోకి కూడా అనువదింపబడి, అక్కడి ప్రముఖుల ప్రశంసలు పొందింది.

రామకృష్ణ శర్మ జీవితమే ఒక ఉద్యమం. రాజకీయ రంగంలో ఉంటూ, క్రూర నిజాం పాలనకు వ్యతిరేకంగా ఉద్యమించి, కర్నూలు కేంద్రంగా 'భాగ్యనగర్ రేడియో' పేర రేడియో కేంద్రం స్థాపించి, నిజాం పాలనకు వ్యతిరేకంగా తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషల్లో వార్తా ప్రసారాలు నిర్వహించారు. తెలంగాణా ప్రజా ప్రభుత్వం ఏర్పడిన అలంపూర్ తాలూకాను గద్వాలలో విలీనం చేయడానికి జరిగిన ప్రయత్నాలను నిరోధించి, దాన్ని ప్రత్యేక తాలూకాగా ఉంచడంలో కృతకృత్యులయ్యారు. అలంపురం పరిసర గ్రామాలలో చాలా చోట్ల వయోజన విద్య, గ్రంథాలయోద్యమాలు నిర్వహించి పలు గ్రామాల్లో గ్రంథాలయాలు స్థాపించారు. పోలీస్ యాక్షన్ తరువాత అలంపురం ముస్లింలు భయంతో గ్రామం విడిచి వెళ్ళిపోగా, స్థానికులు కొందరు వారి ఇళ్ళపై దాడులు చేసి, దొరికిన విలువైన వస్తువులన్నింటిని దోచుకుపోయారు. అది అక్రమంగా భావించిన శర్మ స్థానిక యువకులతో శాంతి సంఘాన్ని స్థాపించి, అలా దోచబడిన వస్తువులన్నింటిని తిరిగి సేకరించి, పోలీసు స్వాధీనం చేశారు. ఊరు విడిచి వెళ్ళిన వారందరూ తిరిగి రావచ్చుని, వారి ధన ప్రాణాలకు ఎలాంటి హాని జరగదని దండోరాలు వేయించి, తిరిగి వచ్చిన వారికి వారి వారి వస్తువులను భద్రంగా అప్పచెప్పారు. ఈ సందర్భంగా వారి వ్యాఖ్య "ఈ సంఘటనతో సమయం అనుకూలిస్తే చాలామంది పెద్ద మనుష్యులు కూడా పరద్రవ్యాలు అపహరిస్తారని తెలుసుకుంటిని" (స్వీయచరిత్ర - పుట 94)

"నేను ప్రాచీనుల్లో నవీనుణ్ణి - నవీనుల్లో ప్రాచీనుణ్ణి" అని తరచూ నవ్వుతూ అనే గడియారం రామకృష్ణశర్మ తమ జీవిత కాలంలో జరిగిన అనేకానేక విషయాలను నిర్భీతిగా, నిష్పాక్షికంగా తమ స్వీయచరిత్ర "శతపత్రం"లో వివరించారు. "నేను విద్వాంసుడను కాను. నిత్యజీవితానికి తగిన సంపాదనపరుడనూ కాదు. కాని యోగ్యతను మించి గౌరవ సత్కారాలు పొందినాను. దైన్యం లేని జీవనం సాగించినాను'' అని రాసుకున్న ఆయన నమ్రత ఆదర్శప్రాయమైంది. ఈ గ్రంథం 20వ శతాబ్దపు సాంఘిక, రాజకీయ చారిత్రక సంఘటనల సమగ్ర విశ్లేషణ. తెలుగులో వీరేశలింగం పంతులు, టంగుటూరి ప్రకాశం పంతులు, తిరుమల రామచంద్రవంటివారి స్వీయ చరిత్రలతో పోల్చదగిన గ్రంథం ఇది. సందిగ్ధతలకు, మొగమోటాలకు తావులేని ఈ రచన ఆంధ్రుల సాహిత్య చరిత్రనూ, సాంఘిక చరిత్రనూ కూడా మరింత సుసంపన్నం చేస్తుందనడం అతిశయోక్తి కాదు. వారి మృతితో దేశం ప్రాచీనతకూ - ఆధునికతకూ మధ్య నిలిచిన ఒక చివరి వారధిని కోల్పోయినట్లే.

నైతిక ప్రమాణాలకు లోబడి కొన్ని విలువలను ఆదర్శంగా తీసుకోవడం, ఆ విలువల పట్ల నిజాయితీ, నిబద్ధత కలిగి ఉండటం, వాటిని సమాచరించే మార్గంలో ఎదురయ్యే అవరోధాలను ధీమత్వంతో ఎదుర్కోవడం ఇదీ గడియారం రామకృష్ణశర్మ జీవితానికి సంక్షిప్త సూత్రీకరణ.

# విమలా శాంతి సాహిత్య పురస్కారం, 'మహాజన' తత్వ సమాలోచన

'విమలా శాంతి' సాహిత్య సాంఘిక సేవా ట్రస్టు సెప్టెంబర్ 3న అనంతపురం ప్రభుత్వ డిగ్రీ కళాశాల డ్రామా హాలులో విమలాశాంతి సాహిత్య పురస్కారోత్సవం, దళిత బహుజన తత్వ సమాలోచన సభ జరిగాయి.

కథా రచయితగా తెలుగు సాహిత్యంలో తనకంటూ ఒక స్థానాన్ని సంపాదించుకున్న డా॥ శాంతి నారాయణ తనకూ తన శ్రీమతి విమల గారికీ అరవై వసంతాలు నిండిన సందర్భంలో తమ కుటుంబం పేరిట ఈ పురస్కారాలను ఇద్దరు ప్రముఖ రచయితలకు అందజేశారు.

'మహాజన మంటపం'గా రూపొందిన విమలాశాంతి సాహిత్య పురస్కారోత్సవ సభకు ముఖ్య అతిథులుగా రాష్ట్ర మంత్రులు కోనేరు రంగారావుగారు, ఎన్. రఘువీరారెడ్డి విశిష్ట అతిథులుగా డాక్టర్ శైలజానాథ్ - ఎంఎల్ఎ., రాగె పరశురాం - మేయర్ హాజరయ్యారు. ప్రత్యేక ఆహ్వానితులుగా ప్రముఖ నాటక రచయిత డా॥ విజయభాస్కర్, కర్నూలు డిప్యూటీ కలెక్టర్ శ్రీమతి నాగమ్మ ఫూలే, సూర్యారావు బి.సి. టైమ్స్, గౌతమ్ రాష్ట్ర మహాజన పార్టీ నాయకులు ప్రధాన వక్తలుగా వచ్చిన నారగోని వంటి వారందరూ పాల్గొన్నారు. ఇటీవల జిల్లాలో ఎన్నికైన దళిత బహుజన వర్గాలకు చెందిన మండలాధ్యక్షులూ, జిల్లా పరిషత్ ప్రాదేశిక సభ్యులూ, పలువురు నాయకులు మహాజన మంటపాన్ని అలంకరించి సన్మానం పొందారు.



'విమలాశాంతి' కథా పురస్కార గ్రహీత డా॥ రాసాని. పురస్కారం అందజేస్తున్న ముఖ్యఅతిథి వ్యవసాయ శాఖామాత్యులు ఎన్. రఘువీరారెడ్డి

మాల మహానాడు నాయకుడైన దాసరి ఆదినారాయణ ఉద్దీపన గీతంతో ప్రారంభమైన సభకు డాక్టర్ జూపల్లి ప్రేమ్‌చంద్ అధ్యక్షత వహించి సమాజంలోని అనేక అసమానతల కారణంగా 'మహాజన' సమైక్యత ఎంతో అవసరమని అన్నారు. ఈ దేశంలో మహాజనులందరూ ఐక్యమైన రోజున రాజ్యాధికారం వాళ్ళదేనని, ట్రస్టు ఛైర్మన్ డాక్టర్ శాంతి నారాయణ సభా ప్రస్తావన చేస్తూ శ్రమజీవులైన దళిత బహుజన వర్గాల నుంచి ఎదిగిన తాను తన వర్గ ప్రజల వికాసం కోసం తన వంతుగా సహాయపడటం కోసమే సాహిత్య పురస్కారాలను ఏర్పాటు చేశానని, సామాజిక సమన్యాయానికి దూరం చేయబడుతూ, సాంఘిక సాంస్కృతిక పీడనలకు గురవుతున్న తన వర్గ ప్రజలను ఒకచోట కలిపి ఆలోచింప చేయడం కోసం దళిత బహుజన తత్వ సమాలోచన సభకు ఆహ్వానించానని వివరించారు.

పురస్కారం కోసం ఎంపికైన డాక్టర్ రాసాని వెంకట్రామయ్య, డాక్టర్ చల్లపల్లి స్వరూపరాణి గార్లను ట్రస్టు పక్షాన ముఖ్య అతిథులు ఘనంగా సత్కరించి అభినందించారు. పురస్కారం కింద రచయితలిద్దరికీ పదివేల రూపాయల (రూ. 10,000/-) చొప్పున ట్రస్టు, ట్రస్టు ఛైర్మన్ విమలా శాంతి నారాయణలు అందజేశారు.



'విమలాశాంతి' కవితా పురస్కారం అందుకుంటున్న చల్లపల్లి స్వరూపరాణి, అందజేస్తున్న ముఖ్య అతిథి పురపాలక శాఖామాత్యులు కోనేరు రంగరావు, ట్రస్ట్ ఛైర్మన్ డా॥ శాంతి నారాయణ

మంత్రి రఘువీరారెడ్డి మాట్లాడుతూ దళిత బహు జనులందరూ సమైక్యం కావలసిన ఆవశ్యకతను గురించి నొక్కి చెప్పారు. కోనేరు రంగారావుగారు ఆవేదన పూర్వకంగా ప్రసంగిస్తూ అనైక్యత, అవిద్య కారణంగా దళిత బహుజనుల్లో వెనుకబాటుతనం కొనసాగు తోందని, ఇతరులను నిందించడం కంటే మన మంతా ఐక్యం కావడం అవసరమని చెప్పారు. గత కాలంలో ఆకలి విలువ తెలియని వాళ్ళు శ్రమశక్తిని గుర్తించని వాళ్లు కాలక్షేపం కోసం రాసిన సాహిత్యాన్నే ఈ రోజు మనం ఎంతో విలువలైన దానినిగా గౌరవిస్తున్నామని, చారిత్రక దృష్టితో ఆ కథలను దర్శించి పరిశీలిస్తే ఈ దేశంలో దళిత బహుజనులకు జరిగిన కీడు ఏమిటో అర్థమవుతుందని నాగమ్మ ఫూలే పేర్కొన్నారు. ప్రధాన వక్తగా వచ్చిన నారగోని ఉపన్యసిస్తూ నేడు రాజ్యాధికారం చెలాయిస్తున్న అగ్రవర్ణాలు ఒకప్పుడు వెనుకబడిన వర్గాలేనని, అయితే వారు ఆనాడే మేల్కొని సమైక్యంగా పీఠాధి రాజ్యాధికారం సాధించారని అటువంటి పోరాట పటిమ లేనిదే సమైక్యం కానిదే దేశంలో బహుజన రాజ్యం రాదన్నారు.

అంతకుముందు విమలాశాంతి సాహిత్య పురస్కారాలకు స్థానిక న్యాయ నిర్ణేతలైన ఆచార్య రాచపాళెం, రాధేయ కథా కవితా సంపుటాలనూ, వాటిలో ఆవిష్కరింపబడిన దళిత బహుజన జీవితాన్నీ క్లుప్తంగా సమీక్షించారు.

ఈ సందర్భంగా కోనేరు రంగారావు గారు, దేశంలోని దళిత బహుజనులందరూ సమైక్యం కాలేక పోవడానికి బలైన కారణాలున్నాయని, అంబేద్కర్ బౌద్ధమతాన్ని కాకుండా క్రైస్తవ మతాన్ని అవలంబించి ఆ దిశగా దళిత బహుజనులను నడిపి ఉంటే సమైక్యత సాధ్యమై వుండేదని అన్నప్పుడు సభలో కొంత కలకలం బయలుదేరింది. ఆయన అభిప్రాయాన్ని కొందరు తీవ్రంగా వ్యతిరేకించగా, కొందరు సమర్థించారు. దేశంలోని దళిత బహుజనులందరూ ఆశించినంత తొందరగా సమైక్యం కాలేదన్న బాధలోనుంచి కోనేరు రంగారావుగారు అలా మాట్లాడారని, అంబేద్కర్ని కించపరచడం ఆయన ఉద్దేశం కాదని అభిప్రాయపడ్డారు. సభకు అన్ని వర్గాల నుంచీ భారీగా జనం తరలివచ్చారు.



'విమలాశాంతి' సాహిత్య పురస్కారోత్సవ సభకు హాజరైన సాహిత్యాభిమానులు, రచయితలు

- ఎస్వీప్రసాద్,
కార్యదర్శి, జిల్లా రచయితల సంఘం

# సమీక్ష మొక్కుబడి కాదు, కరదీపిక కావాలి!

సమీక్షలో విమర్శ ఉండవచ్చు. కొంతైనా ఉంటుంది. అయితే ఇటీవల సమీక్ష వేరుగా, విమర్శ వేరుగా పరిగణింప బడుతోంది. పుస్తక పరిచయమే 'సమీక్ష' అనీ, లోతుపాతులు వివరించేది – సూక్ష్మ పరిశీలన చేసేది 'విమర్శ' అనీ భావించబడుతోంది. ప్రతి పత్రిక 'సమీక్ష'కి పుటలు కేటాయిస్తోంది. స్థలాభావం, ఆర్థికభారం వంటి కారణాల వల్ల ఒక పుట లేదా రెండు పుటలు మాత్రమే సమీక్షకి కేటాయించబడుతోంది. దీనివల్ల సమీక్ష కేవలం పరిచయ వ్యాసంగానే తప్ప విమర్శనాత్మకంగా ఉండే అవకాశం కోల్పోతున్నది. అందుకనే కొందరు సమీక్ష విమర్శ వంటిది – అంటున్నారు. సమీక్షలో విమర్శ పరిధి తక్కువ.

డాక్టర్ ద్వా.నా. శాస్త్రి

సమీక్ష అనేది వచన ప్రక్రియకి సంబంధించినది. అయితే పూండ్ల రామకృష్ణయ్య సంపాదకత్వంలో నూరేళ్ళ క్రితం వెలువడిన "అముద్రిత గ్రంథ చింతామణి" అనే పత్రికలో సమీక్షలు పద్యరూపంలో వుండటం గమనిస్తాం. సమీక్ష అనేది వ్యాసానికి సంబంధించినది కూడా. అందుకే 'సమీక్షా వ్యాసాలు' అనే అంటారు. పత్రికా వ్యాప్తి వల్లనే గ్రంథ సమీక్ష విస్తరిల్లింది. ప్రాధాన్యం సంతరించుకుంది. గ్రంథ సమీక్షకి పలు పత్రికలు – గ్రంథావని, సమీక్ష, పుస్తక ప్రపంచం, కృతి, తూలిక, సమీక్షణం, కొత్త పుస్తకాలు, తూలిక, ఈ వారం పుస్తకం... వంటి పేర్లతో పాటు "బుక్‌షెల్ఫ్", "బుక్ చాట్" వంటి ఇంగ్లీషు పదాలూ వాడటం వుంది.

**సమీక్ష అంటే...?**

బహుజనపల్లి సీతారామాచార్యులు రూపొందించిన ''శబ్ద రత్నాకరం'' అనే నిఘంటువులో 'సమీక్ష'కి గల అర్థాలు ఇవి. చక్కగా చూచుట, వెదుకుట. సమీక్ష్యకారి అంటే "ఏ పని యేనియు చక్కగా యోచించి చేయువాడు". శ్రీనాథుడు 'శృంగారనైషధం' అనే కావ్యంలో ఇంద్రుని భార్యలప్పుడు సమీక్షణ చేసిరి రాజహంసయున్'' అన్నాడు. అంటే స్త్రీలు రాజహంసను బాగా – పరీక్షగా చూశారని భావం. సమీక్ష, సమీక్షణం అంటే సూర్యరాయాంధ్ర నిఘంటువులో – "పరిశీలన, ఆలోచన, అవగాహన, సత్యము యొక్క సారము, సారభూతమైన సిద్ధాంతము, ప్రయత్నము, అన్వేషించుట, ఆలోచన గలది..." అనే విధంగా అర్థాలు కనిపిస్తాయి.

ఇంగ్లీషులో గల ''బుక్ రివ్యూ'' తెలుగులో పుస్తక సమీక్షగా వ్యవహరింప బడుతోంది. ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్లనే సమీక్షా ప్రక్రియ ప్రాచుర్యం పొందింది. అంతకుముందు తెలుగులో అవతారికలలో, పీఠికలలో సమీక్షకు సంబంధించి ప్రయత్నం కొంత కనిపిస్తుంది. బ్రౌన్ నిఘంటువులో గల అర్థం చూద్దాం.

**టు రివ్యూ :** టు ఎగ్జామిన్ ఎగైన్. విచారించుట, పునర్విమర్శ చేయుట, సరిచూచుట.

**రివ్యూ ఆఫ్ ఎ బుక్ :** ఒక గ్రంథములో వుండే దోషాదోషములను విమర్శించి రాసినది.

**రివ్యూయర్ :** ఒక గ్రంథములో వుండే సారా సార వివేచన చేసి ఆ సంగతిని రాసేవాడు.

మొత్తం మీద సమీక్ష అంటే – "ఒక పుస్తకాన్ని చదివి అవగాహన చేసుకొని ఆలోచనతో గ్రంథ సారాంశాన్ని – మంచి చెడుల్ని తెలుపుతూ చేసే రచన" అని నిర్వచించవచ్చు.

**సమీక్ష, విమర్శ ఒకటేనా?**

శబ్దార్థ స్వరూపాన్ని బట్టి చూస్తే పరిశీలించుట, వివరించుట, గుణ దోషాలను వివరించుట... వంటి అర్థాలు రెండింటికీ అన్వయిస్తాయి. నిఘంటుకారులూ అలాగే తెలిపారు. పూర్వం సాహిత్య పత్రికలు పరిశీలిస్తే గ్రంథ సమీక్షలు – విమర్శ వ్యాసాల వంటివే అని గ్రహిస్తాం. 'భారతి' వంటి సాహిత్య పత్రికలలో గ్రంథ సమీక్షలు కొన్ని పుటలలో విమర్శనాత్మకంగా వెలువడేవి. అయితే సమీక్ష – సారాంశాన్ని వివరించేది అనీ విమర్శ క్షుణ్ణంగా వివరించేది అనీ చెప్పవచ్చు.

సమీక్షలో విమర్శ ఉండవచ్చు. కొంతైనా ఉంటుంది. అయితే ఇటీవల సమీక్ష వేరుగా, విమర్శ వేరుగా పరిగణింప బడుతోంది. పుస్తక పరిచయమే 'సమీక్ష' అనీ, లోతుపాతులు వివరించేది – సూక్ష్మ పరిశీలన చేసేది 'విమర్శ' అనీ భావించబడుతోంది. ప్రతి పత్రిక 'సమీక్ష'కి పుటలు కేటాయిస్తోంది. స్థలాభావం, ఆర్థికభారం వంటి కారణాల వల్ల ఒక పుట లేదా రెండు పుటలు మాత్రమే సమీక్షకి కేటాయించబడుతోంది. దీనివల్ల సమీక్ష కేవలం పరిచయ వ్యాసంగానే తప్ప విమర్శనాత్మకంగా ఉండే అవకాశం కోల్పోతున్నది. అందుకనే కొందరు సమీక్ష విమర్శ వంటిది – అంటున్నారు. సమీక్షలో విమర్శ పరిధి తక్కువ.

**సమీక్షకుడి లక్షణాలేమిటి?**

విమర్శకుడికి ఉండవలసిన లక్షణాలే సమీక్షకుడికీ ఉండాలి. చిన్న పని, పెద్ద పని – అనే తేడా తప్ప చేయవలసిన పని ఒకటే గదా! అందరూ సమీక్షకు యోగ్యులు కారు. కవి, రచయిత సమీక్షకుడు కావచ్చు. కానీ – సమీక్షకులందరూ కవులూ, గ్రంథ రచయితలూ కావాలని ఏమీ లేదు. అందుకే సమీక్షకుడికి కొన్ని ముఖ్యమైన గుణాలుండాలి – అవి :

★ పాండిత్యం వుండాలి. అంటే విషయగతమైన పరిజ్ఞానం
★ పరిణామ క్రమాన్ని పరిశీలించే తత్వం వుండాలి
★ పుస్తక పఠనం పట్ల, పరిశీలన పట్ల ఆసక్తి వుండాలి.
★ మమకార వికారాలు వుండకూడదు.
★ నిష్పక్షపాత బుద్ధి ఉండాలి. వ్యక్తిగత ప్రయోజనాలకి దూరంగా ఉండాలి.
★ తాను 'అధికుడ్ని' అనే భావన సరికాదు
★ రచయిత ఉద్దేశాన్ని పసిగట్టి తదనుగుణంగా పరిశీలించగలగాలి
★ పాఠకుడ్ని దృష్టిలో పెట్టుకోవాలి – తన పాండిత్య ప్రదర్శన ముఖ్యం కాకూడదు.
★ రచయిత పదవిని బట్టి, స్థాయిని బట్టి సమీక్ష చేయడం సమంజసం కాదు.
★ కేవలం ప్రశంస మాత్రమే కాకుండా లోపాలను ప్రదర్శిస్తూ రచయితకి ప్రోత్సాహకరంగా ఉండాలి.
★ సంయమనం, నిగ్రహం ముఖ్యం. దూషణ కూడదు.

**సమీక్షలలో రకాలు**

సామాన్యంగా సమీక్షలు అనగానే "సాహిత్య సమీక్షలు" అనుకోవటం పరిపాటి. అయితే పుస్తకాలలో ఎన్ని రకాలున్నాయో సమీక్షలలోనూ అనిన రకాలుంటాయి –

విజ్ఞానశాస్త్ర (సైన్స్) సమీక్షలు, చారిత్రక సమీక్షలు, రాజకీయ సమీక్షలు, చలనచిత్ర సమీక్షలు,

సామాజిక శాస్త్ర సమీక్షలు ... అనే విధంగా వర్గీకరించవచ్చు.

**సాహిత్య సమీక్షలలో కూడా భేదాలున్నాయి**

కవితా సమీక్ష, కథా సమీక్ష , నవలా సమీక్ష, నాటక సమీక్ష అనే విధంగా ప్రక్రియాపరంగా వింగడించవచ్చు. ఒక్కొక్క ప్రక్రియకు ఒక్కొక్క రచనా పద్ధతి వుంటుంది.

**సమీక్ష ఉద్దేశాలూ, ప్రయోజనాలూ**

పుస్తక రచన మాటలు కాదు. విలువలు, ఆదర్శాలతో రచనలు చేస్తారు. తాము గ్రహించిన జ్ఞానాన్ని ఇతరులకు పంచాలని రాస్తారు. పుస్తకాలు తరతరాలకు జ్ఞాన నిధులు. తరాల అంతరాలకి వారధులు. పరిశీలన, ఆలోచన, వ్యుత్పన్నత అందరికీ అన్ని కాలాలకీ వుండటం కష్టం. జంగమ విజ్ఞాన సర్వస్వాలు" (మూవింగ్ ఎన్‌సైక్లోపీడియా) అనదగిన వ్యక్తులూ వుంటారు. ఇటువంటి మహానుభావులు రాసిన పుస్తకాలున్నాయి. మానవుడు ఆలోచనాపరుడు. సంఘజీవి. అందుకే రచయిత, కళాకారుడు, శాస్త్రజ్ఞుడు కాగలుగుతున్నాడు. అందుకే రచనను, పరిశోధనను చేపడుతున్నాడు.

పుస్తక సమీక్షకుడు ఈ నేపథ్యాన్ని గ్రహించాలి. ప్రపంచంలో 'అక్కరలేని పుస్తకం', 'చెత్త పుస్తకం' అంటూ ఏమీ వుండదు. అంగీకరించలేని, సమకాలీనానికి సమంజసం కాని భావజాలం వుంటుంది. అంతమాత్రాన అది "అనవసరం" కాజాలదు.

అందరూ అన్ని పుస్తకాలనూ చదవలేరు. చూడలేరు కూడా. సమీక్షల ద్వారా పుస్తకాల సమాచారాన్ని తెలుసుకొనే సదవకాశం వుంది. కొన్ని పుస్తకాలు ఆ రచయితలు నివసించే ప్రాంతాలలోనే పేరు పొంది వుంటాయి. సమీక్షల ద్వారా ఇతర ప్రాంతాల వారికీ - సుదూర ప్రాంతాల వారికీ తెలిసే అవకాశం ఏర్పడుతుంది.

నగరాలకు దూరంగా గ్రామీణ ప్రాంతాలలో ఎన్నో గ్రంథాలు వచ్చి వుంటాయి. నగరంలో ప్రచురించుకొని మిత్రులకు, ఆసక్తి గల వాళ్ళకి పంచుకుంటారు.

చాలా గొప్ప పుస్తకాలు - అనిపించు కొన్నవి కొంతకాలం తర్వాత మరుగున పడిపోతాయి. తరాల మధ్య అంతరమూ కొంత కారణమే. వీటిని గ్రంథ సమీక్షల ద్వారా పదిల పరచుకోవచ్చు. పుస్తక సమీక్షలు "రిఫరెన్స్"కి పనికొస్తాయి. అంటే ఆకర సామాగ్రిలా ఉపయోగ పడతాయి. మరుగున పడిన రచయితలు, అర్థాంతరంగా తనువు చాలించిన వారు రాసిన వీటిని సమీక్షల సేకరణ ద్వారా గ్రహించే వీలుంది. ఒక ప్రక్రియలో గొప్ప పేరు సంపాదించిన వారు ఇతర ప్రక్రియలలోనూ రచన చేయవచ్చు. కానీ ప్రాచుర్యం పొందక పోవచ్చు. పరిశోధకుడికి అన్ని రచనలూ కావాలి. అప్పుడు సమీక్షల అవసరం తప్పదు.

— — — — * * * — — — —

**పుస్తక సమీక్షలు "రిఫరెన్స్"కి పనికొస్తాయి. అంటే ఆకర సామాగ్రిలా ఉపయోగపడతాయి. మరుగున పడిన రచయితలు, అర్థాంతరంగా తనువు చాలించిన వారు రాసిన వీటిని సమీక్షల సేకరణ ద్వారా గ్రహించే వీలుంది.**

— — — — * * * — — — —

సమీక్షల ఉద్దేశం, కర్తవ్యాన్ని 1930 భారతిలో అప్పటి సంపాదక మండలి సభ్యులు గుఱ్ఱం వేంకట సుబ్బరామయ్య ఇలా తెలిపారు - "రివ్యూల యందు గ్రంథ విషయ సంగ్రహము (సమ్మరీ) నొసంగుట ఆచారమని మా మిత్రులొకరు సూచించినారు. కాని సంగ్రహముల చదివిన మాత్రమే అసలు గ్రంథము పొంత బోవకయే గ్రంథ రస మామూలాగ్రము "దిగ ద్రావి గఱ్ఱున ద్రేచినట్లు" నటించుచు విర్ర వీగు మహనీయులనేకులు కలరని యెరింగిన వాడనగుటచే ఆ పని నిటమాని నాడను. గ్రంథ విషయము సర్వము చదివి సంతసింప వలయుననదేయైనను, మదీయ దృష్టి నత్యంతమాకర్షించిన యంశములలో కొన్నింటినేని తడువుటయు, అవసరమగు నెడ నా యభిప్రాయమును గూడ సూచించుటయు విద్యుక్తముగా దోచెడిని" కోరాడ రామ కృష్ణయ్యగారు సమీక్షలపై తమ అభిప్రాయాలను ఇలా చెప్పారు -

★ గ్రంథస్థ విషయం సంగ్రహంగా ఇవ్వడం
★ ఆకర్షించిన, విశేషమైన అంశాలను పేర్కొనడం.
★ పాఠకుల్లో గ్రంథ గౌరవాన్ని లేదా పఠనాభిలాషను పెంపొందించడం
★ స్వీయాభిప్రాయాలను సూచించడం.

గ్రంథ పరిచయం పరమావధిగా అన్ని కోణాలనూ స్పృశిస్తూ పాఠకులలో అనుభూతినీ, ఆలోచనా తత్పరతనూ కలిగించడం సమీక్ష ప్రయోజనం. పాఠకులకీ, రచయితలకీ మధ్య వారధులే సమీక్షలు. 'ఒక అంశం'పై ఏయే పుస్తకాలు వచ్చాయో, ఎక్కడెక్కడి పాఠకులకో బాగా తెలుసుకోవాలంటే సమీక్షలే ఆధారం.

చిన్నప్పుడు రాసిన పుస్తకాలు - తొలి రచనలు గొప్పవి కాకపోవచ్చు. గొప్ప పేరు పొందిన తర్వాత వాటిని వెలుగులోకి తెచ్చి గొప్ప రచనలు - అనడమూ వుంది. ఇదలా వుంచితే దీని వల్ల కలిగే ప్రయోజనం ఏమిటంటే - ఆ రచయిత రచనలో గల పరిణామ క్రమాన్ని అంచనా వేయడం.

కొన్ని సమీక్షల వల్ల తులనాత్మక పరిశీలనకి అవకాశం ఏర్పడుతుంది. ఇతర కావ్యాలతో, ఇతరుల రచనలతో సరిపోల్చి అభిప్రాయ ప్రకటన చేసే సమీక్షల వల్ల ఈ ప్రయోజనం ఏర్పడుతుంది. శబ్దాల గుణ దోషాలు, ఛందస్సు, ప్రతీకలు, అభివ్యక్తి - మొదలైన వాటిని పాఠకులూ, పండితులూ అందరూ తెలుసుకోవచ్చు.

"చమత్కారమే కొన్ని చోట్ల ప్రధానంగా పోషింపబడుట కావ్యము యొక్క రస సిద్ధికి లోటు గలిగించుచున్నది."

"వీరిని కీట్స్ వంటి వాడు అన్నారు. ఇది నిజానికి చాలా విచిత్రమైన మాటే. సౌందర్యోపాసన విషయంలో వీరి ఛాయలు కొన్ని కీట్సులో కనిపించినా కీట్సులో ఉన్న అవాంఛనీయమైన నిరాశావాదం శ్రీనివాస మూర్తిగారిలో ఏ కోశాన కనిపించదు" అని సమీక్షకుడు అనటం ఆసక్తికరమైనది. ఆంగ్ల కవితా పరిచయం లేకపోతే ఇలా అన లేదు. ఆధునిక సాహిత్య రచనలను సమీక్షించడానికి ఆంగ్ల సాహిత్య పరిచయం లేదా పాశ్చాత్య సాహిత్య పరిచయం కూడా అవసరం.

ఇవాళ పుస్తకం చదవటం తగ్గింది. అన్ని రకాల పుస్తకాలనూ చదవటం మరీ తగ్గింది. ఎవరి ప్రాధాన్యాన్ని బట్టి ఆయా రంగాలకు సంబంధించినవే చదువుతున్నారు. కాబట్టి సమీక్షల అవసరం మరీ ఎక్కువైంది. సమీక్షలను బట్టి పుస్తకాలను ఎంచుకోవటం, ఎంచుకోకపోవటం జరుగుతోంది.

**నేటి స్థితి**

ఇవాళ పత్రికలు ప్రచారానికి, వ్యాపారాత్మకతకీ ఇస్తున్న ప్రాధాన్యం వల్ల పుస్తక సమీక్షలు 'మొక్కుబడి'గానే వుంటున్నాయి. సమీక్షలంటే 'క్లుప్త పరిచయాలు' అనే స్థితి ఏర్పడింది. ఎక్కువ పుటలు కేటాయించ లేకపోతున్నారు. సమీక్షకులకు పుటల ఆంక్షలు విధించడం వల్ల 'తూతూ మంత్రం' గానే రాయక తప్పడం లేదు. మరి కొన్ని పత్రికలలో అందులో పనిచేసేవారే సమీక్షలు రాస్తూ వుంటారు. ప్రామాణికమైన పరిజ్ఞానం లేకపోయినా సమీక్షను చేపట్టడం వల్ల, తనకి ఇష్టం లేనివారిని నిందించడం వల్ల, నచ్చిన వారిని స్తుతించడం వల్ల సమీక్షల స్థాయి తగ్గిపోతుంది. అంటే మొహమాటాలూ, అవసరాలూ ఎక్కువయ్యాయి. రాజకీయ కారణాల ప్రభావం అధికమైంది. ఇటీవల ప్రాంతీయ భేదాలు తోడవుతున్నాయి. సమీక్షకుడు కూడా తన పరిజ్ఞానానికి పరిమితం కాకుండా దేనినైనా సమీక్షించడానికి సిద్ధం కావటం విలువలకి తిలోదకాలివ్వడమే. కొంతమంది సమీక్షకులు "సంచలనం" కోసం రాస్తుండటం శోచనీయం. పత్రికల వారు కూడా ఇష్టాయిష్టాల ఆధారంగా సమీక్షలు ప్రచురిస్తున్నారు.

సమీక్షకులు మాత్రమే స్వతంత్రులు, నిర్మొహమాటస్తులు అయితే లాభం వుండదు. పత్రికా నిర్వాహకులకీ ఈ లక్షణాలుండాలి. రచయిత కూడా ప్రశంసనే కోరుకోకూడదు. సమీక్షని ఆహ్వానించి అర్థం చేసుకొనే సహృదయం రచయితకి తప్పనిసరి. ఎన్ని లోపాలున్నా నేటికీ పాఠకులకి, పుస్తక ప్రియులకి సమీక్షలే కరదీపికలు.

**(రాజమండ్రి సాహిత్యశాలలో ప్రసంగం)**

# "నిప్పుకోడి" పుస్తకావిష్కరణ

ప్రముఖ కవి, డాక్టర్ నాగినేని భాస్కరరావు రచించిన "నిప్పుకోడి" కవితా సంపుటి ఆవిష్కరణ సభ ఇటీవల యువభారతి ఆధ్వర్యంలో హైదరాబాద్ నగర కేంద్ర గ్రంథాలయం హాలులో జరిగింది. పుస్తకాన్ని ఆవిష్కరించిన సిపిఐ(ఎం) పొలిట్‌బ్యూరో సభ్యుడు కామ్రేడ్ బి.వి. రాఘవులు ప్రసంగిస్తూ 'నిప్పుకోడి'లోని కవిత్వం సమాజంలోని సమస్యలను వేలెత్తి చూపడమే కాకుండా పరిష్కారాన్ని కూడా సూచించడం అభినందనీయమని అన్నారు. సభకు అధ్యక్షత వహించిన ప్రముఖ కవి జ్వాలాముఖి తన ప్రసంగంలో ప్రపంచీకరణకు వ్యతిరేకంగా రాసిన కవితలెన్నో ఈ సంపుటిలో ఉండటం విశేషమని పేర్కొన్నారు.



డా॥ నాగినేని భాస్కరరావు రచించిన "నిప్పుకోడి" కవితా సంపుటి ఆవిష్కరిస్తున్న బి.వి. రాఘవులు చిత్రంలో ఇంకా డా॥ చిదంబరం దీక్షితులు, సుధామ, గ్రంథకర్త, శీలా వీర్రాజు, డా॥ కె.బి. లక్ష్మి, ఎం. అనంతాచారి ఉన్నారు.

ప్రముఖ రచయిత సుధామ పుస్తకాన్ని పరిచయం చేస్తూ నిజాయితీతో, చిత్తశుద్ధితో కృతికర్త భాస్కరరావు కవిత్వం రాశారని ఆయనను అభినందించారు. ప్రసిద్ధ చిత్రకారుడు, కవి, రచయిత శీలా వీర్రాజుకు రచయిత తన కావ్యాన్ని అంకితం చేశారు. డాక్టర్ చిదంబరం దీక్షిత్, శీలా వీర్రాజు, ఆచార్య వి. విశ్వనాథం, డా॥ కె.బి. లక్ష్మి, మాడభూషి అనంతాచార్య తదితరులు ప్రసంగించారు.

# 'తొలకరి' కవితా సంపుటి ఆవిష్కరణ సభ

బొల్లు పాండురంగం రాసిన "తొలకరి" కవితా సంపుటిని ఇటీవల సాహితీ స్రవంతి మలక్‌పేట జోన్ ఆధ్వర్యంలో సుందరయ్య విజ్ఞానకేంద్రం మినీ హాలులో ప్రముఖ కవి జ్వాలాముఖి ఆవిష్కరించారు. ఈ సభలో సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్, తెలకపల్లి రవి ముఖ్య అతిథిగా విచ్చేసి సందేశం అందించారు. విప్లవ్‌దత్ శుక్లా, డాక్టర్ తిరునగరి గార్లు 'తొలకరి' కవితా సంపుటిపై సమగ్ర విశ్లేషణా ప్రసంగాలు చేశారు. రవికుమార్ స్వాగతం పలుకగా తంగిరాల చక్రవర్తి వందన సమర్పణ చేసిన ఈ సభకు ఎ. సత్యభాస్కర్ అధ్యక్షత వహించారు. దాస్ ఆధ్వర్యంలో కవి గాయక సమ్మేళనం, రవీందర్ మ్యూజిక్ ఆహుతుల్ని అలరించాయి. బి.డి.ఎల్. కార్మికులు బొ.పా.రా. అభిమానులు కవిని సన్మానించారు.

# 'ఇంకెవరు' కవితా సంపుటి ఆవిష్కరణ

ప్రముఖ కవి, ఢిల్లీలో ఆంధ్రజ్యోతి ప్రతినిధి ఎ. కృష్ణారావు (కృష్ణుడు) రచించిన 'ఇంకెవరు' కవితా సంపుటిని ఇటీవల డా॥ పెండ్యాల వరవరరావు శ్రీ సుందరయ్య కళానిలయం మినీ హాలులో జరిగిన ఒక కార్యక్రమంలో ఆవిష్కరించారు. ఆయన తన ప్రసంగంలో 'కృష్ణుడు' కవిత్వంలోని విశిష్టతను, విలక్షణ శైలిని కొనియాడారు. ఆయనతో గల అనుబంధాన్ని గుర్తు చేసుకున్నారు. ప్రముఖ కవి దేవిప్రియ సభకు అధ్యక్షత వహించారు.

కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత కె. శివారెడ్డి పుస్తకాన్ని పరిచయం చేస్తూ కృష్ణుని కవిత్వంలో స్పష్టత, గాఢత, వస్తు నిబద్ధత అభినందించదగ్గ అంశాలని పేర్కొన్నారు. ఢిల్లీ తెలుగు




'ఇంకెవరు కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న డా॥ పి. వరవరరావు, కవితో పాటు సాహితీవేత్తలు దేవిప్రియ, కె. శివారెడ్డి, రామవరపు గణేశ్వరరావు

సాహితీ ఉపాధ్యక్షులు రామవరపు గణేశ్వరరావు, కవి, పాత్రికేయుడు తాళ్ళపల్లి మురళీధర గౌడు తదితరులు ప్రసంగించారు.

# "జలతరంగిణి" హైకూ సంపుటి ఆవిష్కరణ

బి హెచ్ఇఎల్ రామచంద్రాపురంలో (హైదరాబాద్) సీనియర్ సైంటిఫిక్ ఆఫీసర్'గా పనిచేస్తున్న కవి మాచవోలు శ్రీధరరావు రచించిన 'జలతరంగిణి' హైకూ కవితా సంపుటి ఆవిష్కరణ సభలో రసధుని ఆధ్వర్యంలో ఆగస్టు 7న ఇంటర్నేషనల్ క్లబ్ హాలులో జరిగింది. సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న బి. హెచ్. ఇ. ఎల్. ఎజిఎం కె. నికరన్ పుస్తకాన్ని ఆవిష్కరించారు.

సభకు అధ్యక్షత వహించిన హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య పరిమి రామనరసింహం ప్రసంగిస్తూ కృతికర్త శ్రీధరరావు తన కవితల్లో మానవ సంబంధాల గురించి అద్భుతంగా చెప్పారని అన్నారు. పుస్తకాన్ని పరిచయం చేసిన ప్రముఖ కవి, విమర్శకులు డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు మాట్లాడుతూ శ్రీధరరావు తమ హైకూలను సామాజిక చైతన్యంతో రాశారని, వీటిలో వ్యంగ్యంతో పాటు హాస్యాన్నీ నిలిపారనీ, సామాజిక వస్తువుకీ అభివ్యక్తి రీతులకీ సమన్వయం చేయటం అభినందనీయమని అన్నారు.



ఆగస్టు 7న బి. హెచ్. ఇ. ఎల్. హైదరాబాద్ ఇంటర్నేషనల్ క్లబ్‌లో జరిగిన 'జలతరంగిణి' కవితా సంపుటి ఆవిష్కరణ సభలో పాల్గొన్న ఎం. ఎస్. రెడ్డి, తాళ్ళపల్లి మురళీధరగౌడు, డా॥ అద్దేపల్లి రామమోహనరావు, కె. నివేదన్, ఆచార్య పరిమి నరసింహం, ప్రతాపరెడ్డి, కృతికర్త ఎం. శ్రీధరరావు

ఈ సందర్భంగా డాక్టర్ అద్దేపల్లి సప్తతిని పురస్కరించుకొని నిర్వాహకులు ఆయనను ఘనంగా సన్మానించారు. ప్రముఖ కవి, పాత్రికేయుడు తాళ్ళపల్లి మురళీధర గౌడు అద్దేపల్లిని సభకు పరిచయం చేశారు.

# పలనాడు రచయితల సంఘం ఏర్పాటు




పలనాడు రచయితల సంఘం ప్రథమ సమావేశం

పలనాటి సాహితీ వ్యవసాయం చేస్తున్న రచయితలు, కవులు, విమర్శకులు, సాహిత్యకారులు అందరినీ ఒక తాటి పైకి తెచ్చి సాహిత్య కార్యక్రమాలు, పుస్తకావిష్కరణలు మొదలైన కార్యక్రమాలకు ఒక వేదికను కల్పించేందుకు ఇటీవల పలనాడు రచయితల సంఘం ఏర్పడింది. పలువురు కవులు, రచయితలు హాజరై అధ్యక్షునిగా వై. హెచ్. కె. మోహనరావును, ప్రధాన కార్యదర్శిగా కోసూరి రవికుమార్‌లను ఎన్నుకున్నారు. ఈ కార్యక్రమంలో నాగిశెట్టి తాతయ్య నాయుడు, పెద్దోజు నమశ్శివయ్య, షేక్ బడే సాహెబ్, గీత రచయితలు టి. శ్రీరామమూర్తి, షేక్ బాజీ, మన్నం వెంకట గురువులు, ప్రత్తిపాటి రామకోటయ్యలు పాల్గొని ఉపన్యసించారు.

# "అంతరించిపోతున్న జానపద కళారూపాలపై రవీంద్ర భారతిలో కవి - గాయక సమ్మేళనం"

సెప్టెంబర్ 24న హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో అంతరించిపోతున్న జానపద ప్రజాకళలు - సాహిత్యంపై ఎ. సత్యభాస్కర్ అధ్యక్షతన కవి సమ్మేళనం జరిగింది. దాదాపు 46మంది యువకవులు - గాయకులు - కవయిత్రులు పాల్గొన్న ఈ సభలో సాహితీ స్రవంతి నగర కన్వీనర్ మోత్కూరి నరహరి - కవుల కవిత్వాన్ని - మన జానపద కళారూపాల పరిరక్షణావశ్యకతను చివరగా విశ్లేషించారు. ఈ సభ తంగిరాల 7వ వర్ధంతి సందర్భంగా జరిగింది. స్మారక అవార్డు శ్రీ బుర్రా సుబ్రహ్మణ్య శాస్త్రిగార్కి డాక్టర్ సి. నారాయణరెడ్డి ప్రదానం చేశారు. అభ్యుదయ చలనచిత్ర దర్శకులు, నిర్మాత కె. బి. తిలక్, పలువురు రంగస్థల ప్రముఖులు, నటులు, కవులు, గాయకులు పాల్గొన్నారు. ఈ సభను తంగిరాల చక్రవర్తి తదితరులు నిర్వహించారు.




ఆగస్టు 26న నల్లగొండలోని గ్రంథాలయంలో కాసుల ప్రతాపరెడ్డి రచించిన 'ఎల్లమ్మ, ఇతర కథలు' పుస్తకాన్ని ఆవిష్కరించిన డాక్టర్ ముదిగంటి సుజాతారెడ్డి, పుస్తకాన్ని పరిచయం చేస్తున్న డాక్టర్ నోముల సత్యనారాయణ కథా రచయిత డాక్టర్ జోయ జంగయ్య, కవి డాక్టర్ సుంకిరెడ్డి నారాయణరెడ్డి కూడా చిత్రంలో వున్నారు.



డాక్టర్ సి. భవానీదేవి కవితా సంపుటి అక్షరం నా అస్తిత్వంను ఆవిష్కరిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి, ఆచార్య ఎన్. గోపి, మద్దాళి రఘురాం, ఓల్గా, కవయిత్రి ఎన్. అరుణ సభలో పాల్గొన్న దృశ్యం

## క్లుప్తత కథకు ప్రాణం : ముదిగంటి సుజాతారెడ్డి

క్లుప్తత కథకు ప్రాణమని, ఈ క్లుప్తతను కాసుల ప్రతాపరెడ్డి తన కథల్లో సాధించాడని ప్రముఖ రచయిత్రి డాక్టర్ ముదిగంటి సుజాతారెడ్డి అన్నారు. కాసుల ప్రతాపరెడ్డి రచించిన 'ఎల్లమ్మ, ఇతర కథలు' సంపుటిని ఆమె ఆగస్టు 26వ తేదీన నల్లగొండలోని గ్రంథాలయంలో జరిగిన సభలో ఆవిష్కరించి ప్రసంగించారు. ప్రతాపరెడ్డి అంతస్సంఘర్షణను, సామాజిక సంఘర్షణను తన కథల్లో చిత్రించాడని, ఈ రెంటి మధ్య సమన్వయం సాధించి ప్రయోజనకరమైన కథలు రాశాడని ఆమె అన్నారు. పాఠకులను కథల వెంట నడిపించే శైలి, సామాజిక చిత్రణ ప్రతాపరెడ్డి కథల్లో చూస్తామని ఆమె అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన ప్రముఖ కవి డాక్టర్ సుంకిరెడ్డి నారాయణరెడ్డి తన కథల్లో సామాజిక శాస్త్రవేత్తల దృష్టికి కూడా రాని అంశాలను ప్రతాపరెడ్డి పట్టుకున్నాడని ఆయన అన్నారు.

ప్రతాపరెడ్డి సామాజిక ప్రయోజనం గల కథలు రాశారని ప్రముఖ కథా రచయిత ఎన్.కె. రామారావు అన్నారు. ప్రతాపరెడ్డి కథను చదవడం ప్రారంభించి ముగించే సరికి ఆ సాధారణత అసాధారణ స్థాయికి తీసుకుని పోతుందని ప్రముఖ సాహితీవేత్త డాక్టర్ నోముల సత్యనారాయణ అన్నారు. ప్రతాపరెడ్డి అత్యుత్తమ కథలను, విమర్శను సాహిత్య లోకానికి అందిస్తున్నాడని ప్రముఖ కథా రచయిత డాక్టర్ బోయ జంగయ్య అన్నారు. సభకు కథా రచయిత బోధనం నర్సిరెడ్డి స్వాగతం చెప్పారు. సభలో కథా రచయిత ఎలికట్టె శంకరరావు, కవి అలీ, సాహిత్యకారుడు భీమార్జున రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## "అక్షరం నా అస్తిత్వం"

సెప్టెంబర్ 12వ తేదీ కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్ శ్రీ త్యాగరాయగానసభ సంయుక్త ఆధ్వర్యంలో శ్రీ కళా సుబ్బారావు కళా వేదికపై జరిగిన సభలో జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డి డాక్టర్ సి. భవానీదేవి కవితా సంపుటి 'అక్షరం నా అస్తిత్వం'ను ఆవిష్కరించి ప్రసంగిస్తూ "భవాని కవితా వస్తువులు ఎంచుకోవటంలో వైవిధ్యం, స్పష్ట అన్వయనం, దేశీయత, ఆర్ద్రత, అన్వయశుద్ధి, భావసిద్ధి పుష్కలమన్నారు. పిల్లల లోకం, అమ్మతనం, స్త్రీ అస్తిత్వం పురులకి ఉపరితలంగానే అర్థం కావటం ఆమె కవితాత్మగా చెప్తూ కవిత్వాన్ని ప్రేమించటం అంటే జీవితాన్ని ప్రేమించటమేనన్నారు.

ప్రముఖ కవి, సభాధ్యక్షులు డాక్టర్ ఎన్. గోపి మాట్లాడుతూ "భవానీదేవి ఆరు కవితా సంపుటాలు వెలయించారంటూ ఆమె ఇతర ప్రక్రియలు కూడా రాస్తున్న అపురూప కవయిత్రులలో అగ్రశ్రేణికి చెందిన కవయిత్రులలో ఒకరనీ, స్త్రీ అస్తిత్వ అన్వేషణా క్రమంలో కవయిత్రి తన అస్తిత్వాన్ని సాహిత్యంలో అన్వేషించారనీ" అన్నారు.

కవయిత్రి ఎన్. అరుణ గ్రంథ సమీక్ష చేస్తూ భవానీదేవి కవిత్వంలోని వివిధ అంశాలను విశ్లేషించారు. స్నేహం, మనసు, పిల్లలు, చారిత్రక కట్టడాలు, రాజకీయ నేపథ్యాలు, పుట్టింటి నుంచి ఆరణంగా వచ్చిన వివక్ష వంటి ఇతివృత్తాలు భవాని కవితాతత్వాన్ని గురించి సోదాహరణంగా విపులీకరించారు.

కవయిత్రి భవానీదేవి ప్రతిస్పందిస్తూ అక్షరం కోసం ఆరాటం, పోరాటం చేసిన బాల్యం నుంచి సాహితీకారిణిగా ఎదిగిన నేపథ్యాన్ని వివరించారు. కిన్నెర అధినేత మద్దాళి రఘురాం స్వాగతం పలికారు.




శ్రీకాకుళ సాహితి ఆధ్వర్యంలో 'కళింగాంధ్ర మాండలికం' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న ప్రముఖ కవి, ఐ.ఎ.ఎస్. అధికారి శ్రీ ఎ. విద్యాసాగర్. చిత్రంలో కా.రా. మాష్టారు, జి.ఎస్. చలం, రామారావు నాయుడు, అప్పల్నాయుడు



డాక్టర్ ద్వా.నా. శాస్త్రి రచించిన "ఇదీ మన తెలుగు" పుస్తకాన్ని రాష్ట్ర పాఠశాల విద్యాశాఖా మంత్రి శ్రీమతి ఎన్. రాజ్యలక్ష్మి, చిత్రంలో అధికారా భాషా సంఘం అధ్యక్షులు ఏబికె ప్రసాద్, లిటరసీ హౌస్ కార్యదర్శి శ్రీ బుద్దిగ సుబ్బరాయన్‌లను కూడా చూడవచ్చు

# గిడుగు రామమూర్తి జయంతి తెలుగు భాషా దినోత్సవం

గిడుగు రామమూర్తి జయంతి సందర్భంగా తెలుగు భాషా దినోత్సవంగా యలమంచిలి శ్రీ గురజాడ అప్పారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాల తెలుగు శాఖ నిర్వహించింది. సభాధ్యక్షులు పి. ప్రభాకరరావు తెలుగు భాషపై సంస్కృతం అధికారం పోవాలని, ఇంగ్లీషు తెలుగు రెండూ సక్రమంగా వినియోగించుకోలేని స్థాయిలో ప్రస్తుతం ఉన్నామని, తెలుగులోని తీపిని అందరూ గుర్తించాలన్నారు. ఆకాశవాణి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ నాగసూరి వేణుగోపాల్ తెలుగు భాష విజ్ఞాన శాస్త్రాలకి, సాహిత్యానికీ కూడా చక్కగా ఉపయోగించు కోవచ్చున్నారు. గిడుగు రామమూర్తి భాషా శాస్త్రజ్ఞుడని విమర్శకులు అన్నారని, సవర భాషకి లిపిని ఏర్పరచడం ద్వారా అది నిరూపించుకున్నారన్నారు. 'తెలుగు' అనే పత్రికని గిడుగు నడిపారన్నారు. టి.వి. ఛానళ్ళ తెలుగుని సంస్కరించాలని పిలుపునిచ్చారు. రచయిత ఇచ్ఛాపురపు రామచంద్రం తనకు గ్రాంథిక భాషా రచనలోని కష్టం తెలిశాక వ్యావహారికి భాషని ఎంచుకున్నానని తెలిపారు. అతి సులువుగా అర్థమయ్యే భాషలోనే రచన చెయ్యాలన్నారు. పద్యాల భాష, రచనా భాష, మాట్లాడే భాష మూడింట్లో మాట్లాడే భాషే గొప్పదన్నది తన అభిప్రాయమన్నారు. అధికార భాషా సంఘం విశాఖపట్నంలో నిర్వహించిన తెలుగు వికాసంలో బహుమతులు పొందిన విద్యార్థులకు తెలుగు శాఖ రీడర్ డా॥ కాందూరి సీతారామచంద్రమూర్తి జ్ఞాపికలు అందజేశారు.




యలమంచిలిలోని శ్రీ గురజాడ అప్పారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాల తెలుగుశాఖ ఆధ్వర్యంలో గిడుగు రామమూర్తిగారి జయంతిని తెలుగు భాషా దినోత్సవంగా నిర్వహించిన సందర్భంలో నాగసూరి వేణుగోపాల్ ప్రసంగిస్తున్న దృశ్యం. వేదికపై డాక్టర్ కె.ఎస్. రామచంద్రమూర్తి, తెలుగు రీడర్, కళాశాల ప్రిన్సిపాల్, ఇచ్ఛాపురపు రామచంద్రం ఉన్నారు

# బి.డి.ఎల్.లో జాషువాకు ఘన నివాళి

ఆగస్టు 2న మధ్యాహ్నం భారత్ డైనమిక్స్ లిమిటెడ్ (బి.డి.ఎల్). కాంచన్‌బాగ్‌లో కవికోకిల గుర్రం జాషువా వర్ధంతి సభ నిర్వహించారు. బి.డి.ఎల్. వెల్ఫేర్ కమిటీ, సాహితీ స్రవంతి సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహించిన ఈ సంస్మరణ సభకు ప్రముఖ కవి, విమర్శకుడు, జ్వాలాముఖి ప్రధాన వక్తగా హాజరయ్యారు. బి.డి.ఎల్. కార్మిక నాయకులు, కవి, నటుడు వి. చెన్నకేశవులు అధ్యక్షత వహించగా, వెల్ఫేర్ కమిటీ అధ్యక్షులు వినయ్‌భానురెడ్డి ఆహ్వానం పలికారు. కవి గాయకుడైన వెన్న కృష్ణార్జునరావు జాషువా పద్యాలు ఆలపించడమే కాక మొత్తం కార్యక్రమానికి సమన్వయకర్తగా వ్యవహరించారు. 'విశ్వనరుడను నేను' అని ప్రకటించిన జాషువా జీవన కాల పరిస్థితులను విశ్లేషిస్తూ జ్వాలాముఖి ఆధునిక భావజాలానికి ప్రతీకగా వర్ణించారు. కుల, మత, ప్రాంత, లింగ, దేశ విభేదాలకు అతీతం సాహిత్యమని, అది సంస్కారం నేర్పిస్తుందని, కార్మికులందరూ సాహిత్య పఠనం చేయాలని ఉద్బోధించారు. ఈ ఉపన్యాసంలో జ్వాలాముఖిగారి సామాజిక విశ్లేషణ ఆద్యంతము సభికులను ఆకట్టుకుని ఆలోచింపజేసింది. శ్రీయుతులు అశ్వత్థామరావు, దాస్, సాయికుమార్, బొపార, డి. రవికుమార్, పెంటయ్య, బి.డి.ఎల్ సత్యనారాయణ తదితరులు కవితాగానం చేశారు. 'ఏది హిందూ – ఏది ముస్లిం' అనే బోయి భీమన్న గీతాన్ని సాయికుమార్ గానం చేసి సభికుల మన్ననలు పొందారు. చివరగా డి. రవికుమార్ వందన సమర్పణతో సభ ముగిసింది. పూర్తిగా బి.డి.ఎల్. కార్మికులు, ఉద్యోగులే పాల్గొన్న ఈ సమావేశానికి అశ్వత్థామరావు, బి.డి.ఎల్. సత్యనారాయణ, రవీందర్ సహాయ సహకారాలు అందించారు.



అద్దేపల్లి ప్రభును సత్కరిస్తున్న రాచపాళెం బి. సూర్యసాగర్

# ప్రభుకు అవార్డు : 'పిట్టలేని లోకం' ఆవిష్కరణ

ప్రభు రచించిన 'పారిపోలేం' కావ్యం విప్లవ సాహిత్యానికి చందమామ అని జనసాహితీ రాష్ట్ర అధ్యక్షులు సూర్యసాగర్ అన్నారు. అనంతపురం స్థానిక ప్రెస్‌క్లబ్ కాన్ఫరెన్స్ హాల్లో స్పందన అనంత కవుల వేదిక ఆధ్వర్యంలో ఉమ్మడిశెట్టి అవార్డుల ప్రధానోత్సవ సభ నిర్వహించారు. ఈ సభకు అధ్యక్షత వహించిన ప్రముఖ విమర్శకుడు రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి ప్రారంభోపన్యాసం చేస్తూ పురస్కారాలు సమాజాన్ని ముందుకు తీసుకుపోయేవిగా, మార్పును తీసుకొచ్చేందుకు దోహదపడాలన్నారు. 'పారిపోలేం' కావ్యం సమాజానికి ఆస్తి, ప్రజాసాహిత్యమని సూర్యసాగర్ తెలిపారు. అనంతరం 'పారిపోలేం' కావ్య రచయిత ప్రభును సన్మానించి అవార్డును ప్రదానం చేశారు. సమావేశంలో ప్రభ రచించిన మరో కావ్యం 'పిట్టలేని లోకం' ఆవిష్కరించారు. మట్టి మనిషి శీర్షిక రచయిత బొబ్బిలి జయచంద్ర, 'వంటింటి శిల్పం' రచయిత మధుశ్రీకు రాధేయ అవార్డును ప్రదానం చేశారు. ఈ కార్యక్రమంలో పలువురు కవులు, రచయితలు పాల్గొన్నారు.



మరొకడు
కె.వి.ఎస్. వర్మ
వెల : రు.50




'ఆటా' జనికాంచె
(అమెరికా యాత్రా కవితలు)
ఎండ్లూరి సుధాకర్
వెల : రు.50




పాటల చెట్టు
ఎన్. అరుణ
వెల : రు.50



వీర తెలంగాణా పోరాట పాటలు
బండెనక బండికట్టి
వెల : రు.75




జల తరంగిణి
మాచవోలు శ్రీధరరావు
వెల : రు.40



కాంచనమృగం
సలీం
వెల : రు.100



జర్నలిజంలో సృజనరాగాలు
మునిపల్లె రాజు
వెల : రు.100




దామదచ్చియలో...
సుహాసిని
వెల : రు.20




అంతర్మథన వేళ
శైలజామిత్ర
వెల : రు.50




తెలుగు బోధనా ప్రదీపిక
డా॥ రావి రంగారావు
వెల : రు.99




మగ్గం బతుకు
రాధేయ
వెల : రు.30




చదరపు ఏనుగు
సలీం
వెల : రు.75



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor: T. Ravi**

ఆల్బం

# గుర్రం జాషువా



జననం: 28-09-1895 మరణం: 24-07-1971

PRSLM02A(2)








శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు

శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి
రాష్ట్ర పాఠశాల విద్యాశాఖామాత్యులు

# మాతృభాష పట్ల అభిరుచిని పెంచిన పిల్లల భాషాభివృద్ధి కార్యక్రమం

బడి ఈడు పిల్లలంతా చదవగల్గాలని, రాయగల్గాలని, చతుర్విధ ప్రక్రియలు చేయగల్గాలనే సదాశయంతో 64,191 పాఠశాలల్లో 38 లక్షల మంది పిల్లలతో నిర్వహించిన కార్యక్రమమే "పిల్లల భాషాభివృద్ధి కార్యక్రమం" బళ్ళో చేరిన పిల్లలందరూ నాణ్యమైన విద్యను పొందాలనే లక్ష్యాన్ని సాధింపచేయడంలో "పిల్లల భాషాభివృద్ధి కార్యక్రమం" ఎంతో దోహదపడింది. పిల్లల స్థాయి ఆధారంగా పాఠశాలలను గ్రేడులుగా విభజించి ఉపాధ్యాయులంతా తమ విధులను నైతిక బాధ్యతతో నిర్వహించేలా చేయడానికి తోడ్పడింది.

## సాధించిన ఫలితాలు

★ పిల్లల హాజరు శాతాన్ని పెంచింది.

★ ఉపాధ్యాయవర్గాలతో పాటు అధికార వర్గాలతో కూడా జవాబుదారీతనాన్ని పెంచింది.

★ పఠనోత్సవం, భాషోత్సవం మరియు వార్షికోత్సవం వంటి కార్యక్రమాల ద్వారా, పిల్లల ప్రతిభా ప్రదర్శనల ద్వారా పిల్లల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింపచేసింది.

★ తల్లిదండ్రుల్లో ప్రభుత్వ పాఠశాలల పట్ల నమ్మకం పెరిగింది.

★ చదవడం, రాయడం, చతుర్విధ ప్రక్రియలు చేయగల్గిన పిల్లలు గత ఆగస్టు మాసంలో 38% ఉంటే మార్చి మాసాంతానికి ఈ పిల్లల సంఖ్య 62%కి చేరింది.

★ పిల్లలకు పాఠ్యపుస్తకాలతో పాటు, గ్రంథాలయ పుస్తకాలను మరియు బాలసాహిత్యాన్ని చదవడం అలవాటుగా మారింది.

★ 40 నేలపై చిలుకున్న 'డి' గ్రేడు పాఠశాలల సంఖ్య 9909కి పడిపోయింది.

★ అట్లే ప్రారంభంలో 1200 ఉన్న 'ఎ' గ్రేడు పాఠశాలల సంఖ్య 10349కి పెరిగింది.

★ చదవడం 46.38% నుండి 68.79%కు చేరింది. 35.42% రాయగల్గిన పిల్లల శాతం 57.83%కు పెరిగింది. అట్లే కూడికలు 55.05% నుండి 75.54%, తీసివేతలో 45% నుండి 68.89% గుణకారం 30% నుండి 54.38%, భాగాహారం 21% నుండి 45% కి పెరిగింది.

★ పిల్లల భాషాభివృద్ధి కార్యక్రమం సాధించిన ఫలితాలు అన్ని వర్గాల ప్రశంసలను అందుకొని ఈ సంవత్సరం కూడా అమలుపర్చాలనే నిర్ణయం గైకొనడానికి తోడ్పడింది.

★ పిల్లలు ఇతర సబ్జెక్టులను సులభంగా, అర్థవంతంగా నేర్చుకోవడానికి ఉపయోగపడింది.

66

ఈ కార్యక్రమానికి రాష్ట్రంలోని అన్ని ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో అమలు కావడం వల్ల లక్షలాది మంది బాలల్లో మాతృభాష పట్ల ఆసక్తి, అభిరుచి పెరిగింది. ఈ పునాదులపై ఈ సంవత్సరం అమలుపరుస్తున్న పిల్లల అభ్యసనాభివృద్ధి కార్యక్రమానికి ఉపాధ్యాయులు, విద్యాభిమానులు, సాహిత్యాభిమానులు, తమవంతు సహకారాన్ని అందజేస్తారని సర్వ శిక్షాభియాన్ అభిమతం - ఆకాంక్ష.

స్టేట్ ప్రాజెక్ట్ డైరెక్టర్

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A121 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |